విమన్యువు(ఁడు) సం విణ త 1. కోపములేని వాఁడు. 2 దుఃఖములేనివాఁడు

విమర్దకము సం వి అ పుం 1. విసరుట, గుడ చేయుట 2. సువాసన వస్తువులను నలుపుట, చూర్ణముచేయుట. 3 గ్రహణము 4 సూర్య చంద్రుల కలయిక 5 నాశము, ధ్వంసము

విమర్దన సం. వి. అ స్త్రీ 1 గుండచేయుట, పొడి చేయుట 2 నలుపుట, రాపిడి, సంఘర్షణము, ఒర యిక 3. నశింపఁ జేయుట, సంహరించుట. 4. గ్రహణము

విమర్దనము సం. వి అ న విమర్దన

విమర్దము సం. వి. అ పుం 1. నలఁగఁగొట్టుట, చూర్ణముచేయుట 2 నలుపుట, రాపిడి, సంఘర్షణము, ఒరయిక 3 (ఆలింగనమున) దగ్గఱగ నదుముట 4 పొడుచేయుట, చెఱచుట 5 స్పర్శము, సంపర్కము, అనుబంధము. 6. తైలములు మొద లగునవి దేహమున మర్దించుట, మర్దనచేయుట 7 యుద్ధము, పోరు 8 నాశము, ధ్వంసము 9 సూర్యచంద్రుల కలయిక. 10 గ్రహణము. 11 వినుగు

విమర్దితము సం. విణ (అ అ. అ) 1. నూఱఁబడి నది, గుండ చేయఁబడినది 2 రాపిడిపెట్టఁబడినది, సంఘర్షింపఁబడినది 3 పూయఁబడినది, మర్దింపఁ బడినది, రాఁచఁబడినది

విమర్శనము సం వి అ. న విమర్శము.

విమర్శము సం. వి అ పుం. 1 పర్యాలోచనము, సమీక్షణము, పరిశీలనము 2 హేతువాదము, యుక్తియుక్తముగ వాదించుట 3 పరస్పర విరుద్ధమయిన తీర్పు 4. సందేహము, ఎటును తోఁచని స్థితి 5. పూర్వసుకృత దుష్కృతములచేఁ గలిగిన సంస్కారము, వాసన 6 నాటకాంగము లగు పంచసంధులలో నొకటి (నాల్గవది).

విమర్శించు సం న క్రి పరిశీలించు.

కా మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదము లేదు వ రా. 10 8

విమర్షము సం వి అ పుం 1 పర్యాలోచనము, సమీక్ష. 2. ఓర్పు లేమి 3 అసంతుష్టి 4. నాట కాంగములగు పంచసంధులలో నొకటి.

విమలదానము సం వి అ న. దేవత కిచ్చెడి యుప హారము, దేవతా బలి

విమలమణి సం వి ఇ పుం స్ఫటికము

విమలము సం విణ. (అ. ఆ అ) 1. మచ్చలేనిది, కళంకము లేనిది 2 స్వచ్ఛమైనది, పరిశుద్ధమైనది, మురికి లేనిది 3. తెల్లనిది,

న 1. వెండి పూఁత 2. అభ్రకము.

విమాంసము సం వి. అ పుం న. అపరిశుద్ధ మాంసము, కుక్కమాంసము మొ

విమాత సం. వి ఋ స్త్రీ సవతితల్లి

విమాతృజుఁడు సం వి అ పుం సవతితల్లి కొడుకు.

విమాథము సం వి. అ పుం ధ్వంసము, సంపూర్ణ నాశనము

విమానన సం వి అ స్త్రీ. అగౌరవము, అవమా నము.

విమానము సం. వి అ పుం., న అగౌరవము, అవ మానము 2 పరిమాణము, కొలఁత 3 దేవత లాకాశమునఁ దిరిగెడి రథము 4. వాహనము, యానము 5 ఏడంతస్తుల మేడ. 6 గుఱ్ఱము

విమానరాజు సం వి అ. పుం విమానము నడుపు వాఁడు

విమానితుఁడు సం విణ (అ. ఆ అ) అవమానింపఁ బడినవాఁడు

విమార్గగ సం వి అ స్త్రీ చెడు నడవడి గల స్త్రీ. కులట

విమార్గగామి సం విణ (న్ నీ న్) దుర్మార్గమున నంచరించువాఁడు, చెడ్డపనులు చేయువాఁడు.

విమార్గణము సం. వి. అ న వెదకుట

విమార్గము సం వి. అ పుం. 1 చెడ్డదారి, పాడు త్రోవ 2. దుర్నీతి, దుర్మార్గము 3. చీఁపురు.

విమిశ్ర(శ్రిత)ము సం విణ. (అ ఆ అ.) మిక్కిలి కలసినది.

విముక్తకంఠుఁడు న విణ (అ ఈ అ. అ) ఎలు గెత్తి యేడ్చువాఁడు, బిగ్గఱగా నేడ్చువాఁడు.

విముక్తము సం విణ (అ ఆ. అ) 1 విడువఁబడి నది, స్వేచ్ఛగా వదలివేయఁబడినది 2 పరిత్యజింపఁ బడినది 3 (చెఱ మొదలగువానినుండి) విడుదల చేయఁబడినది. 4. ప్రయోగింపఁబడినది, విసరఁబడి నది. (బాణము.) 5 అవకాశ మొసగఁబడినది.

తే. కొడుకుఁ గోడలి రావించి కోటవెలికి, వియ్య మని శిష్యుఁడని కాచి విడిచె నతని, సింహాణితో రాజులు చెనయువారె ... ఉ హరి. 1. 9

2. వియ్యఁపురాలు.

గీ నాకు నీవు వియ్యమవు మంజువాదిని . . దశకు 12 25.

3. చుట్టము.

తే. అనుజ తనుజులు చెలులు వియ్యములు నడుగు, మాఱిపోదురు నీకుఁగా మనుజనాథ ... భార. ఉద్యో. 3. 341.

తే. ... నను నీవు గూడియున్న, నతఁడు నినుఁ గాచు వేడ్క వియ్యంబ నమచు, . భా. రా. అర 189.

తే అనుచు నెయ్యఁపు వియ్యంబు లల్లినల్లి, నర ననర్మోక్తిచాతుర్యసౌష్ఠవముగ, గోష్ఠి సలిపిరి తమలోనఁ గొంతవొద్దు, భోజనా గారవర్యాంత భూములందు. నైష 6. 110.

చ. చెలువముఁదాల్చి తన్గవయఁజేరిన రాగిణి రావణస్వసన్, నలువురు నవ్వ నత్తెఱఁ గొన ర్చక యేలిన వియ్యమై యతం, డలుగఁడు సీత కిట్టి తలఁ పొత్మఁదలంపక యాయమవ్వ భా. కలహముఖం బమందొలఁగు కాఁకకు నాఁకకు లోనుపేయఁడే. అను. 5. 49.

4 చుట్టరికము.

క. దయ్యమెటులుంగున్ వారల, నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్, వియ్యము లును చెడనందిని, బయ్యెద కొంగడ్డమెనఁ బ్రాణము వెడలున్. భార. 9. 401.

తే. తోడికోడలు వగబాటి వీడనాడు, నాఁగడ మొనర్తురెవుడు వియ్యముల వారు. (వియ్యముల వారు = బంధుగులు.) కుశ. 3. 294.

5. వైవాహిక సంబంధము.

క. దేవతలఁగొలిచి ధాత్రీ,దేవతలకు నిష్టధనము దీరతభక్తిన్, నీ వియ్యం బూర్వంబున, నీవి య్యం బమరెఁగాక యిది యల్పంబే. సీమం. 3. 49.

6. వినయము.

వ. వెండియు నమ్మహీమండలాఖండలుండు రాజ్యంబు పాలించుచు గురుజనంబుల యెడ వియ్యంబును సామంతుల యెడ నెయ్యంబును... కృ శకుం. 1 14

జ వియ్యంకుఁడు, వియ్యంకురాలు, వియ్యఁపు రాలు, వియ్యఁపుసాని, వియ్యమందు

విరఁబడు అ క్రి (విరియన్ + పడు) విరయఁబడు. (స్వార్థమందు) 1. విరియు, వికసించు 2 విజృం భించు.

సీ ..., ఊరక విరఁబడు మారనారిచంబు దుండ గంబునఁ దమ్ము ధూళిఁగలయ, .. వరాహ. 4 21

(పై రెండర్థముల కిదియే యుదాహరణము)

విరక్త నం వి. అ స్త్రీ దురకృష్టవంతురాలగు స్త్రీ.

విరక్తము నం విశ (అ ఆ అ) 1. మిక్కిలి యెఱ్ఱ నిది. 2 రంగుపోయినది, వివర్ణమైనది. 3 మనస్సు విఱిగినది, అసంతుష్టమైనది. 4. విషయసుఖము లపేక్షింపనిది, ప్రపంచ సంబంధమును విడిచినది 5 ఉద్రేకముతోఁ గూడినది

విరక్తి నం వి. ఇ స్త్రీ 1 మనస్సువిఱుగుట, అసం తుష్టి 2. విరోధము, అనిష్టము. 3 విషయసుఖ ములయం దపేక్షలేమి, ప్రపంచసంబంధము విడు చుట

విరచన నం వి అ స్త్రీ. 1 ఏర్పాటు 2. కూర్చుట, కల్పన 3. నిర్మించుట, సృజించుట. 4. గ్రంథ రచన.

విరచనము నం వి అ. న = విరచన.

విరచించు నం న క్రి కూర్చు, రచించు.

క ఇమ్మార్కండేయపురాణ మ్మఖిలహితమ్ముగాఁగ నా నేర్పుగలిన్, నెమ్మి విరచించెదను ... మార్కం. 1. 23

విరచితము నం. విశ (అ ఆ అ) 1. ఏర్పఱుపఁబడి నది, చేయఁబడినది. 2 కూర్పఁబడినది, కల్పింపఁ బడినది 3. గ్రంథముగాఁ జేయఁబడినది. 4. అలంక రింపఁబడినది 5 ధరింపఁబడినది 6 తాఁపఁబడి నది, ఖచితము చేయఁబడినది.

విరజ నం వి. అ స్త్రీ. 1. దూర్వాతృణము, గఱిక (వ్యా. వి.) 2 నహుషుని భార్య.

**విరజము** సం. విశే. (అ ఆ అ) దుమ్ములేనిది, రజో గుణరహితము, కామక్రోధాది వికారము లేనిది.

**విరజస్క** సం వి ఆ స్త్రీ ఋతుస్రావము లేని స్త్రీ, ముట్లుడిగిన స్త్రీ

**విరజస్కము** సం విశే. (అ ఆ అ) 1 ధూళిలేనిది 2. కామక్రోధాది గుణములు లేనిది 3 ఆర్తవము లేనిది

**విరజాజి**=విరజాది వి. నవమాలిక, ఒకజాతి జాజి. (వ్య. వి.)

సీ. విరజాజివిరులపై విహరించు విహరించి సొబగు నెత్తావులు చూఱలాడు ... విక్ర 1 95

సీ ఒరపుగా విరజాజిసరులతో సిగవైచి లాగి యొ బురుసాకుకాయిఁ జెట్టి .. దశా. 7 250

సీ విరజాజివిరుల యోవరులముంగిటచాయ నల్లి బిల్లిగ ద్రాక్ష అల్లుకొనియె . కాను 2 67.

**విరజాది**=విరజాజి వి నవమాలిక (వ్య వి) (శ ర.)

**విరజుఁడు** సం విశే (అ ఆ అ) కామక్రోధాదిగుణ వికారములు లేనివాఁడు.

వి అ. పుం విష్ణువు.

**విరటుఁడు** వి (సం విరాటః) విరాటరాజు.

చ. విరటుఁడు నిన్ను నెప్డు. బదివేవురముందట జెప్పు బాహువిస్ఫురితుఁడు శౌర్యశాలి కుల ఖ్యాతి విశేషవిధాయకుండు భూ,భరణ విశార దుండు జనకవ్యతపఃఫలసంభవుండుగా,తర పరి రక్షకుం డనుచు దానికి నీడుగఁజేయు మిత్తరిన్. భార విరా. 4 7

ఆ. వె ఇమ్ముదప్పువేళ నెమ్మెలన్నియుఁదప్పి,కాల మొక్కరీతిఁ గడుపవలయు, విజయుఁ డనువు దప్పి విరటునిఁ గొలువఁడా, విశ్వదాభిరామ వినురవేమ వేమ. 8 భా 156.

**విరణము** సం వి అ. న. వీరణము, అవురుగడ్డి.

**విరతము** సం విశే (అ ఆ అ) 1 విరమించినది, మానినది. 2 ఆఁగినది, నిలిచినది 3. సమాప్తమైనది, ముగిసినది

**విరతి** సం వి. ఇ స్త్రీ 1 విరామము, చాలించుట. 2 (మధ్యమమున) నిలుపుట, తెఱపి, అవకాశము 3. విషయ సుఖములం దపేక్షలేమి. 4. (ఛంద) పద్యపాదమున గ్రుక్క త్రిప్పుకొనుటకై నిలుపు కావు

**విరమము** సం. వి. అ పుం 1 విరామము, ఆఁపుదల 2 సూర్యాస్తమయము

**విరమించు** సం అ క్రి విశ్రాంతినిబొందు, ఉడుగు, చాలించు (శ ర.)

**విరమోపకము** వి ఉత్సాహము

వ పి భటోత్తము కాఠిన్యయాంతరంగాపూరి తాపారవీరరసంబు వెల్లిగొలుపునట్లు విరమోప కంబునఁ దమతమ విశ్రయించిన వీరవృత్తి ప్రకటించుచు ... కు. సం. 11 611.

**విరల(శ)జానుకుఁడు** సం. విశే (అ అ. అ.) దొడ్డి కాళ్ళవాఁడు

**విరలద్రవ** సం వి ఆ స్త్రీ పలుచనిజావ

**విరలము** సం విశే (అ ఆ అ) 1 సందులు గలది, దట్టముకానిది, పలుచనిది 2 సుకుమారమైనది, నాజూకైనది 3. వదులైనది, దృఢముకానిది. 4. తఱచుగాలేనిది, క్వాచిత్కము, అరుదైనది. 5 అల్పము, కొంచమైనది 6. దేశకాలములచే దూరమైనది, దూరస్థము

వి. అ న దధి, పెరుఁగు. (వాచ)

**విరలి**=విరాళి వి వలపు (చూ విరలిగొను)

జ విరలిగొను

**విరలిగొను**=విరాలిగొను అ. క్రి (విరలి+కొను) మోహపడు, వలచు.

సీ. కరియిచ్చె నరమేసి కరిణికి...

ఆ వె మధువిడంబనమున మగలును మగు వలు, విరలిగొనిరి మదనపరవశమున కు. సం. 4. 469

సీ ... గీ తన మహత్త్వంబు దలఁపక తరుణి పొందు,వడయఁ గిఱ్ఱడి తేఁకువ వాపఁదలఁచు, భావజాస్త్రాభిహతి మహాదేవుఁడొక్క, వ్రేలి మిడిఁ జెంపునెడి కడు విరలిగొనియె కు సం. 5 524

**విరళి** విశే విశాలము (శ. ర)

**విరవాజి**=విరవాది వి నవమాలిక (వ్య. వి.) (శ.ర.)

**విరవాది**=విరవాజి వి. నవమాలిక. (వ్య వి.)

రగడ ... మితిలేని తేనె సామెతఁజేసె విరవాది, యితరలతికల మరగి యేగునది వరవాది. మనుచ 3. 84

వృ. రగడ. వాదులేటికి రారె యో సెలువాదు లొదురు చాలు మీచెలపాదితనములు మాని యీ విరవాదియలరులు గోయఁ డిచ్చట ... కిరా. 3. 52.

సీ...గీ. విరవాదియును నవమల్లికాఖ్య వలలు ... అం. భా. 2. 52.

**విరవాయు** అ. క్రి. (క. విర = రెండు.) రెండుగా చీలు.

చ. వనితకుచాద్రులం బొలసిమి చాటవుఁ బొక్కిటి నిండి యుబ్బి జాల్గొని కటిచక్రమాని మెలుఁగుండొడలై విరవాసివచ్చు నూతన కిరణామృతౌఘములు దండహతాంక వదోత్థితంబులై, మను మడివోవిగర్భకలమంబులుగా వెలతాంగిజంఘికల్. వసు 2. 73.

(విరివాసి—క. ర. పా)

**విరవిర**[1] వి 1 త్రెళ్లుటయందగుధ్వని కనుకరణము.

చ.., విరవిరఁ ద్రెళ్ళి వొవ్వఁ దరివిహ్వలుఁడై దశకంఠుఁడు ఘోరరవము లోకసంభ్రమకరం బగువట్లుగఁ బెల్చఁగూసె ... నిర్వ. 4. 93.

2. కరఁగుటయందగు ననుకరణము

సీ ...విమలబంధుస్వాంత విధుకాంతములఁ గటాక్షోత్కృష్టి విరవిరఁ గరఁగుచుండ. వేం పంచ. 4. 345.

3. (ఎండ) కాయుటయందగు ననుకరణము.

ద్వి. వెలిసె వానలు గాడుపు విడిదపెను నెండ, విరవిరయై కాసె వెలువర్యె దెనలు. ద్వి. భాగ. 2. 32. పా

**విరవిర**[2] = విలవిల వి. (సం. విహ్వలః) విహ్వలత. (చూ. విరవిరవాయు, విరవిరవోవు.)

**విరవిర**[3] = బిరబిర క్రి విశ మిక్కిలి త్వరితముగా.

ద్వి. ధరణీశు నాజ్ఞచే దండవరు లిట్లు, విరవిరగొని రాజనీతి నేతేర, నింతింత చేయువ యిండ్లిండ్ల వారు, అంతంత వెలఁగంది యరుదెంచి రంత ద్వి. శ. సా. 2. 57 పా. 9. వం.

**విరవిరవాయు** అ. క్రి (విరవిర[2] + వాయు.) విరవిర వోవు, భయాదులచే అవయవములు స్వాధీనత తప్పు

చ. వరుణుని పాశముం ద్రిదశవల్లభు వజ్రముఁ గాలు దండమున్, సురల సమస్తశస్త్రములుఁ జూచినవాఁడనకాదె యీరఘూత్తరు విశిఖంబు లంత బెడిదంబులు గావవి నాకు నంచుమై, విరవిరవాయఁ జె నదలి విల్లువటం గని రాముఁ డిట్లమున్. భా. రా. యుద్ధ. 850.

**విరవిరవోవు** = విలవిలవోవు అ. క్రి (విరవిర[2] + పోవు.) 1. విహ్వలతనొందు.

చ చరణములుం గరంబులును సంచలభావము వొందఁ బొక్కె మేన్, విరవిరవోవుచున్న యది విహ్వలతుర్యె మనంబు ... భార. కర్ణ. 1. 158.

చ...అ, సరసిజనాభనందను విశాలభుజాంతరముం జగిల్చినన్, విరవిరవోయి మేమునిదు వెంద్రుంక వెట్టఁగ ... భాగ 10. స్కం ఉత్త. 872

చ.. సూతునిఁ ద ద్రథఘోటకంబులన్, విర విరవోవ నేయుటయు నీరజనేత్రుఁడు విన్ననవ్వుతో... భోజరాజా. 4 134.

2. వికసిపోవు

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు వళుంఠితవాల సమీరణమ్ములన్, విరవిరవోయి మేఘములు విష్వవిషాణము లొడ్డికొంచు దుస్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు గన్నుల నిప్పులొల్కఁగా, దురదురవచ్చి భాగ 10. స్కం. పూ 1142.

చ. ఉరుకుచవెంద మెంతమృదువో మటి తియ్యని తుంటవింటనే, విరవిరవోవునారిఁ గొని పెన్నెలి గొజ్జెఁగతూవుచేత వచ్చెరువుగఁ బొంచి కంటికి దిసింపనిశాఁ దపుడేసి ... సారంగ. 2. 38.

**విరసము** నం. విశ (అ. అ. అ) 1. రుచిలేనిది. 2. అనిష్టమైనది, ఇష్టము కానిది. 3. క్రూరము, నిర్దయమైనది.

వి. అ. పుం 1 బాధ, నొప్పి. 2. ద్వేషము

సీ. రోహణాచలమను రూఢిగాక ... వింధ్యాద్రితో సురత్ విరసమెత్తిరిగాక గ్రహచక్రమది యింత గడచియున్నె .. కు సం 3. 246

క. సరసము విరసముకొఱకే,...సు శ. 103.

**విరసించు** సం. అ. క్రి 1 ద్వేషించు, విరోధపడు

సీ. కలనైన నెదిరి పఁదలఁకు ముల్లోకంబు విరసించి యేకూడుఁ దొరయునతని,... శై. భా 6. 191

క విరసించినచో రాజులు, దురమున నెవ్వారి నైనఁ దునుముదు రటుకన్, గుణ నగ్రజునను జన్మోత్సాహమున వధియింపఁ దొట్ట పారిసుతుఁ డటకన్. (వేం పంచ 1 795)

2 వైరస్యముచూపు, విరోధించు.

సీ. పతి నీవు నేకవిచారంబువారలై విరసింపనేల యోవీరమరాళ. భాను 2 56.

**విరహము** సం. వి అ పుం 1. విడిపోవుట, ఎడఁబాటు 2 నాయికానాయకుల యెడఁబాటు, వియోగము 3 తనపటాలము విడిచిపోవుట 4 సమతమునలేమి, అభావము. 5. విప్రలంభ శృంగారము 6. ఏకాంతత, ఒంటరితనము.

**విరహి** సం సం. (న్ జి న్) 1 విరహము గలవాఁడు, ప్రియురాలి నెడఁబాసినవాఁడు. 2. ఒంటరిగా నున్నవాఁడు, ఏకాంతముగా నున్నవాఁడు, ఏకాకి

**విరహిణి** సం. వి ఈ. స్త్రీ. 1. ప్రియునెడఁబాసిన స్త్రీ. 2 భృతి, జీతము, కూలి

**విరహితము** సం. విశ (అ ఆ. అ) 1. విడువఁబడినది, విడిచిపెట్టబడినది 2. ఎడఁబాపఁబడినది 3. (సమాసమ్మున) ఒంటరిగానున్నది,4 శూన్యము, లేనిది.

**విరహోత్కంఠిత** సం. వి. ఆ స్త్రీ. శృంగారనాయికలలో నొకతె, వేళకు నాయకుఁడు రాకుండుటచే విరహముచేతఁ దహతపాపడు నాయిక.

**విరాకులవిత్తు** విశ. (విరియు + ఆకులు + విత్తు) చెడినది.

చ. అలవడ వేదమార్గము విరాకులవిత్తుగ పక్షవాలి విచ్చలవిడిఁ చెంతలందిరుగుచుండఁగఁ దెచ్చితి మెల్లచోట్ల నక్కఱియును నేను .. ప్రబోధచం 2 45.

**విరాగము** సం వి అ. పుం. 1 రంగుమాయుట, వివర్ణత 2 మనస్సువిఱుగుట. 3. అసంతుష్టి, అనిష్టము, అనురాగములేమి. 4 విషయ సుఖములం దపేక్షలేమి, విరక్తి

**విరాగుఁడు** సం. విశ. (అ అ అ.) విషయేచ్ఛారహితుఁడు.

**విరాజమానము** సం విశ (అ అ అ) మిక్కిలి ప్రకాశించునది

**విరాజము** సం వి అ పుం = విరాట్టు.

**విరాజితము** సం. విశ (అ. అ అ.) 1 ప్రకాశించినది, ప్రకాశింపఁజేయఁబడ్డది. 2. స్పష్టపఱుపఁబడినది.

**విరాజిల్లు** సం అ క్రి ప్రకాశించు.

క. పుడమికి విత్తమాత్రపుఁ, బొతువున నాకేంద్రరాజము విరాజిల్లున్ ... పాండు 2 22.

**విరాటక(జ)ము** సం వి అ పుం. ఒక విధమైన తక్కువజాతివజ్రము.

**విరాటపర్వము** సం. వి. న్. న. మహాభారతమున నాల్గవ పర్వము.

**విరాటము** సం. వి అ. పుం 1. భరతఖండమునందలి యొక దేశము, మత్స్యదేశము

**విరాటుఁడు** సం. వి. అ. పుం. విరాటదేశాధిపతి, మత్స్యదేశపురాజు. (పాండవులు వీని కొలువులోనుండి యజ్ఞాతవాసము గడపిరి ఇతని కూఁతురగు ఉత్తరను అభిమన్యుఁడు పెండ్లాడెను. ఉత్తర కుమారుఁడగు పరీక్షిత్తు ధర్మరాజు ననంతరమున కురుదేశమును పాలించెను )

**విరాట్టు** సం వి. జ్ పుం 1 సౌందర్యము, చక్కఁదనము. 2 క్షత్రియుఁడు. 3 ఆదిపురుషుని ప్రకృతు సంతతి. 4 శరీరము 5 (వేదాంతశాస్త్రమున) బ్రహ్మాండాత్మక స్థూలదేహాభిమానియైన యాది పురుషుఁడు.

స్త్రీ. వేదమునందలి యొకానొక ఛందస్సు.

**విరాదము** వి. ఒకవిధమైనపన్ను, నజరానా.

ద్వి ... మన్నీలు చెల్లింపవలసిన నిల్వపల్లలు విరాదములు, సరవిగొనుక దేవసంబు ధాన్యంబు. ద్వి. పరమ. 3. 197 పొ. 14 పం.

విరావి సం. విణ (న్ జీ న్) 1. అఱచునది, బిగ్గరగా ధ్వనిచేయునది. 2. ఏడ్చునది, విలపించునది
విరావిణీ సం వి ఈ స్త్రీ 1. విలపించుట, ఏడ్చుట, బిగ్గఅగా ధ్వనిచేయుట 2 చీఁపురుకట్ట.
విరి వి (√ వి-యు.) పుష్పము, పువ్వు.
గీ తమ్మిపూ మాలి దర్పకు డ, విరులు నీ కాయుధములు గావి ఁ నాఁడు నైష 2 39
చ కనుఁగవఁ బిన్ననవ్వు దొలకన్మని నాథునిఁ గన్న సన్న నిచ్చినఁ దగ భోజనందనయుఁ జేకొని మౌనికి మ్రొక్కి యవ్విరిం దన నెఱి గొప్పునం జెరివినన్ . పారి. 1 55
విణ 1. వికసించినది
క శరదాగమమున ... కైరవాలఁ బండి కఱమ వనంబుల్, గరుసున నెలమిగఁ దామర, విరి పువ్వులతావి కెరఁగు విధమునఁ బొలిచెన్. కు. సం 6. 776
చ దనుజవిరోధిమీద నొకతన్వి కరంబున లాజలెత్తి చేల్లిన నెఱివేణి యూనునఁబలె న్విరిపూవులఁ జల్లెలో చనములు సమ్మదాశ్రువులఁ జల్లె అలాటము ఘర్మబిందులన్, జెమఁగవ నల్లె సంభ్రమ వశ త్రుటి తామలమౌక్తికాలులన్. (పారి. 3. 19)
సీ.. గీ.., విప్పుఁగన్నులు విరిగల్వవిరులుగాఁగ, దశా. 3 28
2. వీడినది (శ ర.)
క... శిరస్థానము కాలుకడగాఁగఁ దా విరి తల లోన్.
క. నిద్దురవోవఁగఁ గనుఁగొని, యద్దిర కడునలుచియైన యది దిలి ... భా రా శాల 482.
క .. విరివేనలితోఁ బురఁబురఁబడి యేడ్చుచుండె భూభాగమునన్ దశకు 4 69.
క. మదిఁ గొఱకొఱనిగుడఁగ న, ప్పుదిమొగముల జోదు ఱేనిపై నూఱ్మలుకుల్, చదల ద్రువ నేసి విరి వ్రాదిదము తెలం గొందఁ జేసి వ్రేల్మిడి నొంచెన్. (ఉ. రా. యు. 504.)
3. విడిచినది, వదలినది
ఉ ... కానె మొగుల్ విరియొండ లత్తఱిన్ అము. 4. 160.
గీ శీల నీప్రావృడాగమ వేళయందు, నిందుజాబిల్లి పండు వెన్నెలలు మింట, నెడనెడలఁ గాయ వరి కంటివేకరంబు, మొగులు విరి యెండవలెఁ దాపమునఁ దెరల్చు రామా 6 21
4 విడి - నున్నది, ప్రత్యే మైనది, చిల్ల - యైనది
వ. కయి బయి బ డుకొల్చు విరిపైఁడియు గట్టి దిమన్ను ఱాయి ఆప్పయు మఱి బ టు కాని నలుఁ బై - ముఁ బెయ్యలు చేలు చెట్లు లోవ యిన సమస్తసంపదలు నన్న విలిక్కి వెచ్చ పెట్టఁగా, ... కళా 6 ౬౫.
విరిం(రం)చను డు సం వి అ పుం = విరించుఁడు
విరించము సం వి. అ పుం దినముయొక్క పదియవ భాగము
విరిం(రం)చి సం వి. అ పుం 1. బ్రహ్మ 2 శివుఁడు. 3 విష్ణువు
విరిం(రం)చుఁడు సం వి. అ పుం. 1 బ్రహ్మ. 2 శివుఁడు. 3. విష్ణువు
విరిఁబోఁడి వి (విరి + బోఁడి) పుష్పమువలె పొప్పిద మైన స్త్రీ
సీ విరిఁబోఁడి చీనిచక్కెరమోవి రుచులాన వలవదే నాలుకగలుగఫలము దశా 2. 307.
క ఈ విరిఁబోఁడి జగంబులెల్ల విరివిగఁ బొగడన్ నీలా 1 87
విరికటారపుజోదు వి. (విరి + కటారము + జోదు) మన్మథుఁడు.
సీ విరికటారపుజోదు వెఱపించె వెలఁది నీకుచ దుర్గముల హత్తుకొనఁగనిమ్ము ... కృ శకుం. 2 183.
విరికిలించు స క్రి (√ విరి) విరియఁజేయు, చాఁచు.
ద్వి. చంకఱదచికొంచు శంకరుఁ బొగడుచును మురుకుచును గెర్లి చూచుచు జన్ని గొముచు గంతులు వేయుచును మనికట్లు, వెఱమరించుచు వ్రేళ్లు విరికిలించుచును పండితా పర్వ. 371. పా
విరికొంతవేల్పు వి. (విరి + కొంతము + వేలుప) పుష్పాయుధుఁడు, మన్మథుఁడు
క అంతట నొకనాఁ డింతులు, సంతసమునఁ గొల్వఁ బైఁడి జంగిడిపైఁ జేమంతుల మాడువు నీ విరి, కొంతపువేల్పువఁగ రాజు కొలువున్న యెడన్. యయా. 5 45.

**విరిగి** వి. శ్లేష్మాతకము, శేలువు, ఒకజాతిచెట్టు
రగడ విరిగి వయింగడు విరిగిరి చావలు...యయా 4. 25
సీ మట్టి విరిగి తొండ్లి మఱ్ఱి తుంకిచ్చెడ పెద్ద విరిగి వక్కి గద్దనెల్లి, .హంస 4 11.
వ శేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల నిరుగుల నెమ్మెల జమ్ముల నేరేళ్ళ మారేళ్ళ ... పి శకుం. 2. 14.

**విరిగొమ్మ** వి. (విరి+కొమ్మ) పూఁగొమ్మ
సీ...కొమ్మ యీ విరిగొమ్మఁ గమ్మతేనియ గ్రమ్మ తెమ్మెమీఱఁగఁ తమ్మ తుమ్మెదలకు ... శశా. 3. 8

**విరిచెండు** వి. (విరి+చెండు) పూలబంతి
సీ. తళుకుబంగరుగిండ్లు తులకించు విరిచెండ్లు నడఁ గించు పాలిండ్ల వమురుదాని ఉ. రా 2 266.

**విరితీవఁబోఁడి** వి. (విరి+తీవ+బోఁడి) అంగన, పూవుఁదీగవలె మనోజ్ఞ శాలగు స్త్రీ
ఉ. ఆ విరితీవఁబోఁడి కృప కద్భుతమంది భవన్ని యోగమే, లా వృథయా ఫలింపక బలాయ బలాయని ... వేం. పంచ 4 300

**విరితేనియ(నె)** వి (విరి+తేనియ) పూఁదే .
చ వాళహాళినప్పు లిచ్చిన క్రియన్ విరితేనియ లాను తేఁటులున్, మలయుచు దాఁచఁబెట్టిన క్రమంబువఁ బండ్లుగ్రహించు చిల్కలున్...ఉ రా 6. 18
సీ. నరసమాధవి పేం విరితేనెపమతోఁ జెమ రించె సురపొన్న చెలియచూడు ఉ రా 1 171.

**విరితేనెమేపరి** వి. (విరితేనె+మేపరి) మధుపము, తుమ్మెద.
క. విరితేనెమేపరులకున్, హరిపీలఁపునరుల కిరుల కజ్జాతకులకున్, గుబురై... చం. శా. 3. 74.

**విరిదట్టు** విశ. (√ విరియు) ఎడఁబాటునొందినది, విడుపుగము
క. విరనంబువఁ దము నితువుర, విరిదట్టుగఁ జేసి వట్టి పెక్కువనుఁతు... (వి. పు. 6 106)

**విరిదలవాఁడు** విశ. (విరి+తల+వాఁడు.) విడి పోయిన జుట్టు కలవాఁడు,
సీ. విరిదలవానిని విరథుని నాయుధంబిడిన వానిని కూరు లేయ రెండు శాం కర్ణ 3. 351

**విరినీరు**[1] వి శా (విరివి+నీరు) సమృద్ధమైన జలము
సీ వఁటేట విరినీట నిరుగారునుం బండుఁ బ్రాసంగు వరిచేలఁ బసిఁడిఛాయ. భీమ. 2 64.

**విరినీరు**[2] (విరి+నీరు) పన్నీరు

**విరిపిడియము** వి (విరివి+పిడి+అమ్ము) పెద్దబాకు.
క కట్టినదట్టి కటీతటిఁ, బెట్టిన విరిపిడియ మెక్కు వెట్టిన విల్లున్, మెట్టిన యోగవాళ్లుంగను,వట్టిన పన మూఁతుఁడవుడు పాంథుల వెడకెన్ శా వి 3 16.

**విరిపోటు** వి (విరి+పోటు) భేదము
క పేఁటు తీరిపులతో విరిపోటగు సఖుపాంథు మొకటి పుట్టింపఁ దగున్ . (కవిక. 2 44)
సీ వబోఁడి గావించెనే యింత విరిపోటు తల్లి నీకు పనిపు త్తరుణితోఁడ... ప్రబోధ 3 3

**విరిపోటుసేయు** అ క్రి. (విరిపోటు+చేయు)
1. భేదముకల్గించు.
ద్వి. విడిపోవఁగఁ బల్కి విరిపోటుసేసి, జోడుఁ బావుము దాన సురసమై జరుగు ... ద్వి. హరిశ్చ పూ 2447 పం
2. పాడుచేయు, చెఱుచు.
సీ. పీటతమ్ముల విరిపోటు సేయకయున్న దోషాకి భూతుఁడై తొలఁగకున్న .. వరస. 5. 160.

**విరిభము** సం. వి అ. పుం 1 స్వరము, (మఞ్జరి) 2 ధ్వని (విల్సమ్స్)

**విరియఁబడు** అ క్రి (విరియన్+పడు, స్వార్థమున) విరియు, వీడిపోవు
చ కమఁగవ్రమ్మాన్పడంగ నెఱిక ల్విరియం బడ బోరమోవ, నెండిన వదనంబులం తెఱచి నిక్కిన యట్టులు దల్లడించుటల్, గనఁబడ మూరువుల్లకముగా నిగుడవ్వడఁ గుంది యూ రెలుం,గునఁ దమవానిఁ బిల్చుచు శకుంతములు త్యెగ్గక నిల్చె బ్రాకులన్. (పాం. 4. 21.)
2. వ్యాపించు, క్రమ్ము.
సీ. కట్టిన చీనాంశుకంబుల పింజెలు మొరయు మట్టెలఁమీఁద పెరియఁబడఁగ .. వరాహ 4. 183

**విరియఁబాఱు** అ. క్రి (విరియన్+పాఱు, స్వార్థమున) 1 వికసించు.

మ. విరియంబాఱిన గొజ్జెఁగల్గురియ మున్నీరైన యక్కమ్మనీరు. ఆము 5 121

2 విచ్చు, విడిపోవు

సీ రాతునీ కబరీభరంబుల చాడ్పున విపులాంధకారంబు విరియఁబాఱ భా శా శయు. 1431

సీ తిరముగా ముడువమి విరియఁబాఱెడు కొప్పుఁ దోడ్తోడ నొకకేలఁ దుఱుముకొనుచు కళా 8 156

3 వ్యాపించు, క్రమ్ము

గీ కాంత కబరీభరంబను కారుమొగులు, వితతముగ వ.తకంతకు విరియఁబాఱె కళా 7 166

4. పగులు, భేదిల్లు

చ అలరు నురంటిగూండ్ల మును వంతటఁబెట్టిన కొండుమల్లె మొ,గ్గలగమి గాలిగ్రుడ్లు తటిగావున వే విరియంగఁబాఱఁగా చంద్రా 2 82

**విరియఁబోయు** స క్రి (విరియన్+పోయు.) (తల వెండ్రుకలు ముడివిప్పి) వ్రేలఁజేయు.

సీ. విరియఁబోసిన జటావిసరంబు కెంజాయ సాంధ్యరాగంబుపైఁ జౌకళింప దశా. 3 52

**విరియాట** వి (విరి+ఆట) స్వేచ్ఛావిహారము

ఉ. ... వృక్షగొమ్మలఁ జెందు వారలు తగు విరియాటలు నేరకుందురే (వసు. 3. 138) (పువ్వులందలి యాట యని యర్థాంతరము)

**విరియించు** స క్రి (√ విరియు,) 1 వికసింపఁజేయు

క విరియించి తామరలలో, వరుణాంశులు సొచ్చి సుభగమగు సౌందర్యస్ఫురణము నొందఁగఁ దోఁచెం, దరణి యుదయశిఖరిమీఁద ధరణీనాథా. (భార ద్రో. 5 18)

సీ సముదభాగస్థితి సంపెంగ విరియించి చంద్రాస్య యోర్తు పుష్పములుగోసె పి శకుం. 2 138

2. విప్పు, తెఱచు

గీ ఇందుబింబాస్య నారాక కెదురుచూచు, నయనములు వేయు విరియించి నాకభర్త నైష. 4. 64,

3 చెదరఁగొట్టు, తోలఁగఁజేయు

సీ మూఁకల విరియించి వీఁక నాచార్యాది యోధులనెల్లను నొక్కదెసకు, వెలచి .. భార ద్రో 2 156

లయవిభాతి. పారుల పారియించుచును గరుల విరియించుచును గిరుల ముట్టియించుచును రురులఁ గూరిగొంచున్. ఉ రా. 7 87

4 నశింపఁజేయు

ద్వి చీఁకటి విరియించు చిఱువవ్వు బసిఁడి, రేకులతో నెదురించు చెక్కిళ్లు. ద్వి. పారిజా. ఉ. 318.

ద్వి పోరి భూతకోట్లను బుట్టింపఁ బెంప, విరియింప నొక్కడె వెరవైనవాఁడు రం రా ఉ 103. పొ 10 పం.

క. చరియించుఁ త్రిభువనముల, మొరయింతువు మహితియందు మురరిపుచరితల్, విరియింతువు భవతిమిరము, వరియింతువు ముక్తికాంత వనజభవసుతా. రుక్మాం 1 158

**విరియు** అ. క్రి (క విరియు. త. విరి) 1. వికసించు

సీ నిండారఁ విరిసిన పుండరీక శ్రేణి యామినీరమణిరేఖాళి గాఁగ (నైష 1, 86.)

క చలికరువలిను, నొప్పలపమున విరియు పరువపుఁ, దొలుమొగడల వలపు దెలుపు తోటలతో నన్ పారి 5 103

క రావణు నుద్యోగమునకు, దైవము ప్రతికూలమైనఁ దత్త్వనిధిధ్యానావేశ విరామంబై, యావనచరవిభుఁడు గన్ను లరవిరియంగన్. నిర్వ. 7. 78

2 పుష్పించు, పూచు

మ . అతఁడున్ దోఁచిన నవ్వుడున్ విరిసెఁ బ్రాంతాంచన్న మేరుద్రుపున్ ఆము. 5.128.

3. విడిపోవు

క . పోరిఁబోతిగ నయంబున ముడి,విరియ వలువ చెఱఁగు వట్టి వ్రేతల నీడ్చెన్ పారి పూ 5 187

చ. ఉరవడి నేగుచోట నొక యుగ్మలి యొల్లె చెఱంగు మేదినీశ్వరుని భుజావిభూషణము వజ్రముఁ దవులంగఁ జాఱినన్, విరిసెను నీవి బంధము ... నై 3, 84.

ద్వి కాంచిన యలకలనెఱులుఁ జిక్కొదవి విరిసిన జడలను విన్ననై మురువు,వాడిన మోములు ... (ద్వి హరిశ్చ పూ 1126)

4 విచ్చిపోవు, విశ్లథమగు.

వ అంతట ధరణిచక్రం బమ్మహాసలిల మధ్యంబున మహోదకంబుల స్వల్పలోష్టపిండంబు విధంబున విరిసి చెడు. (సీతారా 2 168)

సీ. వీని చెల్వముఁవార్త విన్న భయంబున బ్రీహి గర్భంబులు విరియకున్నె కవిక 6 154

గీ విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్నఁ, గంటులన్నియుఁ బ్రియుఁగూడి కైవుమిగిలి, పెనఁగు నెడనెట్టవిరిసె పావనిత మేనఁ, గలయ నవనఖదంతవిక్షతము లడరె కు సం 8 178.

ద్వి వెన వార్థిలో నోడ విరియు చందమున ద్వి భార విరా 4 70.

5. చెదరు.

చ మురదనుజుండు పౌరవసమూహమునుంగని రాజరాజుపై, శరనికరంబు పుచ్చి తనచక్కిన యెక్కిన యక్షగుహ్యకుల్, విరియఁగ ఖడ్గపాశముల బ్రేసిన వచ్చిన త్రోవ వట్టరి ఉ హరి 1. 40.

క. పురికొనుచుం జెండలుచునో, హరి సాహరి నొక్క చోట నలవడునొండో, విరియు నొకచోటఁ దిరుగు-, దిరుగక యొకచోట రెండు దెలఁగలు నొచ్చున్. భార భీష్మ 3 178.

6. తొలఁగు.

వ అవిద్యావ్యవధానంబు విరిసినం దోఁచు పరమాత్ముని ప్రకారంబున .. నైష 4 2

సీ. వీడెంపు బలుకెంపు విరిసి వెన్నెల గాయ వరి గింజ నొకటఁ బ్రువ్వరునఁ దోమ. ఆము 1 60

సీ. పై మొగుల్ విరిసిన బాలేందుకళరీతిఁ బులుకడిగిన రత్నకళికలీల పరమ. 2 28

చ వరవరవాసవుం డడిగివన్ గురుఁ డిట్లనిచెప్పె బుద్ధితోఁ, బోఁయని పాతకంబులు వబుద్ధిక పుణ్యముల న్నశించు నం,బరమునఁ బట్టినట్టిమల పంకము గారములోన వద్దఁగా, విరిసిన యట్లు నమ్మనియిది వేదము సెప్పిన నేనుఁ జెప్పితిన్, భార. శాం 3 364.

క అజితాత్ముండైన యాతని, విజయంబును సిరియు విరియు వేగంబ శర,ప్రభవనితజల ధరములు గడు, విజములగునె యంబరమున నిముసంబైనన్. నృసిం 2. 140.

మ కురిసె న్వానలు సస్యవృద్ధి గలిగెం గొల్చి పుక్కడై యమ్మె నెవ్వరు రోగంబులచేత జావరు మృగవ్యాఘ్రాది దుర్దోషముల్, విరిసెన్ సాధుమతంబులెల్ల నడచెన్విఖ్యాత సౌఖ్యంబులో, ధర శోభిల్లె శమంతకాఖ్యమణిరత్న స్థైర్యసంపత్తిచేన్ వి. పు 6 325

7 రాలిపోవు.

గీ మధువుఁ గాంతల పుక్కిటిమధువుఁ జేల్ల, యార్ద్రలఁ బసనూపఁ బోగడపై నెలయదాన, విరిసెఁ దొల్లిటిదళములు . ఆము 5 180

8 వివశమగు

క. .. బంగారముఁబోలెడు కొడుకున, కేరూపున నైనఁ బాపు మీ సంకటమున్.

మ అనినం దల్లడమంది మేను విరియన్ హాయించు గోపాలభామిని హరి పూ 5 246

9 అదృశ్యమగు, అడఁగు

క కుముదములుఁ దారు నొక్కటఁ, బ్రమదంబున నుండి వానివరవి దొలఁగినన్, దమకున్నిలువఁగఁదగదను,క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్ భార ఉద్యో. 2 108

గీ ప్రకటదౌహృదకుంభసంభవవిభూతి, యౌవనారంభఘనవిలాసార్ణవంబు, నింకఁ జేసినచోఁ దిరోహితములైన, తత్తరంగంబులన వింతి తబులువిరిసె విప్ర 1 72.

చ . చిట్టుముల్, గరమొదవెన్ వళుల్ విరిసెఁ గన్నుల నోలముదోఁచె . వరను. 2 170

10 భగ్నమగు, విరుగు

గీ నేమి విరిసిన శకట వన్నెల నెలవు, నేమిశంబయ్యె నదియ తా నైమిశంబు ... కాశీ 1 77

11 వ్యాపించు

ఆ అంత మదయశైలమను నశోకద్రుమ, సమితి యందుఁ గాంతి చారుభంగి, నెఱయవిరిసి తొలుత నెగసిన యుజ్జ్వల, స్తబకమనఁగఁ బద్మసఖుఁడు పొడిచె. భార ఉద్యో 2 113

ద్వి కండ క్రొవ్వునఁగాల కౌశికుమీఁద, మండు కోపము చంద్రమతిమీఁద విరిసి, పాడిఁజెప్పఁగ నిన్నుఁ బనివడి యిచటి, కేడముక్కిఁడి తెచ్చె ద్వి హరిశ్చ ఉ 1188.
వెల్లివిరియు—వెల్లి = ప్రవాహముగా, విరియు = చెదరు—ప్రవహించు.

క. కెంటను ... మదీయ మూర్ధము, వెంటంగా వక్రగంగ వెల్లివిరియుటన్ హర 4 57

12. పొంగు

క మినుమినుకు మినుకుమనియెన్, బెనుమినుకుల బరణి ధరణి బిట్టూటాడెన్, వననిధులు విరిసెఁ గురిసెన్, గనగనగనమనుచు నిప్పుకలు గుప్పలు గన్. (పాండు 5 188)

న క్రి విడుచు

గీ కార్య మొక్కఁడు గనిన మాత్సర్యమున నొకండుగాదని ఖండించుఁ గన్నెఱింగి, యిరువురను గాదనక కొల్వువిరిసె మీఁద, నల్లవాఁ డెన్నినది సేయనగు శుభంబు. ఆము 4 227

వ సర్వసేనాన్నాహంబులు సమకట్టుమని పనిచి కొలువు విరిసి చనియె భార ఉద్యో 4 210

క జనపతి మునిపతిఁ బూజావినుతి వతిక్రియలఁ బల్లవిలఁజేసి ప్రియంబున వీడుకొలిపితానుం, జనియెఁ గొలువు విరిసి రత్నసదనంబునకున్ వేం పంచ 4. 108

జ. విక్కవిరియు, విరఁబడు, విరవాయు, విరాకుల విత్తు, విరి, విరిఁబోఁడి, విరికటారపు జోడు, విరికిలించు, విరికొంతవేల్పు, విరిగొమ్మ, విరిచెండు, విరితీవఁబోఁడి, విరితేనియ, విరితేనెమేపరి, విరిదట్టు, విరిదలవాఁడు, విరినీరు, విరిపిడియము, విరిపోటు, విరిపోటుసేయు, విరియఁబడు, విరియఁబాటు,విరియఁబోము, విరియాట, విరియించు, విరివి, విరివింటదంట, విరివింటదొర, విరివింటివాఁడు, విరివిడి, విరివిలుకాఁడు, విరివిల్తుఁడు, విరివోడి, విరిసరి, విరులెత్తు.

**విరివి = విఱివి** వి. (√ విరియు) 1 ఆధిక్యము.
రగడ వెలయు కురువింద పూవిరులను మురువుచు రాఘు 2 6.
ఉ. కావిరి యంతటం గ్గలయఁగా విరివిన్ గనుపెట్టె సర్వశైలావళి ఘూర్ణిలెన్ ... ఫరఫు 77,

క ఒక్కని విరివికిని దొరల్, పెక్కండ్రే నొక్కనొకని వెంబడి...(ఆము 4 214)

సీ విలసిల్లు త్రివళుల విరివితోఁగూడంగ విరివి నెమ్మనముల విస్తరిల్ల (విక్ర 1 166)

3 వెడలుపు

గీ. నాగ...యిన్నూరు యోజనముల నిడుపున శతయోజనముల విరివి, ఫలితఖర్జూర గోస్తనీలలితమగుచు. వరాహ. 10 136

విఱ 1 విస్తృతము, విశాలము

గీ ... ఇంక నొండొక విరివియౌ నెడ వసింపఁ, జేయుమెందైన... దశా 1. 141.

2 అధికము

మ తరుణా .. శరధిం గప్పలి జోగులన్ విరివిగా సామాన్లఁ దెప్పించు నేర్పరి...హర 1 27.

క అరచేతి ఈవిరిఁబోఁడి జగంబులెల్ల విరివిగఁ బొగడన్ నీలా 1 87

**విరివింటిదంట** వి (విరి + విల్లు + దంట) మన్మథుఁడు, పుష్పధన్వి

చ. అల విరివింటిదంట తదిలాధిపమోహము నెమ్మనంబునన్, గలవలమానభేదిమణికైశికఁ గెందలిరాకుముల్కులన్, గలవల మాన మూనె వలు కన్నవసంగరముద్రదనిల్చి మం,గలవలమానమీన తిలకధ్వజశోభి మరుద్రథంబునన్. చంద్రికా. 4 15

**విరివింటిదొర** వి (విరి + విల్లు + దొర) మన్మథుఁడు, పుష్పధన్వి

క పోల్పఁ దొలి మినుకు దెఱఁగున, వేల్పించిన పిదప రాచవిరివింటిదొరన్, వేల్పులకున్ మ్రొక్కించిరి... యయా 4 113.

**విరివింటివాఁడు** విఱ (విరి + విల్లు + వాఁడు) పుష్పధన్వి, మన్మథుఁడు

క విరివింటివాఁడపుగదా, శరంబాగతులైన పాంథజనులను రఱంతురుగా కిటులను పేఱం,తురె పైకముగూడఁ బెటఁ దొడఁగుచు మదనా విజ వి 8 43

(గొప్పయింటివాఁడు అని అర్థాంతరము)

**విరివిడి** వి. (విరిసి + ఇడి, స్వార్థమున) విస్తృతి
విఱ విస్తృతము. (శ ర, శా.)

విరివిలుకాఁడు వి. (విరి+విలు+కాఁడు) మన్మథుఁడు.

చ తిరుగుచుఁ జాల్పులైన మగతేఁటులు మీఁదుడు ఱేఁగ చూచితే, విరివిలుకాఁడొనర్పు వలవేలిమి మంటలపైఁబొగ ల్వలెన్. యయా 5 54.

విరివిల్తుఁడు వి (విరి+విల్లు) పుష్పధన్వి, మన్మథుఁడు

సీ. విరివిల్తు వతనిదేవేరిఁ గన్నుఱిఁ దమ్మిరేకుపై వ్రాసి గుఱించి నిలిపి. (యయా 4. 28)

ఉ .. నన్ విరివిల్తుఁ డమ్ములన్, గ్రుచ్చి జయించె ... సమీర. 3. 248

విరిపొడి వి (విరి+పొడి.) పుప్పొడి, పరాగము

ద్వి అరుదంచి పూఁదేనియలకాల్వఁదాఁటి, విరిపొడి నెత్తంబు వెడచాయ వెదలి ద్వి పరమ 4. 277.

విరిసరి (విరి+సరి.) పుష్పమాలిక

చ. విరిసరి వేవలిన్ గళమునన్ మణివల్లరి యంఘ్రివల్లవున్, పరివణి కాంద్రిలోకి యమునానకుఁ కానొక నీటువెట్టు వం,బరతటనీ వతంస మిది పావకమూర్తి గతిం ద్రిథావరి,స్ఫురణముఁ బూనుకొన్న విధమున్ వివరించెద నీకు రాఘవా (చం. రా. 3. 8.)

విరుగ్ణము నం. విశ (అ ఆ అ) 1. మిగుల విఱుగఁ గొట్టఁబడినది, పగులఁగొట్టఁబడినది 2 వశింపఁ జేయఁబడినది. 3. వంగినది 4 మొద్దువాఱినది, కుంఠితము.

విరుతము నం. విశ (అ. ఆ అ) 1. అఱచునది, బిగ్గఱగా ధ్వనిచేయునది 2 మాఱుమ్రోయునది, ప్రతిధ్వని చేయుచున్నది

వి. అ. న. 1. అఱపు, కేక, బొబ్బరింత 2 ధ్వని, పెద్దధ్వని 3. పక్షికూజితము, తుమ్మెదల ఝుంకారము.

విరుదితము నం వి అ న 1 పెద్దయఱపు.2 పద్యు.

విరుద్ధధీ నం విశ (ఈ.) దుష్టబుద్ధిగలవాఁడు, దుష్టుఁడు

వి. ఈ. స్త్రీ చెడుబుద్ధి, విపరీతబుద్ధి.

విరుద్ధపడు మి. అ క్రి. (విరుద్ధము+పడు) విరోధపడు, కలహించు.

వ బద్ధాంజలియై శుద్ధబుద్ధస్వరూపిణివగు నీతో విరుద్ధపడు దురాత్ములకుఁ దగినయట్లయ్యె ప్రబోధ 4. 58.

విరుద్ధపఱచు మి న క్రి. (√ విరుద్ధపడు) విరోధింపఁజేయు.

వ వేదమార్గోపనిషత్తులతోడ శ్రద్ధను విరుద్ధపఱచి . ప్రబోధ. 3 2.

విరుద్ధమతికృత్తు నం. వి క్ పుం విపరీతార్థము స్ఫురింపఁజేయుట యనెడి ఒకానొక కవితాదోషము

విరుద్ధము నం విశ (అ ఆ అ) 1 ఆటంకపఱుపఁబడినది, అడ్డుపెట్టఁబడినది 2. మూయఁబడినది. 3. ముట్టడింపఁబడినది 4 భిన్నమైనది, పరస్పరము విరోధముగలది. 5 వ్యతిరేకమైనది, వ్యతిరేక గుణముగలది 6 (తర్క) విరుద్ధభావమును రుజువుచేయు హేతువు, (తర్క) ఒకానొక హేత్వాభాసము 7. పగగలది. 8. ప్రతికూలమైనది 9. (ఆహారము) నిషేధింపఁబడినది. 10. అవర్ణ్యము, కూడనిది 11. వైకిఁద్రోయఁబడినది 12 సందేహాస్పదమైనది, సందిగ్ధమైనది.

వి అ న 1 వ్యతిరేకము, విరోధము. 2 అనిష్టము, అసమ్మతి, పొసఁగమి.

విరులెత్తు అ క్రి (విరులు+ఎత్తు) పుష్పించు

చ తరుణుల కౌఁగిటన్ననుచు తమ్ముల వృథా విరులెత్తఁజేసె మోపరులుగఁ జైత్రుఁడంచు.... అము 5. 126

విరూక్షణము నం. వి. అ, న 1 మోటగాఁజేయుట, మొద్దుగాఁజేయుట 2. విరేచనములు కట్టించుట. 3 నింద, దూఱు 4. శాపము, తిట్టు

విరూఢము నం విశ. (అ ఆ అ) 1 అంకురించినది, మొలకలెత్తినది 2. బయలుదేఱినది, పుట్టినది 3. మొగ్గతొడిగినది, వికసించినది 4 ఎక్కినది, ఆరోహించినది

విరూపకము నం విశ (అ. ఆ అ) 1 విరుద్ధమగు రూపము గలది 2. భయంకరమైనది

వి ఆ పుం మాఱుపేరు

విరూపకరణము నం వి అ న 1 కురూపినిఁజేయుట 2 హానికలిగించుట, అపాయముచేయుట.

**విరూపము** సం విశ (అ ఆ, ఈ అ) 1 అంగ వికారముగలది, వికృతమైన రూపముగలది 2 స్వభావవిరుద్ధమైనది 3 స్త్రీ బహురూపము, పలు రూపములు గలది

వి అ న 1 కురూపము, అంగవికారము 2 బహువిధరూపము, విభిన్నస్వభావము

**విరూపాక్షుఁడు** సం విశ (అ ఈ అ) వికారముగల కన్నులుగలవాఁడు, సరిగాలేని కన్నులుగలవాఁడు

వి. అ పుం శివుఁడు, విషమనేత్రుఁడు

**విరూపి** సం విశ (న్ జీ న్) కురూపము గల వాఁడు, అంగవికారముగలవాఁడు

వి న్ పుం. అడవిపిల్లి

**విరేకము** సం వి అ. పుం 1 భేది, మలముపోవుట, పాసనము 2 భేదిమందు, విరేచనములుకలిగించు మందు.

**విరేచనము** సం వి అ న = విరేకము

**విరేచితము** సం విశ (అ ఆ అ) విరేచనమైనది, మలముపోయినది.

**విరేఫము** సం వి అ పుం 1 ప్రవాహము, నది 2 మదము (వాచ)

విశ (అ ఆ అ) రేఫమను వర్ణములేనిది

**విరోకము** సం వి అ పుం, న రంధ్రము, కన్నము. పుం కిరణము.

**విరోచనసుతుఁడు** సం వి అ పుం బలిచక్రవర్తి

**విరోచనుఁడు** సం వి అ పుం 1. సూర్యుఁడు 2. చంద్రుఁడు 3 అగ్ని. 4 ఒకానొక రాక్షసుఁడు, బలిచక్రవర్తితండ్రి, ప్రహ్లాదుని కొడుకు.

**విరోధకారి** సం విశ (న్. జీ. న్) కలహములు కల్పించువాఁడు, పగకల్గించువాఁడు, కల్గించునది

**విరోధకృత్తు** సం విశ (త్) = విరోధకారి

వి. త్. పుం. 1, శత్రువు 2. ప్రభవాది సంవత్సరములలో నొకటి

**విరోధనము** సం. వి అ న. 1 వైరము, విరోధము 2 ఆటంకము, అడ్డగింత, నిరోధము 3 ముట్టడి. 4. ప్రతిరోధము, ఎదిరించుట 5 పొసఁగమి, పర స్పర విరోధము

**విరోధము** సం వి. అ పుం 1 శత్రుత్వము, వైరము, పగ. 2 ఆటంకము, అడ్డు, నిరోధము. 3. ముట్టడి. 4 ఆఁపుట, నిలుపుట 5 పొసఁగమి, పూర్వోత్తరములు సరిపడకుండుట 6. వ్యాఖ్యానము, భేదము 7 కలహము 8 దుఃఖము, కష్టము 9 (అలం) ఒకయలంకారము, విరోధాభాసాలంకారము (పూర్వోత్తరములకు వైరమున్నట్లు భాసించుట).

**విరోధి** సం విశ (న్ నీ. న్) 1. ఎదిరించువాఁడు ప్రతిఘటించువాఁడు 2 ముట్టడించువాఁడు 3 వ్యతిరేకభావము గలవాఁడు, విరుద్ధుఁడు. 4 పగగలవాఁడు, శత్రుత్వము గలవాఁడు 5 కలహశీలుఁడు, పోట్లాడువాఁడు.

వి న్ పుం 1 శత్రువు, పగవాఁడు 2 ప్రభవాది సంవత్సరములలో నొకటి

**విరోధించు** సం న క్రి ద్వేషించు, పగఁగొను

మ హరి.. మును మీయయ్యన్ విరోధించి రొక్కరుఁడు గ్రాసి వధింప ... ఉ రా. 3. 117

**విరోధోక్తి** సం వి ఇ స్త్రీ విరుద్ధముగాఁ జెప్పెడి మాట, విరుద్ధ వాక్యము, విప్రలాపము

**విరోప(హ)ణము** సం వి అ న 1. (వ్రణము) పుండుమాన్పుట 2 మొక్కలు నాఁటుట, (పాతి పెట్టుట)

**విరోహము** సం వి అ పుం పెరుఁగుట, మొలకెత్తుట

**విర్గు** = విఱుగు అ క్రి తునియు, భగ్నమగు

ద్వి ఏమ వినోదమై రెక్కలు తివియఁబోనివఁ జాపమువ్వుడు విర్గెఁగాక. శం. శా కాం 78. శా. (క. శ. శా).

**విర్చు** = విఱుచు స. క్రి విఱుగఁజేయు, ముక్కలు చేయు.

శా అట్టె...మంచి వల్లెలుకుల్ భారంబుగావిర్చి వేశ్కట్టె నోమ్మపు ... హర 2. 8.

చ పెళ్ళఁ దరుశాఖవిర్చి కపి యచ్చటిచేరువఁ బల్వలోదకంబునఁ బడవైచెవంత వెలపుట్ట ఖగాంగన గూయుచుండగన్. శేయూర 3. 180.

**విఱవిఱకపోవు** అ క్రి తాపమునొందు

క ఆపాతాళగభీరజ, లాపూర్ణమహా ప్రవాహమై వను గూపా, రావలిమిత పరమైనం, జాపము విఱవిఱకపోవఁ జొచ్చెం దనువుల్ వేం. పంచ 3. 65,

**విఱవీఁగు = విఱ్ఱవీఁగు** అ [క్రి] గర్వపడు

క వింటికి సరిబోము కౌనల,వింటికి సరిదొరక వెంత విఱవీఁగిన నె,వ్వంటికి వలపంటికి వల,వంటికి వల పాఱు గుబ్బపాలిండ్లసిరుల్ అచలా. 2 40

**విఱిగి** వి స్ఫోటభూమి

ఆ విఱిగ నాఁగ స్ఫోటపృథివికి సంజ్ఞయా ... ఆం. భా 2. 4

**విఱిచికట్టు** న. [క్రి] (విఱిచి+కట్టు) (ఱెక్కలు) వెనుకకుఁద్రిప్పికట్టు.

ఉ. పట్టుఁడు పాఱుఁడంచు నరపాలుని భృత్యులు నందడించుచున్, గట్టిగ నాతనిన్ విఱిచికట్టిరి తన్నిలయంబు ముట్టుకో,లఎట్టిరి ... సారంగ 3 166.

సీ. తలనొప్పియనరాదు ధరలోన నెవ్వారు విఱిచి కట్టించు నశ్వముల నౌకట ... దశా 4 117.

సీ. పెనిమిటిగలదాన వని కాటుక ధరింప వేఱు కలాయని విఱిచికట్టు శుక. 2 115.

గీ బహుభూషణదురీణ బాహువల్లరులకా కలఱు ముప్పిరిద్రాళ్ళ విఱిచికట్లు ... సారంగ. 3. 87.

ద్వి. కటకటా గోలవుగదర నాయన్న, మటు మాయచిద్రాంగిమాటలే నీకు, విఱిచి కట్లాయెఁ బృథ్వీపతి విన్ను, నఱుకంగ నెలవీయ నాలు కెట్లాడె ... ద్వి శ. సా 2 58 పా. 17 వం.

**విఱివి = విరివి** వి. వి స్తృతి

చ. తరుచయు నీలనీరదవితానముపై వయిగప్పి యెంతయున్, విఱివిగ నేలయున్ దిశలు నింగియు నిండఁగ బర్వి మార్క. 2 165

విశ. వి స్తృతము.

ద్వి. తెఱనోరు కరిమేను దీర్ఘజిహ్వాయును, విఱి వైనరూపును విషమదృష్టియును .. రం రా అర. 157. పా 28. వం.

సీ. బలుతల్పుపగు ను స్థలముపై విఱివియాతమి విల్చి యేమేమొ తలఁచి తలఁచి ... ఉ రా. 6 154.

**విఱుగఁబడు** అ [క్రి] (√ విరుగు.) 1. పాఱిపోవు, పలాయనమగు.

వ. ఇట్లు వెడలి చెట్లువిండ్లు వంచుకొని ఘుంచుకొను న న్నల్లప్రవణం జూచి హల్లకల్లోలంబై విఱుగఁబడు నెడ .. ఆము 6 76.

2 గర్వించు (శ ర.)

**విఱుగఁబాటు** వి (√ విరుగఁబడు) 1. గర్వించుట (శ ర) 2 ఓడుట

గీ. విఱుగఁబాటుల వీఁపున వెడలుగొఱక,లు ... కవిక 2 (శ ర)

**విఱుగడ** వి (√ విఱుగు) 1. విరామము.

వ సాంసారికబంధంబులం దగులువడి మానవులు విఱుగడలేకున్నవారు భా రా యు 2385

2. విమోచనము.

వ హనుమంతు ప్రసాదంబున భవత్కర్ణ పాశం బులు విఱుగడయ్యె రమ్మని .. మై. 3 131

**విఱుగు** అ. [క్రి] రూ విర్గు 1 తునియు, ముక్కలగు.

క నెఱిగలుగు వాఁడునాఁటికి, . చిఱుఁదొడలు నడుము నట్టును, విఱుగకతక్కదని గిరిజ వెఱ చుచు నడచున్ కు సం 8 7

క అఱువుడు గావిమునుంగును, విఱిగిన దండంబుఁ దునిసి ప్రేలిడుగోఁచిన్, బఱియయిన కమండ లమును, చుఱచుఱయై వేఁడికెఱఁగు చూపుల తోడన్ ఉ హరి. 4. 78

సీ నవ్యాపనవ్యముల్ శరములేయుటమాని వెఱఁ కులు విఱుగంగ నిలుగువాడు. వరాహ 11. 126

2 విర క్తమగు, అన క్తి లేకుండు

రగడ మందగమన చౌరకు చౌరకు మావిమావి మోకలెల్ల, నిందువదన మనసువిఱిగె నీడ నీడ నిలువనొల్ల వరాహ 3. 82.

క. అని యిటు లతఁడాకామినిఁ,యను వాక్యము లెల్ల వేఱెయర్థముగా నేర్చున విఱిచి మాట లాడిన, మననేమియు విఱుగకపుడు మదవతి కణఁకన్. సారంగ 2. 81

3 భయపడు

గీ. పాండుసుతులు ... శిఖండియుఁ ... చండశక్తి, మొఱయ ... బైఁబడ్డ వెఱ్ఱచి తాత, విడిచినా పుత్రులందఱు విఱిగి ... గలిసి ... భీష్మ 1. 68.

ఆ ఇట్లు . క్రీడిసెలఁగి దేవదత్తమొత్తుటయును దత్సైన్యములు సెడఁ, విఱిగి పాఱె భీష్ముమఱువు సొచ్చె. (భార విరా 5 66.)

4. ఓడు, పరాజితుఁడగు

క. విఱిగి తవత్సుతనివహం, బఱిముఱిఁ గనుకనిఁ జనంగ భార. భీష్మ 2. 380

క. విఱిగి నిశాటులు రావణు, మఱువున కేతేరఁ జూచి మనమున కోపం, బెఱుకపడ భా రా. యుద్ధ 1 508.

క. అనివఁ జతుర్వదనుం డిట్లను రమ్మా పంచవదన యనృతంబులు ప ల్కెనె బ్రహ్మనన్నెఱుంగవె, వినుమిది కొంకైన నీకు విఱిగిన వాఁడన్. భోజరా. 5. 333

5. పలాయితుఁడగు, పాఱు

క. మొగమోడఁడితఁడు కౌరవ, జగతీశుఁడు విఱిగినపుడు జవమున వెనుకం, దగిలి యిది జూద మాడఁగ, నగు నెడగా దఱుమవలయునని యెవతనితోన్ భార. విరా 5 338

సీ. లోకభీకరులమై నాకంబునకు దాడివెడలి యింద్రాదుల విఱుగఁదోలి వరాహ 4 52.

6. అడఁగు, వశించు

సీ. ముంచి చీకటులు కల్పించు నీడలుపోవ, పద్మాకరంబుల పాఁచివిఱుఁగ . శుక. 3. 10

నిర్మలమగు = ఇందుపకాయచేత నీళ్ళు విఱుగును.

మనసువిఱుగు = వికృతినొందు, నిర్వేదమునొందు.

క. కూరిమి విఱిగిన సతిపై, నేరమి దోఁచుగతి విషయనిస్పృహమతియై, కోరికలుడిగినవానికి నూరక విశ్వంబుమీఁద నొల్లమిపుట్టున్. కవి 5. 151

క అని యాశ విఱుగనాడిన, విని యందఱు జనిరి ... వాల్మీకి. 2 138

7. పడు.

ఆ. ఒడలువెంచు అంజె యుబ్బుఁబునసైన వేగ విటునిమీఁద విఱిగెనేని, పందికొక్కుమీఁద బండికల్ పడునట్లు, విశ్వ ... వేమ 2 101.

8. (ఋణము) తీఱు

ఉ. అత్తఱిఁ జోతు సద్దుఁ గనకాంచితదివ్య విమాన మిక్కి పూఁగుత్తులు దేవతల్ గురిసికొంచు నుతింప వియత్తలంబునన్, హాత్తి విచారమేమి టికి నత్తువు మాకది శూద్రనీవు నే, మత్తుము వానికిన్ విఱిగె నప్పుదివంబున కేగుదెమ్మనన్. శేష 3 231

వాడుకలోని ప్రయోగవిశేషములు

ఉదా పాలువిఱిగెను, నెత్తురువిఱిగెను, మందు వలన విషము విఱిగెను

వి 1 ఓటమి, పరాజయము

గీ నను జయించితివేలయ్య మనుకుమారఁ, విఱిగెఱుఁగ జగంబెల్ల నెఱుఁగు నన్ను, నెవ్వరేమేమిగారు నా యేటుదాఁకి, యమ్మ నీ బుద్ధి కెదురెక్కదయ్యెఁగాక కళ 1. 182

2 ముక్కలగుట, భగ్నమగుట

సీ కలనైన విఱిగెఱుంగని పోటు పరిక రాచూరు కత్తులమాటు జొచ్చెఁ గొన్ని . వే. పంచ. 4 238

జ విఱిచికట్టు, విఱుగఁబడు, విఱుగఁబాటు, విఱుగడ, విఱుగుడు, విఱుచు, విఱుపు

**విఱుగుడు** వి (విఱుగు) పాకముచెడినవస్తువు.

ఉదా పాలవిఱుగుడు మొ (శ. ర, వా.)

విణ విఱుపైనది, విఱుచునది.

ఉదా పాషాణములకెల్లఁ బైఁడిప్రత్తి విఱుగుడు.

**విఱుచు** స. క్రి. (√ విఱుగు) 1 విఱుగఁజేయు, త్రుంచు, భగ్నముచేయు

ఆ లావు ..కోలెమ్ము బ్రల్లన, విఱిచి నడుము ద్రుంచి వీచివైచె (భార. ఆది 6 215.)

క విఱుతునో మ్రింగుదునో తల, దఱుగుదునో యేను జ్వరుఁడ . . (ఉ హరి. 8. 108)

సీ విఱువుకంఠాస్థుల నుఱికి చివ్వంగుల మొత్తి మోదరలాడు మత్తకరుల ... పి. శకుం 2 12

2 (గాత్ర) వినామముచేయు

సీ. కడువికారంబుగా నొడలెల్ల విఱుచుచు మలఁగి రి త్తకురి త్త సెలఁగి నవ్వ .... భార విరా. 2 250

3 (నిరసించునపుడు పెదవి) మఱుచు

సీ వెల యొప్ప కవలఁబో విఱుచుమోవియుఁ గోప మొదవెడు చూపు మోమోటఁద్రిప్ప. .. అము. 2 22.

తే అధరబింబంబు విఱిచి సంధ్యాగమ మని నైష. 6. 137,

4 చంపు

క అని గంగడోలు బిగియఁగ, దవమెడయెత్తుకొని కపిఅదగ్గఱఁ జముదెంచినఁ జూచి పుండరీకము, వెనువెనుకకెపోవుఁగాని విఱువదు దానిన్ భోజరా 6 70

సీ. వడపి రాశ్వయుజంబునను వ్రతంబులు బ్రహ్మ చారుల విఱిచి భక్షణముచేసి ... జై భా 5. 180

5 ఓడించు.

గీ. జెట్టితండంబుతోడఁ జేపట్టి హాంత్కారి విఱిచినయట్టు లగ్గలిక విఱుతు, లాఁగువేగంబు మెఱసి బలంబు నెఱపి, మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని. భార విరా. 1. 81.

6. (చేతులు వెనుకకు) త్రిప్పు

గీ అనిన...ఆ బహుశ్రుతుండు, వెఱచి వేగమ గురుఁబట్టి విఱిచికట్టి ... (విక్ర. 3 64)

7. పదచ్ఛేదముచేయు

క అని యిటు లతఁడా కామిని,యను వాక్యము లెల్ల వేఱెయర్థముగా నేర్పున విఱిచి మాటలాడిన, మననేమియు విఱుగకవుడు మదవతి కఱఁకన్ సారంగ 2 81.

7. వివరించు, స్పష్టపఱుచు.

ద్వి అదివిని చెలికత్తె లామాయ కనిరి, యెదిరించి పైకొన్న యీ కల మంచివిధమంచు వక్కాణించి చెలులు, విధుముఖ యామాట వినమి నచ్చెలులు, విననమ్మ కల నీకు విఱిచి చెప్పెదము. ప్రభులింగ 2 34. పా 15 పం

9. ఒక వస్తువునుండి వేరొకవస్తువును విభాగించు

క. . పాల్, హంస విఱువ నీ ర్విఱిచెను అము 4 178.

**విఱుపు** వి. (✓ విఱుచే) విఱుచుట, భంగము.

సీ. కలికి మాటలు కిలకిలనవ్వు లోరచూపులు మోవి విఱుపులు గులుకునడలు శుక. 2 433.

విశే. విఱుగుడు

ఉదా దానికిది విఱుపు

**విఱ్ఱనవీఁగు**=విఱ్ఱవీఁగు అ క్రి మిక్కిలి అతిశయించు.

చ ఘనుఁడొకయోగితుల్యుఁ డనఁగా ధరణీ స్థలియందు నేరికిన్. వినఁగవరాని రూపమున విఱ్ఱనవీఁగి తపంబు సేయఁగా, వనరుహమిత్ర చంద్రనగ వర్గసముద్రనదీనదతమా, జనతతియున్ చలించెనని చారులు చెప్పిన మాట వింటరే చిత్రభా 2 52

**విఱ్ఱవీఁగు**=విఱ్ఱనవీఁగు (వీఁగు+వీఁగు) అ క్రి.

1 మిక్కిలినిక్కు, మిక్కిలిగర్వించు.

చ గురుని యుపేక్షఁజేసి తనకున్ సమరోద్ధతి నెల్లదాని నీ,వెరవిఁడి గానలేఁడు తన వీరము కాఁగొని విఱ్ఱవీఁగెడున్ భార. ద్రోణ 2. 46.

సీ వేల్పుటింతులలోన విఱ్ఱవీఁగుచు మేన నవరత్నరచనలరవణ మెఱిఁగె ... మనుచ. 2 11

సీ శ్రుతిదూరభోగనర్తకి విఱ్ఱవీఁగి తాఁ జరణమగ్రగజుదెనఁ జూపఁదేని (వసు. 1. 34.)

2. మిక్కిలిమెప్పు, మిక్కిలి అతిశయించు.

క విను నీ పదితిసుతుఁ డవు, వినతకొడుక నేము విఱ్ఱవీఁగెద మనకున్, జనఁకుడు కశ్యపుఁ డొక్కఁడ దనుజుల సామించి (శోధించి) చంపుదమ యిరువురమున్. భార. ఉద్యో 2. 285

సీ వానలు సంవితో వర్షించె సస్యముల్ వేళ్ళఁ గొల్చుగ విఱ్ఱవీఁగి పండె మను. 6 121.

గీ. ఇరుగు పొరుగుల వారల యిండ్లవెల్ల, వివిధ మార్గంబులను సిరుల్ విఱ్ఱవీఁగఁ, గుడిచి కట్టెడు శిశువుల గోము లరసి, తల్లి యెట్లోర్చుఁ దన పేదతనమునకును. కుచేల 1. 36.

3. సమృద్ధమగు

ద్వి పూచె మోదుఁగువృక్షములు విఱ్ఱవీగ, గాచెఁ జూతంబులు . హరిశ్చ పూ 433

చ విపులధరాధరాగ్రమున వేలుపుమ్రాకల రచ్చరావి ది,వ్యవతిమశంబుతోఁ గడవలంతలు పండుల విఱ్ఱవీఁగు ... వరాహ. 10. 120.

**విలంఘనము** సం. వి అ న 1 అతిక్రమించుట, దాఁటుట, మీఱుట 2 అపరాధము, శాసనోల్లంఘనము

**విలంఘించే** సం న క్రి. 1. అతిక్రమించు, దాఁటు.

మ. ఒక పాదంబున భూమిగప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం, డొకటన్ మీఁది జగంబులెల్ల దొడి యొండొంటన్ విలంఘించి ... హరి విభుం డొప్పారె విశ్వాత్మకస్థితిన్. భాగ. 8. 625.

2. లంఘించు, దుముకు

మ తలయూచె గలకంరి యచ్చెరువునన్ దాటంక రత్న ప్రభల్, పలుకంబాటిన చెక్కుటద్దములపై( బైపైవిలంఘింప(గాన్ . కాశీ 5. 168

(ఇట ప్రసరించు అని భావము)

**విలంఘితము** నం విణ (అ ఆ అ) 1 దాటబడినది, అతిక్రమింపబడినది 2 మీఱబడినది, ఉల్లంఘింపబడినది 3 అతిశయింపబడినది, మించబడినది 4 ఓడింపబడినది, జయింపబడినది

**విలంబనము** నం వి అ న 1 వ్రేలాడుట, జాగు, ఆలస్యము

**విలంబము** నం. వి అ పుం 1 వ్రేలాడుట 2 ఆలస్యము, జాగు 3 ప్రభవాది సంవత్సరములలో నొకటి "విలంబి" అని వాడుక

**విలంబి** నం విణ (న్. నీ న్) 1 వ్రేలాడునది 2 జాగుచేయునది, ఆలస్యముచేయునది, మందమైనది.

**విలంబించు** నం అ క్రి ఆలస్యముచేయు, జాగుచేయు.

శా ఎండన్ గ్రుమ్మగ్గితి రాకటన్ బడిలి రింకేలా విలంబింపగా, రండో బాలకులార చల్దిగుడుపన్ ... భాగ. 10 పూ 493

**విలంబిక** నం వి అ స్త్రీ మలబంధము, రోగభేదము.

**విలంబితము** నం విణ (అ ఆ అ) 1 అనుకొనియుండునది, అనుకొనియుండునట్లు చేయబడినది 2 వ్రేలాడునది, వ్రేలాడదీయబడినది 3 చేరియుండునది, అంటియుండునది. 4 జాగైనది, ఆలస్యమైనది 5 మందమైనది (సంగీ) ద్రుతము మధ్యము గానిది.

వి అ న 1. జాగు, విలంబము, ఆలస్యము 2 నృత్యవిశేషము

**విలంభము** నం. వి అ. పుం 1. ఔదార్యము 2 అధిక దానము, మిక్కిలియీవి.

**విలక్షణము** నం విణ (అ ఆ అ.) 1 విశేష గుణములులేనిది. 2 భిన్నమైనది, వేఱైనది. 3 విశేష లక్షణములుకలది, అసాధారణమైనది 4. శుభ చిహ్నములు గలది శుభచిహ్నములు లేనిది.

వి అ న 1 వైయార్థ్యము, నిష్ప్రయోజన స్థితి, 2 పాఱజూచుట, కనుపెట్టుట

**విలక్షము** నం విణ (అ ఆ అ) 1 విశేష గుణములు లేనిది 2 విశిష్టమయిన (అసాధారణమయిన) చిహ్నములు గలది 3 కలవరపడినది, క్షోభపడినది 4 ఆశ్చర్యపడినది, విస్మయమునొందినది 5 సిగ్గుపడినది, భంగపడినది 6 తెచ్చిపెట్టుకొన్నది, స్వాభావికము కానిది (చిఱునవ్వు మొ)

**విలక్షించు** నం అ క్రి ఆశ్చర్యపడు

మ రామరావణు లసామ్యాసైన యుద్ధంబు( జేసిరి నక్తందివ మేడునాళ్లు త్రివిష్టపులు విలక్షింపగన్ దశ 7 2 155

**విలక్షితము** నం విణ (అ ఆ అ) 1 ప్రత్యేకపఱుపబడినది 2 పరిశీలింపబడినది, కనిపట్టబడినది 3 క్షోభపెట్టబడినది, కలతనొందింపబడ్డది 4 విసిగింపబడినది 5 భేదపఱుపబడినది.

**విలగ్నము** నం విణ (అ ఆ అ) 1. మిక్కిలి యంటియుండునది, అనుబంధించియుండునది 2 గుచ్చిపెట్టబడినది 3 గతించినది, కడచినది. (కాలము) 4. సన్ననిది, సుకుమారమైనది

వి అ న 1 నడుము, మధ్యము 2 కటిప్రదేశము 3 మేషాదిరాసుల యుదయము.

**విలపనము** నం వి అ న 1 సంభాషించుట, పలుకుట 2 వదరుట, వ్యర్థసంభాషణము 3. ఏడ్చుట, విలపించుట 4 జిడ్డుగలవస్తువుల మడ్డి

**విలపించు** నం అ క్రి పరిదేవనముచేయు, ఏడ్చు

గీ హా హరిశ్చంద్ర కనకపర్యంకతలము, నందు( బొందు నీయంగమే యకట నేడు, నేల( గూలినయది నేడు నీచమైన, మిట్టి దశ దెచ్చెనే దైవి దేవేంద్రభోగ.

వ అని విలపించుచు నమ్మహాదేవి భర్తృదుఃఖ భారపీడితయై ... మార్క. 1 82.

**విలపితము** నం వి అ. న ఏడుపు, విలాపము.

**విలయనము** నం వి అ. న. 1 ద్రవముచేయుట, నీరుగాజేయుట 2. హరింపజేయుట 3. తీసివేయుట, తొలగించుట. 4 సన్నముగాగొట్టుట, చూర్ణముచేయుట, పొడిగొట్టుట 5. పొడి, చూర్ణము

**విలయము** సం. వి. అ. పుం 1 ద్రవమగుట, ద్రవీభావము. 2 నాశము, అణఁగిపోవుట 3 ప్రపంచనాశము, ప్రలయము

**విలవిల** వి 1 ప్రాణము విడుచుటయందగు ననుకరణము.

ద్వి సిరివరు జయ సింహ్మ నేఁ బ్రాలనగ, వంకుశ మౌక్తిక వ్రాత ఉరాల, విలవిలఁ బ్రాణము విడువంగ ధరము, వలవజ్రగతి ముష్టిహతి మగ్గుఁజేసి, దాని దంతంబు పంతముగ నాడ్చి, పూని శ్రీ నాహాస్తిపుని ముక్తికనిచె (అమ క. 3 148. పా 8 పం)

2 తన్నుకొనుటయందగు ధ్వని కనుకరణము.

ద్వి విలవిలఁదన్నుక విడిచెఁ బ్రాణములు. ద్వి నల 4 (శ ర.)

3 విహ్వలత. (చూ విలవిలపోవు)

జ : విలవిలఁబడు, విలవిలపోవు.

**విలవిలఁబడు** అ. క్రి (విలవిలన్ + పడు) మ్లానమగు, వాడిపోవు.

క తెలతెలవాఱఁగవచ్చెను, వెలవెలఁ బాఱె నెలదొవలు విలవిలఁబడియెఁ, బలపలనయ్యెం జుక్కలు... (సారంగ. 3 197.)

**విలవిలపోవు** అ క్రి (విలవిల + పోవు) విహ్వలతఁ జెందు, అవశమగు.

ఉదా చేతులు కాళ్లు విలవిలపోవుచున్నవి.

**విలసత్** సం క్రి (సమాస పూర్వావయవముగానే ప్రయోగము) 1 ప్రకాశించుచున్న 2 తళుకుమనుచున్న 3 తరంగములవలె చలించుచున్న, 4 విలాసముగల, క్రీడాశీలమైన, ఆటలం దిష్టముగల.

**విలసనము** సం వి అ న 1 తళుక్కున మెఱయుట 2 ఆటలాడుట.

**విలసించు** సం అ క్రి ప్రకాశించు

సీ నందనవనవాసనల సొంపు విలసింప వలసంపుఁ జలిగాడ్పు లనుసరింప కళు 3 38

**విలసితము** సం విశే. (అ ఆ అ) 1, ప్రకాశించునది, తళుక్కుమని మెఱయునది. 2 కనఁబడునది, స్పష్టమైనది 3 ఆటలాడునది, క్రీడాశీలమైనది.

వి. అ. న 1 తళుక్కుమని ప్రకాశించుట, తళుక్కుమనుట. 2. తళుక్కుమనెడి మెఱపు, ప్రకాశము. 3 స్పష్టముగాఁ గనఁబడుట, స్పష్టపడుట 4 ఆట, క్రీడ, శృంగారచేష్ట 5 చేష్ట, అభినయము 6 ఫలితము, పర్యవసానము,

**విలసిల్లు(లు)** అ క్రి 1 ప్రకాశించు.

ఉ శ్రీతరుణీ ముఖోజ్జ్వలశశిద్యుతియున్ బృథుకౌస్తుభార్కభా,ల తపదీప్తియు న్నిజభుజాంతఁ మ్మునళస్థలిన్ ఒం,స్పీతవిచిత్ర భాతి విలసిల్లఁగ నొప్పుచు మాపరుఁడు మార్కం 1 1

మ వసుధాచక్ర మవక్రమై విలసితెన్ వార్ధుల్ చెలంగెన్ కృ శతం 3 86.

2. సంతోషము

ద్వి వేఁటాడఁ జయ్యన విచ్చేయుమనిన, మాటకు విలసిల్లి మనుజవల్లభుఁడు, వానికిఁ దవకట్టు వర్గంబు నిచ్చి. నవనాథ. 1, 47 పా. 28 పం.

**విలాతి** వి దేశము.

చ.. వెలలేని సొమ్ములన్, వెనఁ గడుఁగూర్మితోడఁ జదివించిన పిమ్మట గారవంబుతోఁ, బసుపున కిచ్చెనంత వృషపర్వుఁడు కొన్ని విలాతు లింతికిన్ యయా 4 122

చ. వసుమంతుఁడు నాఁ బ్రసిద్ధిగాంచిన యొక సెట్టియుండు నలసెట్టెన మూఁడువిలాతి కేఁగుచున్, తన ధనరాసిపై నిడిన దాళ్ళి ... వేం పంచ 1. 479

సీ. సౌవర్ణకలశముల్ సవరించిన విలాతి సకలాతి పశౌదాల సామజములు రంగా 1 156.

**విలాపము** సం వి అ పుం పరిదేవనము, ఏడ్పు

**విలాపించు** సం. అ. క్రి దుఃఖించు

సీ అని విలాపింప మారార్చి యేఁటికిఁ గ్రేపుఁ బాసి గొడ్డొఱలెడు పగిది నడలె,తు...జై. భా 6. 265

**విలాసకాననము** సం వి. అ పుం శృంగారవనము, లీలోద్యానము

**విలాసనము** సం వి అ న. 1 ఆట, క్రీడ,వినోదము. 2 శృంగారచేష్ట, సయ్యాట, సరసము

**విలాసమందిరము** సం వి అ న. లీలాగృహము, ఆనందమందిరము, విలాసముల కేర్పడిన యిల్లు.

**విలాసము** సం వి అ. పుం 1. క్రీడ, ఆట, వినోదము 2 స్త్రీల శృంగార చేష్టావిశేషము, స్త్రీల యంగవిక్షేపాదులందలి తాత్కాలిక విశేషము 3 వగలాడితనము, వలపించుట 4 స్త్రీలసాత్త్విక భావవిశేషము 5 చక్కదనము, సౌందర్యము 6 తళుక్కుమని మెఱయుట

**విలాసి** సం. విశ (న్ సి న్) 1 క్రీడాశీలుఁడు, ఆటలాడెడివాఁడు, శృంగార చేష్టలు గలవాఁడు, వలపించువాఁడు

వి న్ పుం 1 విషయసుఖమును గోరుమనుష్యుఁడు. 2 అగ్ని 3 చంద్రుఁడు 4 పాము. 5 కృష్ణుఁడు 6 శివుఁడు 7 కామదేవుఁడు, మన్మథుఁడు.

**విలాసించు** సం అ క్రి క్రీడించు

సీ. మనసు రింగులువార మణితక్వణంబునఁ దెంత నల్లన విలాసించె శౌరి పి శకుం. 3 218

**విలాసిక** సం వి. అ. స్త్రీ శృంగార రసబహుళమై యేకాంకమయిన నాటికాభేదము

**విలాసిని** సం వి ఈ స్త్రీ శృంగారచేష్ట లెక్కువగల స్త్రీ; స్త్రీ. 2 వేశ్య

**విలిఖనము** సం. వి అ న 1 గోఁకుట, గీఱుట 2. వ్రాయుట

**విలిఖించు** సం. న క్రి వ్రాయు

మ. కళలం దేలు మెఱుంగుఁ జెక్కులపయిన్ గన్తూరికాపత్త్రముల్, విలిఖింపన్ . చంద్రా. 6 124.

**విలిప్తము.** సం విశ (అ ఆ అ) 1 పూయఁబడినది, రుద్దఁబడినది 2 మలినముగాఁ జేయఁబడినది, కళంకితము, అపవిత్రితము.

**విలియవేయు** న క్రి 1. నరిచూచు (శ ర) 2. పూఁటకాపుగాఁ జేసిఎఱచు (వాచ.)

**విలీనము** సం విశ. (అ ఆ అ) 1 అణఁగియున్నది, అంతర్హానమైనది. 2. అంటియున్నది, ఆశ్రయించియున్నది. 3. కరఁగినది, ద్రవరూపము నొందినది. 4. నశించినది, చచ్చినది

**విలు**=విల్లు వి. జౌ. ధనుస్సు.

క. విలు ఢిఱుగఁజేసి యతనిం, దొలఁగంగాఁ జేసె నరుఁడు దోర్బలలీలన్ భార. విరా 5. 74.

విలునమ్ము సంకుఁజగ్రము, బలకయుఁ గాఁపేయకంబుఁ బాశముగదయున్, గల యెనిమిది చేతుల దాఁపల వలపలఁ దాల్చి శౌరి బాణుని యనికై ఉ హరి. 6 25

శా ఏ వేళన్ సీతయు లక్ష్మణుండుఁ దన సేవింపంగ విల్వాని చెల్వొలిలన్ దగు రామమూర్తి రఘువాథాధీశ్వరుం బ్రోవుతన్ విజ. వి 1 1

జ విలుకాఁడు, విలుదాలుపు, విలుమంది, విలువిద్దె, విలువిద్య.

**విలుంచనము** సం వి అ న తీల్చుట, ఛేదించుట, పెరుకుట 2 (తోలు) ఒలుచుట.

**విలుంఠనము** సం వి అ న 2. దోఁచుట, కొల్లపెట్టుట. 2 భూమిపై దొర్లుట, పొరలుట.

**విలుంపకుఁడు** సం వి అ పుం. దొంగ, తస్కరుఁడు, దోచుకొనెడివాఁడు.

**విలుకా(ల్కా)ఁడు** విశ. (విలు+కాఁడు) ధానుష్కుఁడు, విల్లుపూనినవాఁడు

సీ అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డందఱి యందఱి విలుకాండ్రకెల్ల గురుఁడు భార. ఉద్యో 4 229

క అసమశరుఁ డించు విల్లును, కుసుమశరమ్ములను విడిచి కొమ్మలభ్రూనే, త్రసమృద్ధిచేతఁ దత్పురిఁ, బనగలవిలుకాఁ డనంగ బరగుచు నుండున్ విక్ర 1 81

గీ అలరు విల్కానితల్లికిఁ బ్రార్థితార్థకలవల్లికి మ్రొక్కెఁగఁ గంటిమంటి. కాశీ. 3 41

ద్వి విలుకాండ్రురిద్దరు వివిధశస్త్రాస్త్ర కలితులై యట వంపకడ నున్నవారు. రం రా. కిష్కిం 168 పా. 27. పం

(చి ని. పా. విలుపూని యిద్దరు, ముద్రి పా)

**విలుచే(ల్చు)** న క్రి 1. కొను

గీ జీవహింస యొన్నండును జేయ నవఘ, ఱరులు సంపితెచ్చిన మాంస మొవర విలిచి, తగినవెల కమ్మి బ్రదుకుదుఁ దద్ధనమున .. భార అర 5 33

సీ. ... ఎక్కుడు సొమ్ముకలవాఁడ నెంత యర్థంబైన నిచ్చి నిన్ను, విలిచెదఁ జెప్పుమా వెల యన్న...మార్కం 1 226

వెంటిగొను అ. క్రి (వెంట+కొను) పిరిగొను లయగ్రాహి. గంటి వడఁ దాఁచుదు మగంటమి దలిర్చన్, వెంటగొనఁగానులిచి మింటి కెగయన్వ యిచి ... శా రా యు. 1470

వెంట్రువ వి. ఒకజాతి ముంగిస, బభ్రువు
 గీ వెంట్రువ వనఁగను బభ్రువు వెలయు నకుల అం ఖా 2 86.

వెండి[1] వి (క. బెళ్ళి. త. వెళ్లి) రజతము, పంచ లోహములలో నొకటి (నిత్యైకవచనము)
 సీ ... వెండియొడ్డెనలపై వెలచి తెచ్చినపైఁడి పళ్లెంబు లాయత్తపఱచువారు ... నైష 6. 108
 సీ. వెన్నెల జరియుడ్డ వెండితీఁగెలఁబోలు యజ్ఞోపవీతంబు లఱుత నమర .. విక్ర 7. 148.
 గీ. ... వెండిమీ లెక్కు వెంట్రుకవిల్లు వోలె ఆము. 4. 177
 (ఇయ్యది విశేషణముగాఁ గూడఁ జెప్పనగును ఉదా. వెండిగిన్నె.)

వెండి[2] అవ్య 1. పునరర్థకము, మఱి (ఇది "ఉను" వర్ణకాంతము నగును)
 క. మాయయ్యకుఁ బాయక పని,సేయుచు దీవించి ప్రియము సేయుచుమందున్, మీయయ్యె వెండి మహిమలు, నాయొద్దన పలుక నీకు వానయు లేదే. భార. ఆది 3. 137.
 క. మందెదు బలు నారసమున, గుండియ వగులంగ నేసి కూల్చితి దీనిన్, వెండ ప్రయోజన మేదీ, రంఢానుత! దీనిపై శరము నిగిడింపన్. హర 7. 54.
 ఆ. వెండియొక్క పండు విప్రుఁ డెప్పుడో తెచ్చి, తనకు, నీక యమ్ముకొనిరొ నముచు. విక్ర 8 20.
 క. పాండవహితుఁడగు విదురుఁడు, వెండియు జను దెంచి, కార్య విధులందు నహో,యుండయ్యె జనవిభోద హి,తుండయి మంతనము సేయఁ దొడఁగె న్విభుఁడున్ భార. అర 1. 72.
 2. అనంతరార్థకము, పిమ్మట.
 గీ. అట్లు కావున న వ్విబుధారిఁ దునిమి, వెండి చనుము తపంబుగావించు పనికి. హరి. పూ. 2. 25.

 ఉ ... విముక్తికరవ్యక్తన్, డాసెద నంచు నెమ్మన మునం బ్రమదంబు వహించి వెండియున్ విక్ర. 2. 189
 చ ఒకమరి బుడ్డగింప విలయోదకముల్ పయి కుబ్బి చిప్ప వ్ర,చ్చుకొని మహో(భవీధిఁ జన నూకి రతన్ మెయి వెంచి వెండి క్రిం,దికిఁ గయి వ్రాలు తత్పలిలనిర్మలధార ... ఆము. 4 21.
 క. పడఁతికిఁ గన్యాధరమ్ముం, బెడలినఁ గొఱయగునె వెండి యెవ్వతికైనం, గడివోయిన పువ్వులు మఱి, ముడుచునె రసికుఁడగువాఁ డమోఘవివేకా. భోజరా. 4. 224.
 3. కింత్వర్థకము, ఇఁక నేమన్న
 సీ.. గీ.. సోమయాజుల మెన్ని మాల్గాము శ్వపచభగకుల మెన్ని మారులుగాముపాము గాములము నెన్ని మాఱులుగాము వెండి, కంస రిపుభక్తుల మొకండె కాముగాని ఆము. 6 61

వెండిక అవ్య. పునరర్థకము, మఱి
 ఉ వెక్కెడి రూపులున్ విఱిగి వెండిక వెండిక వ్రాలు రూపులున్ ... కు సం 11. 699.

వెండికొండ వి (వెండి+కొండ) కైలాస పర్వతము, రజతశైలము
 సీ... ధవళ కేతన రుచులఁ, ఛత్రముల రుచులఁ, జామరంబులరుచు లొక్కసారినిగిడ, మెండుకొని వెండికొండపై నిండ నా ప్ర,చండభుజదండుఁ డాతఁడు దండు విడిసె. ఉ రా. 2 331
 ఉ...తురంగ వాహుఁడై, సంగతివేగ వితతపతి శంకరు కొండకు వెండికొండకున్. వీర. 3. 33.

వెండిగుండు వి (వెండి+గుండు) 1. కైలాస పర్వతము, రజతశైలము. (శ ర) 2. వెండి గుండు వలె మండుటచే కుక్క కియ్యఁబడిన పేరు.
 ఉ. వులియఁదు బూచిగాఁ దమురపోతులరా జమ మంతిగాఁడు చెం,గలువసివంగి భైరవుఁడు గతైరసంపఁగి వెండిగుండు మ,ల్లెలగుది . . మమచ. 4 82.
 సీ ... విష్ణుప్రసాదంబు వెండిగుండుల పరిష్కచ్చి మిరెము వెట్టిపుచ్చుకాయు ... శి.. శకుం. 1. 108,

3 వి. ధాన్యవిశేషము.

వ. రాయమెచ్చులు యేరుమల్లెలు మునిమనో హరాలు వెండి గుండ్లు బొంత మడములు కూటికుప్పలు కాఱు నంపెఁగలు .. ప్రబంధ 112.

**వెండిగుబ్బలి** వి (వెండి+గుబ్బలి) రజతాచలము, కైలాసము.

సీ వెండిగుబ్బలిపై వేడ్క విడుకాల్పి, మేరు నగ రాజుపైఁ జాల మెచ్చువదలి . భీమ 6 11

సీ. ... విన్నుగ్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలిగూడె మేలువాఁ డుడివోని మేలువాఁడు .. అచ్చ రా. బాల. 18.

**వెండిఁడు** వి. సూత్రధారుఁడు, బొమ్మలాడించు వాఁడు

ద్వి. ప్రకటిత కపటనాటకసూత్రములను, విశృతి ప్రకృతు లార్చు వెండిఁడు నతఁడ. పన పు. 4 70.

**వెంట్రుక** వి 1 కేశము, శిరోరుహము.

సీ. కఱకువెంట్రుకలలోఁ బఱచు మందాకిని సుకు మారదేహంబు స్రుక్కఁజాఱ .. హర 7.79.

సీ ... జుంజువెంట్రుక లెత్తి చుట్టవలేదిఁగవన్న గాధీశ్వరు వగిది మెఱయ. విక్ర. 2 128.

ఉ ... ఎలదేఁటి దాఁటులన్, బమ్మెరపోవఁ దోలుఁ దెగజాఱెడువెంట్రుకలు,...మనుచ.3 6.

సీ ... వెంట్రుక నెఱినెఱక నాఁగఁ దనరుఁ గేశము ... (ఆం భా 2. 145)

2 రోమము

ఉ తంత్రులు మీరు మీకు నయతత్వముఁ జెప్పెద మన్న మమ్ము వేఁ,మంత్రు జనంబులూఱడు బృహస్పతి మీయెడనేమ లేవిచో, వెంట్రుక యంతమోసమును వేచి దురంబున కెత్తివచ్చు నా, పౌంత్రుఁడు . ఉ. హరి. 2 101

నిడువెంట్రుకవెట్టు = అ క్రి జలదరించుట.

క గడగడవడఁకెడు మేన,న్నిడువెంట్రుకవెట్ట నెదుర నిదుర జలింపన్, మెడమడచు నావు లించుం, దడఁబడుఁ బడఁబోవు నిలుచు ధరఁ గూర్చుండున్. (ఉ హరి 6. 96.)

**వెంట్రుకవిల్లు** వి. వా. గుఱ్ఱపుతోఁక వెంట్రుకలతోఁ గట్టిన ధనురాకారమగు వాద్యవిశేషము. (దీనిని ఉ సరివాంద్రు వాయి తురు, దీనిని 'కామాచి' అందురు )

గీ. వృష్టితటి నిడ్డ జెనఁద్రావఁ గ్రిందినుండి, తేట నదినీటఁ దనవెంటఁ దేలు మీల, తళుకుతో నాఁచులత దోఁచె వెలికి జమిరి, వెండిమీ లెక్కు-వెంట్రుకవిల్లువోలె ఆము 4 177

**వెందగు(వు)లు** న క్రి (వెన్ను+తగులు.) అనుగ మించు, వెంటనంటు

ద్వి. అచ్చుగ నిటురాఁగ నతఁడు వెదంగిలి, వచ్చుచు నింగలకు వసుధేశ వినుము రం రా బాల 12 పా. 2 పం

ద్వి. తలలు వీడఁగ నాయుధంబులు విడిచి, వలనేది పాఱెడువారి వెందవిలి, నటుశిలీ ముఖముల పాలు సేయుచును రం, రా ఉ 16 పా. 7. పం

**వెందు** వి తమకు వశపడుటకై తుమ్మెదలు మధ్య నుంచి పాడెడు పురుగు

చ. చెవుడు పడంగ నల్గడలఁ జేరుచు నన్నొకవెందు చేసి మీ, రివియవియంచు బుజ్జనములిన్నియు నెన్నఁగ వేల .. కు సం 8 676.

**వెంపర** వి 1 పీడనము 2 హింస 8. భేదనము (శ ర) (చూ. వెంపరలాడు)

**వెంపరచేయు** దే న క్రి హింసించు

సీ పాదంబు లిసుకలోఁ జాతి వెంపరసేసి పటు సాయకముల పాల్పఱుత మనుచు దశకు 2.71.

**వెంపరలాడు** న. క్రి (వెంపరలు+ఆడు) 1.భేదించు

వ తామరల పరంపరల వెంపరలాడి తుండంబుల ఖండంబులు పొడవులెత్తి ఘూత్కారంబులుచేసి. ప్రబంధ. 1. 166.

సీ ... చెవి దార్చి విని చీమ చిటు కన్న కొకసారి నెలవి వెంపరలాడుఁ జిట్టెల్ల ...మనుచ.4.17.

2 బాధించు, పీడించు

చ. మఱి పనిలేదె వేసరవు మాటికి నిక్కడ నుండ నోయి చే, లెఱుఁగని కూన దుర్జయవనేంద్ర శిఖామణి వీఁడె వచ్చె నే, లెఱపును లేక వేలు పుల వెంపరలాడుచు నాలకింప మా, మొఱలు తదీయఘాటి నిను ముట్టఁజుమీ నిమిషంబు నిల్చి నన్. వరాహ. 8, 84.

చ అని కొనియాడి చేడియ నొయ్యారపురాశినిజేసి నట్టి య,వ్వనజజుచేతికిన్ బిరుసు వైవఁగవచ్చుఁ గదయ్య దీని ప్రాపున ముదమొందు కెందలిరు గాందళవుందొర చూచువారలన్, వెనుకొని కావుటంపరల వెంపరలాడకు మన్న మానునే కుకల. 4. 154.

(వెంపరలాడు-ముద్రి. పా )

2. హింసించు.

చ. చలమునఁ దావ యోగిజనసంఘము వెంపర లాడఁ బూని పూ,ములుకులు వింటఁ గూర్చి తటి ముక్కులఁ బిల్చి తదీయసార మ,గ్గలముగఁ గ్రోలఁగా మమరుగాలముల న్నరుఁడేయ బ్రేటుఘా,యల నలరెన్ బలాశముకులాం తము లంటుకి మూఁగు తుమ్మెదల్. చంద్రా. 4. 86.

చ. ... పేవలఁ జెక్కుథంగులన్, బొడవడఁగించి మండి బలుమూఁకల వెంపరలాడుచుండె . . వై. ఖా. 6. 177

ఉ ... పూ,వింటియతండు నన్గినిసి వెంపరలాడక ముస్నెయల్ల వా,ల్గంటిమనోజ్ఞసంగమ సుఖస్థితి యోగతిఁ గల్గఁ జెప్పవే. రాజ. చ. 3. 77

**వెంపరులువెట్టు** న. క్రి (వెంపరులు+పెట్టు)భేదించు.

వ. .... ఆ శక్రారి సేనానక్రాకరంబుఁ జొచ్చి శోధించి కలంచి కలగుండుసేసి మట్టిమల్లాడి వెరఁజి వెంపరులువెట్టి వచ్చిపోయినతెరువెఱుంగ రాక ... (పి. శకుం. 3. 126.)

**వెంపలి** వి బాణపుంఖ, ఒకజాతి. (వ్యృ. వి.)

(ఐ. వెంపళ్ళు, వెంపలులు. దీనిభేదములు తెల్ల వెంపలి, ములువెంపలి మొ॥)

తే. వీరరససారసాకారవిహరణంబు, విష్ణునకునొప్పు శతనితో విగ్రహింప, దొరకొనిన వమ్ము మనకు మద్దులు మునింగి,పాల వెంపళ్లు తమ కెంత బంటి యనుట. ఉ. హరి. 4. 124.

**వెంబట్టు** వి. (వెల్ల+పట్టు.) తెల్ల నిపట్టు.

క విట్టాగని మీఁదఁ గెలఁకులఁ, బట్టి సితచ్ఛద నమూహినుతియుట గడుఁ గ,న్పట్టు సరోవర లక్ష్మికిఁ, గట్టినవెంబట్టు మేలుకట్టుంబోలెన్. (కు. సం. 10. 336.)

**వెంబడి** వి (వెన్+పడి ) 1 వరుస, క్రమము.

వ ... అప్పుడు తమ సుముఖాన త్రిమణి స్తంభనామ ధేయంబులు స్త్రీత్వ పురుషత్వంబుల వెంబడిన పీడ్పాటుగా సంకేతంబులు చేసికొనిరి ... కళా. 5 103

చ దినముల వెంబడిన్ జడనిధిన్ మునుగ్రోలిన నీరు ... ఆము. 4 86

2. ప్రకారము, రీతి

వ ... పిదపఁ జాళ్ళ వెంబడిం బంచుకొని ... మనుచ 4. 60.

ఆ. తగదు మిగుల నిచటఁ దడయఁగ సంకేతి,తం బగునమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరిగెద నీవు నా వెంబడి, నడువవలయుఁ దాల్మి నడల నీక రాఘవ 4. 19. (రామాయణార్థమున )

అవ్య్య. క్రియ 1. అనుపొంరముగా, వెంట.

ఉ... దంతపు మెట్లవెంబడిం, జేవడి వీణ మీటు టలు ... ఆము. 1 62

తే. అంతట వినివి యతఁ డాలతాంగి బిల్చి, నా తలంపు వెంబడి నీవు నడచె దనుచుఁ బలికె తిది యేమి చెపుమ నీ థంగు లిపుడు. కళా 6. 65

చ తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంత నంతనే, పనుపడ నిల్పి ముందఱకుఁజాటి కెలంకులకుం దొలంగి తా, వెనుకకు నేఁగు దెంచి కడువేడ్క యొనర్పఁగ బంతియాడ నె,మ్మినని గనకంపుఁగోల నడిమింటనె త్రిమ్మరఁ దారి కొట్టుచున్. ప్రభా. 2 29

తే. విప్రువెంబడిఁ బడి నీవు వేడ్కఁజనిన ...దళకు. 3 36.

ఆ తగదు మిగుల నిచటఁ దడయఁగ సంకేతి,తం బగునమయంబు దప్పకుండ, నేఁదిరిగి యరిగెద నీవు నా వెంబడి, నడువవలయుఁ దాల్మి నడల నీక. రాఘవ. 4 19. (ఖారతార్థమున )

సీ. ... నిద్రితద్రుచ్ఛాయ నిలువక జరుగ వెంబడి నధ్వగపంక్తి పొఁగలు వెట్టె ఆము. 2 46.

సీ... ఒకటికి వెలవియ్య మటికి చీకటి దాక బను లగాపరుల వెంబడిన పోదు. హంస. 3. 142.

**వెంబడించు** న. క్రి (√ వెంబడి.) అనుగమించు, వెనుకొను.

మహా॥స్రగ్ధర ... విదళించున్ వెంబడించున్ విను
వకనురులన్ విష్ణుఁ డీరీతిఁ గ్రుంచున్. ఉ. రా.
2 338

వ .. వివిధ రాష్ట్రనివాసులు ... శ్రీరాముని
వెంబడించిరి .. ఉ రా. 8 268

**వెంబడు** అ క్రి (వెన్+పడు) 1. వెంబడించు.

చ జవవరమౌళి కొంతవడి సాహిణి నివ్వెఱగంది
చూడఁగో, డవ రవగాలు చూపుచు పాటూ
పాటినేగి పరాకు వీరు వీ, ౦ని తముఁ దెల్ప
నందఱు రయంబున వెంబడవాగె స్లోమ్యె.
య్యనఁ గనుమూసి కన్దెఱచునంతటిలో ముని
సీమఁ జేరఁగన్ (కువల 2 58)

2. కామించు, వలచు.

సీ ... పరకళత్రముల వెంబడఁ దలంచినవాఁడ
ప్రజ్ఞా విలాసంబు వదటఁగలసె శివరా.
3 62

**వెంబర** విణ 1. దుష్టుఁడు, దుష్టము

చ కలిగినవానిఁ బ్రాఁబలుకుఁగమ్మని యూర్పుల
వాని యొందు నే,వెలుఁగును గాని పెన్వెలుఁగు
వెంబడినిం జనువాని నంతటన్, వెలసిన వానిని
న్గనని వెంబరపుట్టువు జాతిపుట్టువుం,బలె గతి
గానలేదు యతిమానస హంసక కంసహింసకా
పాండు 2 71

౨ అవివేకి, మూఢుఁడు

ద్వి. అమృతంబు గుక్కల కందిచ్చి పులిసి, నంబలిఁ
బ్రావఁగా వాళించునట్టి, వెంబర గాని వివేకిగా
డెందు. ప్రభులింగ 8 ఆ 92 పా 10 పం

**వెంబరవిత్తు** విణ (వెంబర+విత్తు) మూఢాగ్రేస
ర్యుఁడు.

మ మరుత్కూ రాత్త్రృభయాప్తిఁ గుంజము సొరన్
మత్తాళిమల్లాళిదు, స్తరహల్లోహలశబ్ద మందడర
సంతాపించి చూతంబు డా,యు ౦టుల్కోకిల
పఙ్క్తులాడ వెతనేయన్ నిల్వ శంకించి వెం,బర
విత్తై వలువంకల మ్మని వరాపస్మారలోలా
త్ముఁడై సమీర. 3 233

**వెకలి** విణ. (సం. వికలః) 1. మూఢుఁడు

ద్వి. సకలోన్నతుండనై సడిగన్న నన్ను, వెకలియై
తమతండ్రి వెడలంగఁ ద్రోవ, యతి హీన
సత్త్వుఁడై యడవులలోన, బతిమాలి ఫలములం
బర్ణాశనముల, వికృతాంగుఁడై తపోవృత్తిమై
నున్న, ౼౼క పేదమావవుఁడో పునే చెవళ.
రం రా. నుఁ. 251 పా. 14. పం

సీ. వీథిలోఁ బొడగన్న వృద్ధుల నరికట్టి వెకలియై
పలుమాఱు వెక్కిరించు . . ఉ రా 7 328

సీ పట్టు పాఱు మటంచుఁ బారావతంబును వెక
లినై నే నేల విడువఁబోతి ... సారంగ 2 145.

2 ఉన్మత్తుఁడు

సీ ... వెకలియై తిరుగ నేవేళను రతికేళి కళలు
దేరెడు మోము కళలుదేరె ... ప్రబం 1.755.

3 ఆసక్తురాలు, ఆసక్తము

గీ. ... వనిత చిన్నారి పొన్నారి తయసువాని,
విప్రవందనుఁ గన్నంత వెకలియగుచు. పాండు.
8 62.

సీ ... లీలఁ గర్పూరతాంబూల మర్పణఁజేసె
వెకలి మాటలతోడి యొక విసాళి ప్రబోధ.
5. 59

వ .. పుపాళ్ళ మప్పతిల్లు సెత్తావులకు వెకలులై
యాడు మొకరితుమ్మెదలు . మనుచ. 3.28.

4 అర్థము లేనిది.

సీ... వేడుక కై వను వెకలి వవ్వులు మీఁఱ నటనఁ
జూపట్టఁ బల్కుటయు లేక . వాల్మీకి. 1.33.

వి. వెఱ్ఱిది, అర్థము కానిది.

ఉ. వచ్చి పురంబువాకిట రువారపుగోదెతవంబు
తోడఁ, గన్నిచ్చకు వచ్చుచేడియల నెచ్చరి
కించుచు ధూర్తకోటితో, మచ్చరికించుచున్
వెకలి మాటలు మాయపుఁ గూచిమారవుం,
బచ్చలు చూచుచున్ సెలవి పాఱఁగ నవ్వుచుఁ
గేకరించుచున్ విక్ర 8 8

**వెకలితనము** వి (వెకలి+తనము) అవివేకము,
మూఢత్వము.

చ. అకట తదీయసత్కళల నాదటఁ గన్గొని మెచ్చి
పాతితో,పికముగ నిచ్చు సెమ్మనము చేడియలో
మరలంగవచ్చునే, వెకలితనంబుచే నిటుల
వేదవఁబొందఁగ నంచు నెచ్చెలుల్, పకపకనవ్వి
కేరడపుఁ బల్కులు పల్కఁగ నెట్టకేలకున్.
చంద్రా 2 145

**వెకలిపడు** అ. క్రి (వెకలి+పడు) అవివేకము నొందు.

క ఒక చెలిపై భ్రమపడి యా, సకి పిలువకయున్న మోహసంగతమతియై, వెకలిపడుచుంటి వదియు న్నమకురున్ వగవంగవలదు మనుజాధీశా. (పావంచో. 5. 148)

**వెకిరింత** వి. వెక్కిరించుట.

క. ... దీపము లేనింతుల్ సుఖలోపము లవి చీకటింటిలో వెకిరింతల్. (వై జ. 3. 26)

**వెక్క** వి. వేడిమి.

క. అక్కెండి యూరెలుంగై, చెక్కులు చెమరించి నెఱులు చిక్కులువడి కాల్పొక్కి వసివాడి యూర్పుల, వెక్కం గెమ్మోవి కమలి వికలాంగముతోన్. పారంగ 3 242

సీ. తరుణరంభాగర్భదళతాళవృంతంబుపై గాలి వెక్కన పలుకఁబాఱె .. నైష 2. 119.

ఆ వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చన యన నుష్ణ సంజ్ఞదగు .. (ఆం భా. 1 83.)

**వెక్కఁబెట్టు** స. క్రి (వెక్కన్+పెట్టు.) పైకి నిగుడించు.

తే వెట్టినీ రామకథమున వెడలునట్టిఁ, చొక్కుఁబోఁ దట్టి యొకకన్ను వెక్కఁబెట్టి, దడిగఱవఁ బోవు వేఁపిచందమునఁబట్టి, పరుసమెచ్చఁగ మారుజప్రముఖుఁ బలికె శుక. 3. 82.

**వెక్కలి**=వెకలి

ద్వి ... ఆ విప్రు,కడఁ గూడి చదువు వెక్కలి బ్రహ్మచారు,లు . నవ. 2. భా (శ ర)

**వెక్కసపడు** అ క్రి (వెక్కసము+పడు)

1. సహింపలేనిస్థితి నొందు

క. ఎక్కడివెలుఁ గిది యివ్విభుఁ, డొక్కఁడ యిటు చొచ్చెనెట్లొకో తెలి గమచున్, వెక్కసపడియెడు మా కతఁ, డొక్క ముహూర్తమున మగుడ నొయ్యననఁడోచెన్ హరి ఉ 5 87.

వ. ఇవ్విధంబున విరోధివర్గం బుక్కుదక్కి వెక్కస పడి చూచుచుండ .. భార. విరా 5. 2.

తే. ... ఓకాంత, యిచటికన్నోకభుజబ, లాఢ్యుఁ, డొకరాజు వచ్చి నీయాత్మభవునిఁ, దునిమె నెఱుఁగ మతండు వోయినపథంబు.

క ఇక్కరణిఁ జెప్పినన్ విని,వెక్కసపడి వనము నందు విహరింపఁగ . . భా రా. అర 1.131.

2. వింతపడు, ఆశ్చర్యపడు

ఉ. కయ్యము గల్గినట్లయిన గంధగజప్రకరంబు కుంభముల్, ప్రయ్యఁదురంగ పంక్తులుధరం బడఁ దేరిగముల్ బడల్పడన్, దయ్యములకీవు వెక్కసపడన్ గదపండువు సేయునాకు ... (భార. ఉద్యో 3. 67)

ద్వి మ్రొక్కుచులోకంబు వెక్కసపడఁగ . . బస పురా. 184 పా. 11. పం.

**వెక్కసపాటు** వి (√ వెక్కసపడు) సహింపలేని స్థితి నొందుట

ఉ వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లనున్ ... భార విరా. 5 112.

మ. ... ఈ,రసతో నొంచుఁ బరాభవించుఁ గలఁచున్ రౌద్రంబుతోఁ దాఁకు వె,క్కస పాటొందఁగ వ్రచ్చుఁ జించుఁ బొడుచున్ గారించుఁ దూలించు ... భా రా యు.1974.

ద్వి. అక్కటా యిది యెంతయన్యాయ మనుచు, వెక్కసపాటున విధిని దిట్టుచును, నరపతి దూషించి నాతి నిందించి, పురమార్గమున వారు పోయి రా ప్రొద్దు ద్వి. శ సా. 2. 835. పం.

**వెక్కసమందు** అ క్రి (వెక్కసము+అందు.)

1 సహింపలేని స్థితినొందు

చ .. జముల్ వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కస మందఁగ శత్రుకోటికిన్, వెఱపావరించు వార్త ... భార అశ్వ. 3. 157.

ద్వి. ఎఱిఁగి యాకసమున కెగసి వేగమునఁ, గఱకు రక్కసులు వెక్కసమంది చూడఁ, గపులెల్ల మ్రొక్కనుత్కటసంభ్రమమునఁ, గపిరాజు వచ్చి రాఘవునకు మ్రొక్కె. రం. రా. యు. 389. పా. 29 పం.

ఉ. చెక్కిటఁ జేయిచేర్చుకొని చింతిలు మన్మర టంచుఁ బావులన్, వెక్కసముఁదు లేమతొలువిం బొడఁగట్టినయట్లు నుఁడఁగా, వక్కునఁ జేర్పఁ బోవు భ్రమమంది వెనం దల యూచునంతలోఁ, బక్కునవవ్వు నింటిపయి బాలి నృపాలకమౌళి తన్నతన్. హంస. 1. 72.

2 ఆశ్చర్యపడు

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యెక్క కాంతరూ, పెక్కుడు పెంపు సొంపు మన కేర్పడుచున్నది దా వినీతయై, ప్రుక్కుచు వీచకామినుల చొప్పునఁ బల్కెడుఁ దారులుం గడున్, వెక్కసమందె చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. (భార విరా 1. 308 )

ద్వి వెక్కసంబందంగ వేయిమాడలును, జక్కఁగ నెన్నితిఁ జౌకముల్ ద్రోచి బస. పురా 120 పొ 10 పం

వెక్కసము వి. సహింపరానిస్థితి, దుస్సహత్వము

క ఇక్కైకవడి రక్కసునకు వెక్కసమునఁ దొడరు జముని వీరభటులతో, మక్కువ మార్కొని పోరఁగ, నొక్కరుఁడుం గలుగఁ డసుర యోధులలోనన్. ఉ. రా. 3. 336.

2. లోకువ, చులకన.

క. మనసిచ్చినఁ దన కోడరు, చనువిచ్చినఁ బ్రజలు వెక్కసము సేయుదురౌ, టను పతి మనసీయక కడుఁ, జనువీయక మెలపవలయు సమ్ముఖచరులన్. కవిక 2. 18.

3. వింత, ఆశ్చర్యము. (చూ. వెక్కసపడు.)

4 అధికము

ద్వి అక్కఱ గండఁడై యపఁటప్పటికి, వెక్కసంబున మూర్లు వేలు నపిఁచ్చి... ద్వి హరిశ్చ ఉ 478 పం.

5. బ. దుస్సహవచనములు.

ద్వి. నేడు నీకల్ల నానిజము, గానక యేల వెక్కసము లాడెదవు ద్వి. సారం. 1 32 పొ 17 పం.

విశ. 1. దుస్సహము.

సీ. ... రాధేయబాహులే యాతితేయజులకు వెక్కసం బెవ్వని విక్రమంబు ... వి. పు 1.46.

సీ. మెచ్చి యాచెలువంబు మిక్కిలి చూడ్కికి వెక్కసం బయి తోఁప వెఱఁగుపాటు ... కళా. 7. 68.

2. దుర్లభము.

ఆ. ధేమకాదుతైన దానవు లీతాళ,ననములో నున్న వారు దీనిఁ, జొచ్చి వాసవాది సురగణంబుల కైన, వెక్కసంబు బ్రదికి వెడలి చనుట. (వి. పు 7. 194 )

3. మిక్కుటము, అధికము.

చ. కొనరి వసంతకాలమునఁ గోయిల గోల్చిన భంగి నేడ్చిన,బ్బిసరుహనేత్ర కొండచఱిఁ బెద్ద యెలుంగున వెక్కివెక్కి వెక్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరుసోనలై, యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగువాఱు నట్లుగన్. కాశీ. 5 167.

మ రసికుండొ రఘునాథ కీర్తిసతి యౌరా! తొల్లి వాగ్బంధముల్, రసవాదంబును రాజవశ్యవిధి నేరంబోలుఁ గాకున్న వెక్కసపుం బ్రౌఢి వహించి శేషఫణిమూఁగం జేయఁ దారాద్రి ముల్లసముల్వ్రాక్కఁగ ఛత్రచామర మహోలత్కుల్మలనన్ శక్యమే విజ పీఠి. 18.

వెక్కసి విశ. (వెక్కసము + ఇ) 1 దుస్సహుఁడు, దుస్సహము, దుస్సహురాలు

ఉ మక్కువ నేమఁ గేగఁ బదమా యను మా యను వెల్ల రోయు నీ, వెక్కసి వెంచు సింగముల వేఁటల వేఁటలలీలఁ ద్రుంచుచున్ చంద్రా. 2 50.

ఉ అంతట నొక్కనాఁ డల ధనాధిపుఁ డశ్వము వాగె వెక్కసిన్, రంతులుమీఱ నెక్కి పెను రౌతన జోడన చెల్వుఁ జూపుచున్ ... కువల. 4. 199.

గీ. ఘనుల మునులను మన్నించి ఖరులకు ఖర, దూషణుల భీషణాంబకాదులను గూర్చి, యొక్క రక్కసి వెక్కసై సొక్కుదాని, ముక్కుచెవులకుఁ గల నిక్కు చక్కుచేసి. సీతా వి 1 10.

2. హింసకురాలు, హింసకుఁడు.

మ ... తద్భావంబు ఘోరంబుగా, విని గో గోపక గోపికానికరముల్ విభ్రాంతిమై బిట్టుమే,ల్కని చూడం బనుదెంచి రర్భకుల కెల్లన్ వెక్కసిన్. రక్కసిన్ వి. పు. 7 120

వెక్కసించు అ క్రి. (√ వెక్కసము ) 1. అధికము గఁగమపడు (దుస్సహమగు, అని శ. ర.)

సీ ... ఆ నాకు వెక్కసించు నా యామహైశ్వర్యంబు
మింకఁ బరులకైన నేమిచెప్పు, .. కవిక. 5.9

2. అతిశయించు

మయూరసారి వృత్తము వెక్కసించె శైలవిభ్ర
మంబు లొ౦క్కి రేఫజంబులుభ్రగంబుల్
చక్కఁగా మయూరసారికొప్పున్, నిక్క మంబు
జాతనేత్ర శౌరి అప్పక. 4. 171 211 పా.

**వెక్కించు** స. క్రి. (√ వెక్కు.) ఉబ్బించు, స్థూలము కావించు.

ద్వి. తొలుకోడి కనువిచ్చి నిలిచి మై వెంచి, ...
ముక్కున నీకెలు జక్కొలిపి కడుపు, వెక్కించి
మెడ సాచి నిక్కి మిన్నూచి. పండితా పురా.
88. పా.

**వెక్కిరించు** స క్రి (సం. విక్రి) అపహాస్యముచేయు.

ఉ. ... నిన్నఁబుట్టి తా, నెన్నఁడు భ్రాంతియయ్యె
మతిరాయన్నఁడు నేర్చెను వెక్కిరింపఁగాన్.
(కు. సం. 10. 610.)

శేతికొండ యొకనిచే నిచ్చి తలమున్న, కొండ
దొంతి కుదురుకొన నమర్చి, మగుడ నడుగ
వాఁడు నగచరుల్ నగ వానిఁ, గిక్కురించి
పోయి వెక్కిరించు. భా. రా. యు 267.

గీ. వీథిలోఁ బోడగన్న వృద్ధుల నరికట్టి వెకలియై
పలుమారు వెక్కిరించు. ఉ రా 7. 32.

అ. క్రి. 1 వికారచేష్టలుచేయు

సీ. కనుఁగొని తత్పురోగమ భూమిరుహశాఖ లెక్కి
యూఁచుచుఁ జాల వెక్కిరించు ... భాగ 10.
స్కం. ఉత్త. 544.

సీ. ... తే. వెట్టి యనరాదు పైఁబడి వెక్కిరించు,
గామి డనరాదు మొగమున గంటు వెట్టు శుక
3. 21.

2. ఇతరుల వేషభాషా చేష్టల ననుకరించుచు హాస్యము కావించు.

చ. ... తెలిలో కథచొప్పున బొమ్మలాడఁగా,
నొకకడ హాస్యపుం బ్రతిమ లుండవె పెక్కులు
వెక్కిరించుచున్ అని. 1 12.

**వెక్కిరింత** వి (√ వెక్కిరించు). (శ. ర) (చూ. వెక్కిరింతలాడు)

**వెక్కిరింతలాడు** స క్రి (వెక్కిరింతలు+ఆడు) ఎగతాళిచేయు, పరిహసించు.

సీ అలదుర్గ యొక్కిరింతల వెక్కిరింతలాడెడు రీతి
నాలుకల్ వెడలఁ జాచు ... కవిరా 2 83.

**వెక్కిలి = ఎక్కిలి** (సం హిక్కా త వికృమ్)

బ. వెక్కిళ్లు

సీ గీ .. తనరారు హిక్కకు నామ మగుచు,
వెక్కసంగ వెక్కిలి యన వేదవేద్య. ఆం. భా.
1 140.

**వెక్కు** అ క్రి (సం హిక్కా. త వెక్కమ్.)

1. వెక్కిలి విడుచు, ఎక్కిళ్లు విడుచు. ?

వ ... మోపెట్ట నశక్యంబయిన ముక్కుపెడి
వెక్కిన వారలం జూచి... భార. ఆది. 7 178

సీ చిపు రెల్లఁగని నొత్తి తొవరాకు గుత్తుక
డెక్కొని కోయిల వెక్కుచుండు ... కు. సం
5. 641

ద్వి. అక్కిలి పరపక యరగమ్న గొనక, వెక్కక
వీఁగక వెడగురు వడక ... పండితా. దీక్షా.
61 పా

2 ఏడ్చునపుడు వెక్కిలి ధ్వనివలె ధ్వనించు.

క. ద్రోవదియు సుభద్రయు శోకావేశం బడర
మోము లశ్రులఁ దోఁగం గా వెక్కి వెక్కి
యేడ్చిరి . భార. ఆశ్ర. 1. 163.

ఆ. మిక్కుటంపు జాలిఁ బెక్కు దెఱంగుల, వెక్కి
వెక్కి యేడ్చి భ్రుక్కి సొక్కి, పాలసుదిండి
తీర్పరులు బుజ్జగింప న,తండు గొంతదిట
మెదం గుదిర్చి. అ. రా యు 361.

3. వెగచు, దుఃఖించు, రోదనధ్వనిచేయు

క ఒక్కంతకాలమువారిని, వెక్కునయగు కాలము
వారి నెనయుదు రోలిం, దక్కువ కులజునిఁ
గవియన్, వెక్కుదు రిప్పులను గొలది వేశ్యలు
జగతిన్ విజ్ఞా ప్రా. కాం. 115.

క ఒక్కతె భయశోకంబుల, వెక్కుచు ఘెయిఁగల
విలాసవిభ్రమలక్ష్మల్, ధక్కుటయును నొక
యొలపైఁ, నెక్కొన ధరణీశునెదుర నిలచి
వినీతిన్. (మనుచ 4. 69)

ఉ. ... ఎక్కడఁ జొచ్చువాఁడ వింక నెవ్వరిఁ
జంపిననేమి యంచుఁ దా, వెక్కుచు లక్ష్మ
ణుండు పలవింపఁగ ... దశా 8 140

వి. వెక్కిలి, వెక్కిలి. బ వెక్కిళ్లు.

తే. ... ఊర్పు లెడతెగుఁ గన్నుల నొందు వికృతి వెక్కు పుట్టును నాలుక వెగడు గదురు. మార్కం. 84.

సీ. .కోరకతతులపై జేరి యాసక్తిచే నవి పీల్చి యాపోవ కవలికేఁగి, కుసుమ మొక్కటి యబ్బె నెవ మూఁగి మధుపాన వక్కండు టముజేసి వెక్కు పుట్ట, నించుకించుక త్రాగ చంచువు పద నొంద నా తృప్తిఁ గ్రోలఁబోనందు లేమి, (భోజసుతా. 3 22)

సీ. వెక్కులు పెక్కులై వెతలఁ బెట్టుచుమందు శ్వాసంబుఁ బుట్టుచు గాసిఁ బెట్టు ... శివధర్మో. 6. 47.

విశే. సన్నద్ధము, సిద్ధపఱుపఁబడినది

ఉ క్రేవల వేఁటకాండ్రు దమకింపగ డాపల వెక్కు శాకులం, బోవుచుమాంస భేదముని బోనము లాయితమైనదాఁక నా,యావిధు లాచరించి యవి యన్నియు దేవరకెక్కు నట్టి సం,భావన సేసి తారు మఱి బంతులు సాగి భుజించుచుండఁగన్. కళు. 1. 117.

అ. క్రి ఎక్కు. రూ. (సం. హిక్కా) 1. వెక్కిళ్లు విడుచుట. 2 ఏడ్చునపుడు ఎక్కిళ్లవలె ధ్వని చేయు.

తే. వేఁడియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి యేడ్వఁ దొడఁగె లతాంగి. .... శృం. నై. 4 87,

వెక్కుమీఱు క్రి. (వెక్కు+మీఱు) వెక్కిలి విడుచు, వెక్కు.

చ. వివశత నొంది మేను విడువెంద్రుక వెట్టఁగ వెక్కు మీఱి క,న్గవఁ దెఱవంగ రాక పొరిఁ గంపము నొందుచు నిశ్వసించుచున్ ... హరి. ఉ. 8. 110,

వెక్కురు విశే (√ వెక్కు సం. వికారి.) వికారము గలవాఁడు, వికృతము.

క. ఎక్కడి సుతు లెక్కడి సతు, లెక్కడి సంపదలు మాయ లిన్నియు ధర్మం, బొక్కటి నిజమని యెఱుఁగని, వెక్కురులకు సుకృతి భోగ విభవముగలదే. కుచేల. 1 62.

ద్వి. కడఁగి పేదవులఁ గాయపం దేరి, కుడిచి వర్తించు వెక్కురు తాపసులకుఁ, బొడల కళా సంబో బూదిబొక్కణము, జడలో రుద్రాక్షలో నంపద లేల? హరిశ్చ పూర్వ. 1484.

క చొక్కపు శర్కసికులమున, వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందున్, నిక్కపు మక్కువ విడువం, డెక్కడి సుతుఁ గంటి రాజశేఖర వెట్టిన్ భాగ 7. 254

క నిక్కము మొనలిపి రెండవ, యక్కరమున కరిగ్రవంబు వందుండిన యా, వెక్కురు కల్పం బొడయనిఁ, జిక్కువడఁగఁ జేయుఁ బగరచేఁ ఱణభూమిన్. అప్పక. 1 348.

సీ వెక్కురు నాఁగను వికృతుఁబు విలసిల్లు . .అం. భా 1 182

వెగచు అ. క్రి. ఏడ్చునపుడు వెక్కిలివలె ధ్వనించు.

ఆ విడువవయ్య తండ్రి తడయక వచ్చెద, వీఁడె నన్నుఁ జూచి వెగచివెగచి, కొడుకువద్ద వెగడు వడి యేడ్చుచున్నాఁడు . మార్కం. 1 215.

ద్వి వెడలు నిట్టూర్పులు వెగచుకుత్తికయు, బడలిన మేనును బగిలినమోము. ద్వి హరిశ్చ. 2083. పం

క. వగచిన చిత్తము వలఁదురి ... వెగచిన కంఠ మునుడుగక, నెగసిన నిశ్వాసతతియు నీరజ ముఖికిన్ కు సం. 5. 587.

2. వెక్కు, ఏడ్చు.

సీ. కాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలు కన్నీటితో వెగచువాని . భాగ 10 372

వెగటు వి రోఁత, వైరస్యము

సీ విబుధ ధామముమీఁద వెగటుగల్గినఁగాని నవ జారి మిముఁజేరి చెనక వెఱచు కువల 2 15

సీ. భవ్యకల్పక సాదప పరిష్కృతాత్మీయ విపిన ఖేలనముల వెగటుఁబూని... హరిశ్చ నల 2. 18

ఆ పరుల పంచఁ జేరి బ్రతికి పలా వృత్తిమెత్తలంగు కోకిలమ్మునకుఁ బో,సంగుఁగాక యింటఁ జక్కెరద్దినిమని, వెగటు చిలుక నీకుఁ దగునె చిలుక, రసిక. 4 172.

విశే. అనిష్టము,

శా. నీ రమ్యాకృతి నెమ్మదిం దలంచుచున్నిద్రా విహారంబు లావోవఁబు వ్వెగలై మనోభవశర వ్యాకీర ధారాహతిన్ ... క,న్యాసత్కంబు ప్రసూన తల్పమునఁ దాసా క్రిన్ వెసన్ దూలె డిన్. ఇందు 2 177

క. ఆమె యఁట నన్ను బలిమిన్, గామించునఁట యొడఁబడక క్రమ్మటి నేరా,స్వామికి వెగటుగ ననునఁట, యా మాటకె యాజ్ఞ వెట్టు నఁట విభుఁ డహహా. సారంగ 2 21.

2. విరసము.

క. అని యది యాడిన మాటలు, విని జంగమ మూర్తి మదికి వెగటుగఁ దోఁపన్ ... చెన్న. 2. 32.

తే. అయ్యలార మీ కెల్ల నే మవిన మాట, వెగటు కాదుగదా . . పరమ. 3. 37.

3. వెక్కసము

సీ. ముసు ద్రుంగి వెగలైన వనతమ స్తతి గ్రక్కు-ఘన విరోచన మయూఖములవంగ ... చంద్రి. 4. 34.

వెగడందు = వెగడొందు అ. క్రి (వెగడు + అందు.) వైవశ్యమును పొందు.

వ. వారును దత్కృపాణ్యా దర్శనంబున వెగడందిన వారు గావున ఉ హరి. 3. 185.

వెగడు వి 1 చలనము, తల్లడము.

చ. ఒకరుఁడ కాను భీతి వెగడొందెదు రెండవ వన్ను నెట్ట కేలకుఁ దగఁ దేర్చునప్పుడు బలం బుతోఁ గురు రాజు మూద ... భార. విరా. 5. 336.

తే రోదనధ్వని లెనఁగంగ రుక్మిణియును, సత్య భామయు వప్పుడా సవ్యసాచి, కదకు నేతెంచి పుడమిపైఁ బడిరి వనట, వెల్లి మునిఁగి యుల్లం బులు వెగడ నొంద భార, మౌస. 102.

2 తరఁబాటు.

చ ... పుష్కరపత్ర నిభంబు లైన లోచనముల మూర్తి దేల్పఁగ ససంభ్రమతం బనుదెంచె వల్లవ,ల్లన వెడ భీతిదోఁప జనులన్ వెగ డయ్యెడు దృష్టిఁ జూచుచున్. భార. విరా. 1. 276.

క తగదత్తు నేమఁ గడరిన, వెగడునఁ బాండవుల మొదలు విఱుగుటయు .. భార భీష్మ 3. 85.

3 భయము

సీ లోటికిఁ దోఁచినఁ బోలియుఁ దేకువయము వెగ డునఁ జెయ్యులు విడువడఁగ .. భార విరా. 2. 70.

చ. అనుటయు నాతఁ డాత్మ వెగడంతయుఁ బాయఁ బ్రబోధ లక్ష్మి గ్ర,మ్మనఁ దలయెత్త నాద్యునసమాను సహాతము వాసుదేవుఁ డాఁగని . హరి. ఉ. 9. 108

4 దుఃఖము

ఉ. నావుడు మూర్ఛవచ్చిన మనంబునకున్ ధృతి యూఁత యిచ్చి నం,తావన వారిఁ బోఁ బనిచి పార్థివ ముఖ్యుఁడు దల్లడంబునన్, దావు కొవంగ లేక తనతమ్ముల నప్పుడ పిల్వఁ బంచి నా,నావిధ చింత ము ట్టకొనినన్ వెగడందుచు నా ధర్మమూర్తియై. నిర్వ. 8. 109.

వెగడుపడు అ క్రి (వెగడు + పడు) 1 తల్లడపడు

ఆ. ... కొడుకు దద్ద వెగడుపడి యేడ్చుచున్నాఁడు, బుజ్జగించుచు నేమచు ... మార్కం. 1 215.

సీ. సకలాంగ ధనిత కంచుకమున విషపుచ్చు విషధ రాదుల భీతి వెగడుపడక ... కాశీ. 1. 71.

ఆ. .. సదనులోని విప్రజనుల మీఁద, వెగడు పడఁగఁ గాటి వెఱపింతము ... భార 2 150.

2. తొట్రుపడు, తడఁబడు

వ అట్టి యవక్ర విక్రమ పరాక్రమంబునకు వెగడు పడి కాణుండు వేట మొగంబువడి నేయు నది లేక విన్నవై యున్న యెడ ... భాగ. 10 ఉ. 423

3. భయపడు.

వ హింస్యాక మందరంకులు ఒహరిన్నిగ్రమునఁ బోవర్తి వెగటు పడ యున్న మృగంబు మాఱడించి యాకర్ష్యం బొవరించి. వేం. పంచ. 2. 179.

వెగడుపఱచు స. క్రి. (√ వెగడుపడు.) వెగడుపడ జేయు, తల్లడపఱచు.

క అతఁడంద విశిఖంబులు, వితథమ్ములు గాక వారి వెగడుపఱచి యుద్ధతి సైంధవుపోవడ నెద, కతిరయమునఁ దేరు నడపు బా వయమునన్. భార. ద్రో. 2. 98.

తే .. మగుడఁ జదువుఁ జెప్పఁదలఁచె.

క. తలఁచి యదియవు డొకింతయుఁ, దొలుతటి తరువాయి మఱియుఁ దోఁచక మఱియవ్వల వరసిన శ్రుతిశబ్దము, పలుకునకున్ రాక వెగడు పఱచినఁ గలఁకన్. పర. 1 113

2 తడఁబడఁ జేయు, విశ్రాంతి నొందించు

తే ఇట్లు గృహరాజి కేలి తానేకరత్న, వివిధ రుచి వైభవంబులు వెగడు పఱుప. వసు 4 73

వెగడొందు=వెగడందు అ క్రి (వెగడు+ఒందు)

1. తల్లడపడు, చలించు

సీ విబుధారి కినుకకు వెగడొందు తెఱఁగువ వన రాశికరము ఘూర్ణనము నొందె .. నృసిం. 2. 107

సీ వెగడొంది రవితేరి నొగలఁ గట్టినయట్టి వాహంబు లశ్వలు వైచుకొనియె ... విక్ర 4. 60

2. తడఁబడు

క. వగముట్టకొవినఁ జిత్తము, వెగడొందఁగ మేను గలయ ... భార విరా 2. 308

3. భయము.

క. వెగడొంది యిట్లు పలుకఁగ, వగునే ... భార విరా. 4. 66.

గీ. విఱిగి పాఱినఁ బోనీక వెన్నడించు, హలధరునిఁ జూచి వెగడొంది యబ్ధిలోన, నుఱికి . ఉ. హరి. 3. 107

వెగవెగ వి శీఘ్రముగా నడచుటయందగు ధ్వని కను కరణము; గబగబ.

సీ. వేగుఁ జూచెదమంచు వెగవెగఁ జనుదెంచి దూర మేఁగుచు బొదల్ దూఱువారు....కృష్ణ.3.46.

వెగ్గము వి. పంతము.

ద్వి ఒకతోఁటలో నితఁడున్న మాయక్క, వెక లియై తనుఁజూచి వెగ్గంబులాడి, లలితంబులైన విలాసముల్ చూపి, వలపింపఁగలనె యీ వటు వేషధారి, నని ... ద్వి పరమ. 4 336 పా.

వెగ్గలమాడు అ. క్రి (వెగ్గలము+ఆడు) అధికముగా సంచరించు.

ఉ. ... తరుమరంద సరస్వరవింద గోష్ఠికిన్, వెగ్గల మాడు తేంట్లు ... ఆము. 5. 122.

వెగ్గలము విశ (క వెగ్గళ) అధికము

ఉ వెగ్గలమైన మోపుగడు పిఁకవ యెత్తఁగఁబోయి ముందటన్, ప్రొగ్గతిలం బడెన్... పంచ.1 21

క. ... పెనఁ జెంగల పలలనురలు మృగములన్, దగ్గఱి చంపెడువేడుక, వెగ్గలమై చిత్తమందు వెటాడంపన్. భాగ. 1 464.

క సలసలమను కలశజు వెగ్గలపుం గినుక యను సెసటఁ గల వడివడి నౌదలయంటి చూచు కొనియె, నిలువెదలితి నాక్షణంబ యెత్తిన క్షితిన్. పాండు. 5. 207.

సీ . గీ జలజనాభుండు కోదండ చతురుఁడగుచు, గుఱ్ఱములతోడ సారథిఁ గూలచేసి, వారెవయుఁ జక్రరక్షకద్వయముఁ ద్రుంచి, కల్లు విల్లులుచేసి వెగ్గలము వవ్వె ఉ హరి. 3 99.

గీ బాల్యమువ నుండి యౌవన ప్రాయమైన, యపు డుఁడన భార్యయందు నయం బొకింత గావఁ దయ్యెను వేము వెగ్గలము పెరుగఁ, గలదె మాధుర్యగుణము తిక్తంబుగాక వై. భా 4.86.

వెగ్గలించే న క్రి (√ వెగ్గలము), త్రోసివుచ్చు.

ఉ మన్ననచేసి మీరు బహుమానముతో ననుజేలి నారు నేఁ, గన్నది దెల్పకుండిన వఘంబగుఁ గాదని వెగ్గలింప కీ, విన్నత మూలకింపుము ... సారంగ. 2. 6.

వెగ్గలీఁడు విశ. (వెగ్గలము+ఈఁడు.) అధికుఁడు, గొప్పవాఁడు.

సీ. అబ్ధిసంభవ యితఁడు వో తోలవాలపు విషము బుక్కిటఁ దాల్చిన వెగ్గలీఁడు ... కాళి. 5.115.

(క ర పా. వెంగలీఁడు మ[illegible])

వెచ్చ వి వేఁడిమి, తాపము

సీ. వలరాచరాచ వాఁడలితాయు కమువెచ్చఁ గరఁ గిన యల కనికరవుఁ బోతు ... కుకుచ. 2 9.

చ. ... వెచ్చలం, గరికరి తాపతాంగములఁ గప్పి క రొంపులు వందయాఱఁగొ. ఆము 3. 47.

2 జ్వరము.

సీ ... వెక్క నా వేఁకి నా [illegible] మొప్పు . అం. భా. 2. 128.

3. కాఁక, తాపము.

చ... అధిరాధ్వరవా భరంబున నొప్పదము వెచ్చకు
కాంతి యొనరప్రవాహినీ, తరుణులు మేన దట్ట
ముగఁ దాల్చిన ము త్తెపుఁ బేరులోయనన్
ఆము 2. 51.

విశ 1. ఉష్ణము, వేఁడియైనది (వృత్తియందు వికల్పముగ నిగాగమము)

ఉ. వెచ్చని కన్ను నీరడర వీడిన వేనలితోడఁ
కెల్పనావుచ్చి తనూజులం బనవ ... భార.
ఆను 1. 299

సీ. ... గీ. కేట నలివెచ్చ నీరువఁ దీర్ఘమాడి ..
వార 2. 107.

చ. తెలి మలి వెచ్చయోగిరముఁ దియ్యని చేరులుఁ
దిమ్మనంబులున్ ... ఆము. 2. 81

2. తీక్ష్ణము, అసహ్యము.

చ. వలచుట జాతిలోనఁ దలవంపగునే కదయింక
దాఁచఁగాఁ, గలిగెడిదేమి నా వనువుకాంద్రను
దాల్లిఁటివారి వీథిలో,వలఁ గనివఁత వెచ్చ వగు
కాటున కోరిచి యన్నదమ్ములం, బిలిచిన రీతిఁ
బిల్వ వలపించెఁ జమీ యతఁ దంబజావనా.
కువల. 4 181.

క్రి. విశ వేఁడిగా.

తరలము. సమరకూరులు పాండవుల్ జితశత్రు
లున్నత చిత్తు,లుత్తములు వారలతోడ వైరము
ధర్మయుక్తిఁ గరంబ యుక్తము ప్రజా క్షయ
కారణం బని తద్దయున్ భయమందుచున్, విమ
మఁడై పడియుండె వోయని వెచ్చమార్పుచు
విన్నుడై భార. సభా. 2. 310.

వెచ్చఁబడు అ. క్రి. (వెచ్చన్+పడు) వేఁడి కలదగు.
(వ్యవ.) స్నానమునకునీళ్లింకను వెచ్చఁబడలేదు

వెచ్చఁబెట్టు స. క్రి (వెచ్చన్+పెట్టు) వేఁడిమి కలిగించు.
(వ్యవ.) నేయి వెచ్చఁబెట్టుము.

వెచ్చకాఁడు (వెచ్చము+కాఁడు) విటుఁడు. (బ. వ.) వెచ్చకాండ్రు.

వ. . . ఈ ధనంబుల నేమి యయ్యెడు నయ్యయ్యో, ఈ వెచ్చకాఁ డెచ్చటికేఁగిన నేమి? ... నా చేసిన దురితంబె తకాలంబునరకంబుల మండినను దరుగునే, పడచి కుడుచు పడఁతికంటెఁ బాపిని యున్నదే యని విచారించు .. జాహ్నవి.
4. 41

సీ . .గీ. సురల యాఁకటికూఁడు ముచ్చులకు
గీఁడు, దిక్కులకుఱేఁడు వెలుఁగుల యిక్క
కోఁడు, లచ్చి సైదోడు రేఁబోటి వెచ్చకాఁడు,
చంద్రుఁ డలరారె సత్కళా సాంద్రుఁడగుచు.
కవిజ. 3. 79

విశ మిక్కలి వ్యయము చేయువాఁడు. (శ ర)

వెచ్చన వి వేడిమి, ఉష్ణము.

ఆ. వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చనయన, నుష్ణ
సంజ్ఞతగు .. ఆం. భా 1 47.

విశ ఉష్ణముగలది, వేడియైనది.

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలఁదాఁకి తీండ్రించు
నసిలోహమున వెచ్చనై జనించె ... ఆము.
1. 36

క్రి విశ. క్రియా. వేఁడిగా, వెచ్చగా.

ఉ ... చెలంగని వెచ్చనూర్పుచున్. ఆము 5. 39.

వెచ్చపడు అ క్రి. (వెచ్చము+పడు) వ్యయమగు.

క కడు మేటదైన దొరచేఁ, ఒడినది మీసొమ్ము
వెచ్చ పడనోపిన నీ, కడగొంత దివ్వవచ్చున్...
పరమ 5 57

ద్వి. చేతివిత్తము మున్న చెనటయై పోయె,
పలు తెఱంగుల వెచ్చపడి ... నవనాథ. 5.
211. పా. 19. పం.

వెచ్చపఱుచు (√ వెచ్చపడు) స క్రి. వ్యయము
చేయు

గీ. ... వచ్చపైకంబు నిందలో వెచ్చపఱుప,
నెన్ని చెప్పినమాట లింకేటి కనిన ... హరిశ్చ.
4. 199.

వెచ్చపెట్టు స క్రి. (వెచ్చ+పెట్టు) 1. వెచ్చించు,
వ్యయముచేయు

క. కట్టక కుడువక యొరులకుఁ, బెట్టక తమతండ్రి
కూడఁ బెట్టిన సిరిఁ ... దనయిచ్చ వెచ్చ పెట్టి
దలంచెన్. విక్ర 2 163.

ద్వి పలోకో కౌసల్య యొదమున్ని యున్ని, వే
సంఖ్యధనంబు వెచ్చపెట్టెడిని ... ర. రా.
అయో. 88. పా. 28. పం.

తే మాద్రి మీరు విపులవేద్రాద్రిరాజు, దాన ధారార్థ మఖిలప్రధాన నగు, వెచ్చపెట్టుటఁ దలఁచి యోవిబుధ తటిని, తపన శశిమౌళి జడలలో దాగిఁయు డు పాం డు 1 72

2 విడుచు

చ హరిపద పూజనం బొలంగి యంత్యాఘుఁ గొల్చు కులాభిమానముల్, వరసుర వెచ్చపెట్టి హరి చందన కీర్తులు వీటిఁబుచ్చి .. హరిశ్చ 5 92

3. చెఱుచు, పాడుచేయు

చ ... మాయ నింద్రియాధిక మతియైనవాఁడు దన తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పాతకములఁ గూలకున్నె ... భాగ 6 517.

4. ఉపయోగించు, అనుభవించు

శా. ఏలా వేయును విన్నవింపఁగఁ ద్రిలోకేశా మహేంద్రాదిది, కాలైశ్వర్యము వెచ్చపెట్టుకొను మింకన్ సృష్టి నష్టంబగున్ .. వరాహ. 10 18

అ వలసినట్లు దివ్యవస్తువులెల్ల నా, యిచ్చవచ్చినట్లు వెచ్చపెట్టి. ప్రభా 1 85

("నా యిచ్చ ననుభవించి వెచ్చపెట్టి" అను పాఠాంతరమున "వెచ్చపెట్టు = వ్యయపఱచు, వెచ్చించు" అని యర్థము.)

**వెచ్చపోవు** అ క్రి (వెచ్చము+పోవు) 1 వ్యయమగు, తఱుగు

చ తన ధన మించుకంతయు వృథా వ్యయమైనది లేదు వైష్ణవార్చనలకు వెచ్చపోయినది సర్వము ... పరమ. 4 148

సీ కళవెచ్చపోని నిర్మల చంద్రబింబంబు పన్నభృతంబంటని సగనకిసలము రామా 4. 64

2. నశించు, చచ్చు

ఉ. ... అలిని బిడ్డల న్విడిచి యాకటి చిచ్చున వెచ్చపోవువారలైలిక బంటు వాని మొక్కయించుక లేక కృశించువారునై, తూలె జనంబు మీన కని దోషము దాఁకి నిరస్తసస్యమై ... కాశీ 8. 153.

**వెచ్చము** వి (వి సం. విసర్జనమ్) 1. వ్యయము,

గీ వెచ్చమన్న ఁడ నంటుఁట వేఁడువాఁడ, ధీశ్వరుఁడఁట తాము పతివ్రతలఁట . కళా. 6 90

క ఈమెటు వెచ్చము చేసిన, నామేరు మహాద్రియంత యర్థంబైనన్, వే మొదలికి మోసంబగు ... విక్ర. 2 167.

క ఎచ్చోగజ ఘోటక్రియ, తచ్చగ్వణ సుభట జీవిత ద్విజనుంపు, జోచ్చ నిజభోగములు కగు, వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకున్ అను 4 262

2. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లర సరకుల యప్పు.

ఉ వెచ్చము పెట్టుమన్నఁ బదివేలకు నుద్దరువొల్లరు .... పి శకుం 1 78.

సీ బచ్చయి వెచ్చంబు లిచ్చురొక్కపు దొరదళవాయియై కొల్చు చిలువ తాల్పు ... అచ్చ రా సుం. 41.

3. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లర సరకు

క ఎల్లుండి సమారాధన, చిల్లర వెచ్చములు గొనఁగ శీఘ్రమెయిది యీ, పల్లియ సంతకుఁ జని ... శుక. 2 183

**వెచ్చించు** స క్రి (√ వెచ్చము) వ్యయపఱుచు.

సీ అశ్వగో మహిష రూప్య సువర్ణ వస్త్రంబు లెన్ని వెచ్చించిన నేమిఫలము ... భీమ 4 82.

క ఐనను బతికార్యము తన ప్రాణము వెచ్చించియైన భటునకుఁ జేయంగా నగు .. ప్రబోధ. 3. 69.

**వెచ్చు** అ క్రి 1 క్రాఁగు, తప్తమగు.

ఉ వెచ్చెన మిన్నభంబు పరిపీత శరార్చుల దైత్యసైన్యముల్, విచ్చె . శకు. 2 123.

గీ . అట్లు సిద్ధుఁడరుగ నమ్ముగ్ధ ముష్టిఁబొందె, విరహవహ్నిచేత వెచ్చివెచ్చి భోజరా. 3 70.

ద్వి. పాముచే నీవు లోఁబడియుండు టెఱింగి, వేమారు శోకాగ్ని వెచ్చుచుండితిమి. ద్వి. భాగ. 2 23 పొ.

సీ . గీ. వెచ్చెననఁగంటె ననఁగను వేఁగె ననఁగఁ, గమలె ననఁగను నేకార్థములుగ. అం ధా. 3. 99.

2. సంతాపము నొందు, పరితపించు

క అవ్వవు వెన్నెలచేఁ గడు, వెచ్చుటలును మాన మెతలి వెడవిల్తునిచే, నొచ్చుటలును బ్రియుఁ డుచ్చిని, ముచ్చటలును విప్రలంభమునఁ జెవఁ దగున్. శాప్యా. 3. 128. వ

ఉ మచ్చిగ రెట్టిగాఁగ దన మందిరమొంది యభీష్ట వస్తువుల్, నెచ్చెలు లెల్లఁబొంది సుఖలీలఁ జరింపఁగఁ జేయలేమికిన్, వెచ్చని యూరుపు ల్దించుకొని విన్నఁదనంబును బొంది నెవ్వగన్, వెచ్చినయట్లు సజ్జనుఁడు వేతొక దుర్దశచేత నొచ్చునే. కేయూర. 3 274.

సీ. కుదుళ వేడుక పుట్టి కడియు పోటికిఁబోని వేదన వెడవెడ వెచ్చివెచ్చి ... వాసిష్ఠ. 1 124

3. కాలు, దగ్ధమగు.

వ ... అలాట లోచను లోచనంబు చిమ్మిన నతం డును వెచ్చి విమ్మఁగూడెనే ... హర. 3 9'.

ఉ. చిత్రజవైరి ఫాల శిఖరే జగ మెల్లను వెచ్చఁ జూచెనో, యుత్తెఱగంటి పట్టమునకే నిటులుండక యుండ నెవ్వఁడే, నెత్తులు వెట్టెనో ... వాల్మీకి 3. 7.

4. మండు, జ్వలించు.

ద్విప. వేఁడి వేలుపుదిగి వెచ్చి దీపంబు, లీడేర్చు లిలి ... ద్వి. హరిశ్చ పూ. 1157.

వి. వేఁడిమి.

కం ... ముచ్చిచ్చునను వెచ్చునర ... అము 3. 28.

వెజ్జరికము వి (వెజ్జు+అరికము) వైద్యము.

క. నేరని వెజ్జరికము గా, నేరుతు నని రాజ పురుషునికినితరునికిన్, జూరాదు లిడిన దురను, జారనిరోవవలయు నుత్తమాధమ విధులన్ విజ్ఞా. 2. 67.

వెజ్జు వి. (సం వైద్యః.) వైద్యుఁడు, భిషక్కు.

అ. ఇన్ని సంకటములు నిబ్బంగి నెంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వుదీరఁ, వెజ్జ వీవకావె ... భార ఉద్యో. 3 26.

శా ... వేరం బెత్తిన ధాత చెయ్యి యిడువన్ వెజ్జెవ్వఁ డూహింపఁగన్. దశకు. 2. 89

ద్వి వెజ్జులు వచ్చిన్న వేగ మాన్పెదరు, లజ్జింపనేఁటికి లతాంగి నీకు . . రం రా అయో. 92. పా. 10 పం (104 5 నవ్య సం)

ద్వి. మందు వెట్టఁగ లేము మనఁజేయలేము, వెదక నంపఁగ లేము వెజ్జుఁ దేలేము ... ద్వి హరిశ్చ. ఉ. 1983

వెజ్జుఁదనము వి (వెజ్జు+తనము) వైద్యత్వము. వైద్యుఁడయి యుండుట.

గీ .. కడవనాకదు చాలు నీ గొడవయేల, వెజ్జుఁ దనమేల యని మది లజ్జవొడమి మనుచ. 5. 13.

వెజ్జురాలు వి (వెజ్జు+అలు.) వైద్యముచేయు స్త్రీ.

గీ. అనుచు వారలు పలుకంగ నాతణమున, జయను విజయను దోడ్కొని జవన గతిని, వెజ్జు రాండ్రును మీరు నా బిడ్డచెంతఁ, బదిలముగ నుండుఁడీ యంచు పవముఁజేరి పార్వ 4. 187

మ .. ఉగ్రదశ వక్త్రిభృచ్చిరోభారమున్, శమ మొందింపఁగ వెజ్జురాలయిన కాంతన్ భక్తి భావించెదన్. చంద్రా 1. 2.

వెట్కా-(టకా)రము వి ఎత్తిపొడుపు.

శా కానిమ్మెంత ప్రయోజనం బనుచు వెట్కా రంబుగాఁ బల్కు, నాథానో త్తంసముఁజూచి ... రంగా. 2 45

వెట్ట వి 1 వేడిమి

గీ అట్టి వేసవి బెడిదంబు వెట్టకతన, నేల వందందు విరిసిన నెటియలందు ... వాల్మీకి 2 70.

(మార్తాండుఁడు) గీ. త్వష్ట కవ్యక సంజ్ఞనుద్వా హమయ్యె న ప్పిలాసిని యమ యమునాహ్వ యములు, గలుగు కొడుకును గూఁతును గనియెఁ గని నిజేశ్వరుని మేనివెట్ట పహింప లేక. వరాహ 5 89

సీ ... జిగి దొండ పండంచుఁ జేరవచ్చిన చిల్క బలువెట్ట దిగులొంది పరువు లిడఁగ ... ఇందు. 3. 28

2. వేసవికాలము, వెట్టకారు.

చ పరియగు నిట్టి వెట్టలను సరఁము నేంచు ... ఆము 2 47

3. తాపము,

ఆ. ... కాంత నామధేయ మొకయు గైకొని,
చిలు, నీకు వెట్టనేయ దగునే కవి.2.50.

గీ .. పేరగేస్తుం కొంపలు బిస్సగాజె, బజులు
వెట్టలు వడిని.కఁ బాజెనపుడు అచ్చ రా
కిష్కిం. 67.

విజ వేఁడి, ఉష్ణము.

గీ వెట్టదినములు మడుఁగుల మట్టి గంలవ, బుడ
బుడధ్వని వెకలు బుద్బుదములందుఁ, జిలుప
చిలుపని నేకులు జిడ్డుదేఱు .. మనుచ. 4 17.

సీ. రే రాచ గేసంగి రేకు క్రొవ్వెదతోడ వెట్ట కన్
తేగురు బోట్టుతోడ పాంచాలీ 3 77.

ఉ. వెట్టగ మందమారుతము వీచఁగఁ దోడ౩
ద్రోలెఁబై విరుల్, మిట్టిపడఁగ ... సారంగ
2. 168.

చ. పరిసర చంపక ప్రసవ పంక్తులఁ బుట్టినవెట్ట.
వావవల్, గంళముల్లై పయిం బోయిగాసిలి
వచ్చు మహాశి నీ పరం పరలు భవత్పదాబ్జము
లపై నొలసెన్ ... ఉ రా. 6. 43

**వెట్టకాలము** మి వి వేసవికాలము గ్రీష్మర్తువు

వ. ఇట్టి బెట్టిదంపు వెట్టకాలంబున గట్టుపట్టి యిట్టి
ట్టవరాని బీరంబునఁ బంచాగ్ని మధ్యంబున
నుండి .. మృత్యుం 2 45

**వెట్టచెవులతపసి** (వెట్ట + చెవులు + తపసి.) ఉగ్ర
శ్రవసుఁడు.

గీ. విను నిరాహారి ఉేండ్ల కన్వెట్ట చెవుల, తపసి
రాయఁడు నీలా 2 2

**వెట్టము** వి. శత్రువు

సీ. కలువల చుట్టంబుఁ గలువల వెట్టంబుఁ దన
రెండు కన్నులై తనరు వాని ద్వా. 2. 158.

**వెట్టి** వి (సం విష్టిః) ప్రతిఫలము లేక చేయుపని

సీ విరాజు రాజులనెల్ల జయించి మున్ వెట్టికిఁ
బట్టె దోర్విక్రమముల . మార్కం పు 35

క ఆట్టి ఘనపుణ్యవాహిని, నట్టింటనె యున్న
యది ... వెట్టగదే భూమిఁ దిరుగు విడుపు
దురాశల్ భోజరా 6 302

సీ. వలుక గల్గిన జాలుఁ బనులు నేయించును
వెట్టమైఁ జదలేటి పట్టిపైన ... యయా
1. 13.

**వెట్టిగొను** స క్రి (సం. విష్టి) (వెట్ట + కొను) ప్రతి
ఫలమీయకయే పని చేయి చు

శా . . వాలాయంబున మమ్ము వెట్టిగొనుచున్
వర్తింపుచున్నారు మీ, రాలవ్యం బొనరించినన్
బ్రదుక శక్యంబెట్లు మాకొంట్లకున్. భీమ.
4 119.

చ. మదమున నిద్రఁ దారిగ నమస్త నిశాంపుల
వెట్టిగొన్న నా,యెమర మృగాంక నీవకట హీన
పరాక్రము రాముగిముఁ జె.పెంపవు . భా.
రా.అర. 2. 105

**వెట్టిజవరాలు** వి ప్రతిఫలమును గోరకయే వచ్చి పని
చేయు స్త్రీ

సీ. . గీ పేరుగల యట్టి జవ్వంపుఁ బైరుఁబాఁప,
వెట్టి జవరాండ్ర కిరుగోరు వెట్టు కావు,లట్టి
యచ్చరజాతిలో మొట్ట మొదలి, పేరు గలదాన
మేనక పేరుదాన చంద్రా. 3 101

**వెట్టివాఁడు** వి గ్రామమునందు దినభత్తెము లేక వెట్టి
పని చేయువాఁడు

సీ వెట్టివానికి నేల విమల విచారంబు పరదూష
కున కేల పరముచింత నీతి ౪ 3.

**వెట్టీఁడు** విశ. (వెట్టి + ఈఁడు) ప్రతిఫలము లేక చేయు
వాఁడు, వెట్టిచేయువాఁడు. (శ ర)

**వెడ** విశ 1. అల్పము, కొంచము.

ఆ వేగజాము గలుగ వెడనిద్రఁ బొందుదు ...
భార అర 5 308

చ ..నసంభ్రమతం జనుదెంచె నల్లన,ల్లన వెడభీతి
దోపఁజనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్.
భార విరా. 1 276

ఉ . నెన్నడు మొకించుక గౌరవమందెఁ గోరి
కల్, నెక్కొన నిక్కెనారు వెడనిద్ర కనుంగవఁ
జేరె నింతికిన్ చంద్రా 1 100

చ వెడనగ వంకురింపఁ బృథివీ నందనుఁడు
పల్కె సారంగ 2 64

2 తుచ్ఛము

క జడమతులైన జనంబుల, వెడమాటలు మానవు
నిదియ నెరవు నిర్వ 8 119.

క ఈ వెడమాయల నిప్పుడు, బో విడువవు ...
భార శాం 6. 184.

ఉ. . . ఆరిఁయొసపని లాగయి మీకుఁ దీవినఁ, గొండెటకై నఁ దక్కు వెడబుద్ధులఁ బోయిన నే నవశ్యముర్, దండన సేయుదున్ .. పరమ 2. 64.

క వెడ దెరువు లిచటఁ జెల్లవు, పుడమిపహాహా దొంగలానఁ బొడిచినఁ గోకల్, విడుతురె ... కళా 3. 204.

3. వికృతము.

క. వెడగోఁతల నెత్తురొలుకఁ, బడఁద్రోచినఁ వచ్చి కుక్క పదువు వెమకకున్, జడిసెఁ గబళింప నొల్లక ... భార. శాం. 3 508.

క. బుడబుడ నెత్తురు గ్రక్కుచు, వెడరూపము గాల్చి గ్రుడ్లు వెలికుఱుక ... భాగ. 3 701.

సీ. తొడగులు వదలి కుత్తుక వెండి మిక్కిలి వెడ రూపులై పడ్డ వీరభటులు .. జై భా 2 78.

4. వ్యర్థము, వట్టిది.

ఉ. అవల వచ్చు నాపదల కన్నిటఁ గోర్చి లతాంగిఁ గూర్చి కా,కి వెడమాటల వ్యర్థలఁ దెన్ని విధం బులఁ జూపి చెప్పినవ్ ... భార. విరా. 2. 78.

క. మీకును మీపతి యావతి, మాకును మా భర్త యాజ్ఞమన్నింప దగున్, వాకోవాక్యమ్ముల వెడ, వాకాట్లం బన్పుఱుబు వలవదు సేయన్ శివరా 4. 70.

చ. హృదయము లిచ్చుదుం గదియకే తఱచౌ వెడ కౌగిలింతలన్, గదిరెడు మేలు కార్యములఁ గల్గక మాటల యందె కల్గు పెన్నదురులు వట్టి కైతవ్యములు చాల ఘనంబయి ముందు వేస విన్, బొదలఁగ నిల్వకంపతుల పొందుల కార్యాల పొందు కైవడిన్. ఆము 2. 62.

5. అసత్యము, కల్ల.

సీ. వన్నె లుపచరించి కన్ను సన్నలుచేసి వెడ మాటలను బ్రేమ గడలు కొలిపి. ప్రబోధ 1. 75.

సీ వెడగ్రోవ మును జెప్పి వడివచ్చఁ దిరుగు నధ్వ గుల కొలఁది యపత్రపయు మరల ... ఆము 4 162.

ఉ అతని పాలికేఁగి వినయంబునఁ జాగిలి మ్రొక్కి దీవనా, న్వితయుఁ బోలె. గొంత వెడ దమ్ము జూపల బాష్పకణంబు లతి క్రొ, జాతముల వ్వెడలుచు టయు . పరమ 3 215

ఉ. ముంగిట నాడు పుత్రుఁ డతిమోదముతో ... చిలుగంతులతో వెడయేడుపుతోడ, డాయంగ.. ముద్దుమో, ముంగమియార ముద్దిడుట ముజ్జగ మేలుటగాక యుండునే. కవిక 1. 40

6. కృత్రిమము, తెచ్చిపెట్టుకొన్నది

క. అడలఁజంచి నెమ్మనంబున, వెడతెలివొడఁ గూర్చి .. నిర్వ. 8 131.

సీ. వెలవెలనై చాల వెడనవ్వు వహియించి మురి పెంబు దఱిగిన మోమువాని ... ఉ రా. 6. 205.

7. పిచ్చి.

క. కడతలఁపు లుడిగి సంధికి నొడఁబడు మిది లెస్స. . భార కర్ణ 3. 273

8 నిర్హేతుకము నిష్కారణము

క. ...కరుణారహిత, త్వమునఁ దొలు మేన వెత పగ, వమేయ వరవధము నేసినట్టి దురాత్ముల్. భార అను 5 109

9 వింత, ఆశ్చర్యము

ఉ దేవ! సురాధినాథ భవదీయ మనోజ్ఞమునంది వింతగా నీవిధిఁ జింలిలంగఁ గత మెయ్యది నేఁడు తపోనిమిత్త మెం,దే వెడవార్తగల్గెనో కవిక 6 49

క్రి. విశే. 1 అల్పముగా, కొంచముగా

క. చని వెడ వికసిల్లెడు నా,నన పద్మముతోడ .. భార విరా. 2. 320

సీ. వెడవాడు లీలారవిందయుగ్మము మాడ్కి సుదతి నీ కనుఁగవ సోలమందె . నిర్వ. 3. 86

సీ .. విరళమై పక్ష్మ ద్వితయంబు వెడజాఱ జంచులోకించుకాఱుంచితముగ . . నైష. 1 98

ఉ. . . చ, న్గ్రీవల జాఱు కొంగు సవరించుచు వీడిన కొప్పుఁ బల్మరుం, జేవెడ దోపుచుఁ బలికెఁ జెందొవ చూపులు క్రేళ్లు దాటఁగన్ పారి 4. 57

2 వదలుగా.

సీ చిటవ్రేలి పూసపై ఘటియిల్లు వెడపట్టుచిమ్ముఁ సురియ డాలుమ్మఁగముగ ... ఆము 7. 14

వి 1. ఇంచుక కాలము

చ అకరు నవాంబు ధారలు జటాటవిలోఁబడి విశ్రమించి వెల్వడి చను దెంచి రాలుగొని పక్ష్ములన్ వెడనిల్చి మోవిపైఁబడి .... కు. సం. 5. 767

2 చెఱకు (ఈ యర్థము మన్మథ ధనుస్సంబర్భమందే కనఁబడుచున్నది 'పుష్పము'' అని (బ్రౌ. ని)

క. వెడ తీ నపుడు వెడసిం, గాణిగొని యలరుఁ దూపు గమిఁ జక్కెర యే, బాణముగాఁ గలిగిన శం, బాణపు దొరపింజ పింజ గాడఁగ నేసెన్. విజ వి. 1 62 (128)

Phrase—(1) వెడ విలుకాఁడు = ఇక్షుధన్వుఁడు, మన్మథుడు.

చ. వెడవిలుకానికిం జెఱకు విల్లును గల్వలకోరి కోరికల్, గడలు కొనంగ నామనియుఁ గల్వల రాయఁడు నిచ్చి మన్ననం, బడయుడు వాని కెక్కుడుగ మౌర్వులు తాము గాన్కతెచ్చె నాఁబడిబడి గంధలుబ్ధ మధుపమ్ములు రాఁజను దెంచెఁ దెమ్మెరల్ విజ వి 1. 211.

చ వెడ విలుకాఁడు నెమ్మనము వేములుగేదఁగి తేకు వంకిడిం, బొడునఁగ మేను పానుపునఁ బొందక నిన్నళయ ప్రదానమే, నడిగెదనంచు రాఁ గలిగనమై యిటు వెన్నెలవేఁడి వెన్కొనన్, గొడుగుల నీడ వచ్చితిఁ జకోరవిలోచన యేమి చెప్పుదున్ రామా. 6. 146

(2) వెడవిలుతు(లు) డు = ఇక్షు ధన్వుఁడు, మన్మథుఁడు.

క వెడవిలుతు కీర్తిజాలము, వడుపునఁ జంద్రాతపంబు వాలుటయును . . ధా రా యు 88

క. వెడవిల్తుఁడలరు వింటను, గడువడి విరితూపు తేర్చి కదియింపుచు న, వ్వడఁతిన్ రాచందురునిన్, గుడియెడమల నేసియేసి కో యని యార్చెన్. యయా 5. 111.

(3) వెడవింటివాఁడు = ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

ఉ. ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్ష బాష్పకుల కోణకోణనుచు లగ్రమునం జనఁజూచు చూపు తీరై కమనట్టెం దమ్మఁ నను టు కొనన్ వెడవింటివాఁడు క్రోధైక ధురీణతం గఱచి యేసిన సింగిణి కోలయో యనన్ మనుచ 3. 90.

(3) వెడవింటిజోదు = మన్మథుఁడు

క. వడి వేఱవేఱ నిరసులు, గడఁగి బెడంగయిరి కుంతికాంచిన కొడుకుల్, వెడవింటి జోదు మొనడిఁ, గడిగిన శారాచ పంచకంబో యనఁ గన్. పాంచాలీ 4. 14

(5) వెడవింటిదొర = మన్మథుఁడు

సీ వెడవింటి దొర దాడివెడల నుత్సాహించుఁ జిలుకపైకములు విందులకుఁ దిరుగు. చంద్రా. 4. 141.

(6) వెడవింటిఱేఁడు = మన్మథుఁడు.

క వెడవింటి ఱేని సైనియుఁ, గడకంటనె యేలు కొనఁగఁ గలవెల నవలా, వడకింటిలోన వింతగు, కడకంటఁ జరింతె వన్నుఁగాదని యనలన్. ప్రభు. 1. 737

(7) వెడవింటిబోయ = ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు

తరళము పగలుమీఱఁగఁ గాంతకోటుల బాధ పెట్టుచు నుండు నీ, తొగతగుల్ వెడవింటి బోయకుఁ దోడువచ్చిన వాఁడపో . . విజ వి 3 64.

(8) వెడవింటి బలుదంట = మన్మథుఁడు.

సీ వెడవింటి బలుదంటఁ బొడచూపఁ గానీక . . నీలా 1 42

వెడఁగు విశ. 1 వివేకము లేనివాఁడు, వివేకము లేనిది.

ఆ. భ్రమ విమోహ లోభ భయ పరిభూతసై, కొడుకు విడువనంత వెడఁగ వయ్యె. భార ఆది 6 280.

క మది ధృతిలేని వెడంగుల, మతిఁగలఁచిన సుమతికిం బ్రమాదము వచ్చున్, మతిఁ గలఁచిన మతి మంతుఁడు, సితచ్ఛదోత్కరము చేతఁ జెడ్డవిధమునన్. కేయూర. 3. 75.

క ఓ వెఱ్ఱులార! యేటికి, నీ వెడఁగు విచారములు సహింపఁగ రాదా; యేవారికైన మేలా, చాపలతర్కితములుగ్ర సంగ్రామములన్. భీమ 4. 62.

ద్వి. గుడికేఁగి మీరింకఁ గొలువనేలనిన, వెడఁగు ప్రశ్నకు మీరు వినుడుత్తరంబు. బస పు. 6. 182. పా 332. పం.

2. వికృతము.

ద్వి నీరాడి ముడుక వన్నియ మూరకుటుచ, చీరలు వెడఁగు కుచ్చెలు వెట్టి కట్టి ... అ. మ క. 1. 23. పా. 26. పం.

వి 1. అవివేకము.

క. కార్యము తెలియఁగిట్టిది నీ. వార్యవరత ముకుకు జొచ్చి యాడెదు నీ కా, దుర్యోధను నవినయ మని, వార్యం బని యెఱుఁగరామి వలనో వెడఁగో భార ఉద్యో 1 318

క. కడు వనమునఁ గన్నతల్లి కైన గావల రామునిఁ గన్నతండ్రిగా, మదుగని బత్తితోఁ గొలుచు చుండెడు తమ్ముఁ వెడంగుఁ బాని కా, అడవుల తోపలం గఱకులాడిన దోసవుపంటయంతయుం, గుడిచితి వంచు నా మఱఁది కుట్టుకు నిక్క మొయ్యఁగఁ బల్కుమా. అచ్చ. రా. సుం 90.

2 వికారము.

క. అని పలుకు పొత్తు పలుకులు, విని పలుకక యున్న మనుజ విభు దెసఁ గోపిం,చిన తన మది వెడఁగుడుపుచు, వనిలసుతుం డిట్టులనియె నాతని తోడన్. భార. శాం 1. 114

వెడఁగుఁదనము వి (వెడఁగు+తనము) అవివేకముఁ

చ ... విచార విదూరుఁడు భీష్ముఁ డెంతయున్, వెడఁగుఁదనంబునం బనిచె వృద్ధుం బుద్ధులు నేర్చటింపవే భార. సభా. 2. 9.

వి ... ఒడికంపుఁ జేఁతల యొఱపెఱింగిన వింత వీడాటలు వనితల వెడఁగుఁదనము ... కావ్యా. 3. 41.

వెడఁగుపడు (వెడఁగు+పడు.) అ క్రి. 1 అవివేకము నొందు.

గీ. ... మేదుర మోహాంధకారమున వెడంగ పడఁడు సంసార విష్వంగ విధిఁ, బొందుఁ గాల క్రమమున పప్పురుషవరుఁడు. భార అశ్వ. 1. 196.

.. కలఁత నొందు.

సీ గీ... అడరి కోర్కులు చిట్టుముట్టాడ వెడఁగు పడిన యుల్లంబు పట్టునఁ బఱుఁవ దవకు, వశము గాకున్న నెంతయు వంతఁ బొందు ... భార విరా 2 292

3. జడత్వము నొందు, మ్రాన్పడు

క వెడఁగుపడి యచటఁ బెద్దయు, వడి నిలిచి తలం చుకొని యవశ్యంబును ని,వ్వు డితనిఁ దెగఁ జూడక చొ,ప్పుడునే యావిప్రవశికువు ప్రాణం బనుచున్ నిర్వ. 10. 78.

4 వికారము నొందు.

వ. కొమరారు దోశెప్పఁ ద్రాక్షతోడన్ దిరుగుడుల వెడంగువడి వడి దప్పునట్లు త్రాళ్ళంగట్టువడి పొట్టలదురగ నిక్కి పరిసెనంబులు వేయు వవి యఁను ... మనుచ. 4 28

వెడఁగుపఱుచు స క్రి వెడఁగు పడఁ జేయు, వికారము నొందించు

వ ... ఎండకాఁకును రేయింటి యలజడియు నప్పటి యాఁకలియు నొడళ్ళు డిల్లపడం జేసి వను మొగంబులు వెడంగు పఱిచినను బొలివోని పౌరుషంబుల నయ్యిరువాఁగును గడంగి కల యన్ బెరసి పెనంగి . . భార ద్రో 5. 286.

వెడఁగుపాటు వి (√వెడఁగుపడు) వెడఁగుపడుట, నిశ్చేష్టత నొందుట

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభాముని ముఖ్యుల రెట్టఁబట్టి యా,తలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్త దానవం,బులు గొని కూరుచుండిరి తపోధనులున్ సురలు న్వెడంగుపాటొలయఁగ గ్రుక్కు మిక్కు మనకుండి రొదుంగుచు నక్కడక్కడన్. ప్రభా 1 82

వెడఁగురుపడు అ క్రి (వెడఁగురు+పడు)మ్రాన్పడు, జడత్వము నొందు.

సీ ... మాకు నీపూన్కి నమ్మకమేము దీనికి నీతోడివారము నీవు దప్పి,యున్న వాఁడవు నిద్రయ ను లేక యున్నేని వెడఁగురుపడియెదీ యడవిలోన భార సౌ. 1 60

(వ్రాఁత ప్రతిపా 'ఎడగర' అపముద్రి)

చ. ఉడుగక కన్ను నీరఁ గడు నొపపఱి చాయలు చెడ్డ కన్నులున్, వెడఁగురు వడ్డమోముఁ బటు వేదవఁ గందిన యంతరంగమున్ ... హరి. పూ. 8 156.

ద్వి అక్కలి పఱపక యుఱగన్నుఁ గొనక వెక్కక వీఁగక వెడఁగురు వడక . పండితా దీ. 61 పొ.

**వెడఁద** విశే 1 విశాలము

క. వెడఁద యురంబును నమ్నున, కడుపును దృఢ కఠిన తనువు గల యాతనికిం, దడర ... భార ఆది 7 222.

సీ వేయి గుఱ్ఱములూఁగిన వెడఁద యరద, మర్థితో నెక్కి . హరి పూ. 4 85

గీ సిడము నడిమికి వెడఁ ద్రుంచె వెడంద, వాని దొడ్డతూపునఁ గురు సేన దొంగలింప . భార. భీష్మ. 2 49

ఉ విచ్చిన కమ్మదమ్ములకు విందులు పెట్టు వెడంద కన్నులున్ పాండు 4 49

2. స్థూలము.

గీ. పిఱుఁదుఁ బిక్కలుఁ జెక్కులు చెడఁగుఁ దొడలు, వెడఁద యొడలును జన్నులు వెంట్రుకలును, నంబులేకుండ బలియుట .. హంస. 3 183.

**వెడఁదమోముమెకము** వి పంచాస్యము, సింహము

సీ వెడఁదమోము మెకంబు నడవులఁడాగించి ... నీలా 1 42.

**వెడఁదవాతియమ్ము** వి (వెడఁద + వాయి + అమ్ము) బాణవిశేషము, విశాలమైన వాయిగల బాణము.

వ సురనదీసూనుండు వెరవుగల వనపాలకుఁడు తాళఫలంబులు దిగఁద్రోచు చందంబున మెఱుంగు లడరు వెడందవాతియమ్ముల నమ్మహీశుల తలలు త్రోల్ల నేయుచు . . భార భీష్మ. 8 63

ఆ. అన్ని వెడఁదవాతియమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి .... భార విరా. 5.146

**వెడఁబడు** = వెడలఁబడు అ. క్రి (వెడలన్. .పడు వృత్తి నివర్ణవికారము.) బయటఁబడు

ద్వి. కడుపులోనవె చచ్చి క్రచ్చుఱఁగ్రేవు, వెడల కున్నను చూలు వెడఁబడకున్న, మసలక వెడలంగ మందులువెట్టి, పసరంబు ప్రాణంబు వస నుగాఁ గాతు పవనాథ 1, 40, పొ 10, పం,

**వెడగఱపడు** అ క్రి. (వెడగఱ+పడు) జడత్వము నొందు, (లేక) కాంతిహీనమగు.

చ ఉడుగకకన్ను నీరఁ గడునొప్పటి చాయలు చెడ్డ కన్నులున్, వెడగఱ వడ్డమోముఁ బటువేదనఁ గందిన యంతరంగమున్ . . హరి పూ 8.155.

**వెడచఱుము** = వెఱచఱుము అ. క్రి. భయపడు.

క. ఎఱకల గాడ్పున నొగి వెడ, చఱువఁగ వడివిడి యతని శాతనఖములఁ, జుఱజుఱఁ జీరియు ముక్కునఁ, గఱచియు నొప్పించె ఖాఁడు గరుడలిసుతుఁడున్ భా. రా. యుద్ధ 1704

క వడి వెగని వాలములఁగొని, వెడచఱువంబఱచి దొంగ వీఁడు మనకు లోఁ,బడియె ననుమఁ బిడికిళ్లఁ, బడఁబొడిచిరి ... భా రా. యు. 203

లయవిభాతి వెడచఱువ మొత్తియును దడఁ బడఁగ నొత్తియును .. భాగ 10 ఉత్త 787

**వెడతపసి** వి. (వెడఁగు+ తపసి.) అవివేకతపస్వి.

గీ వెడతపసినాఁటి నెద గొడ్డు వీఁగి కన్న, రాము నెడఁబావు నతినిష్ఠురంపుఁ బలుకు, జిలుకు తన వంటి నెనుకంట చేతఁగాని, మఘమునాచిన్ని పోఁవదే మనుమవాఁడు చంపూరా 2. 63

**వెడతుఱు** వి. ఒకానొక చెట్టు (వృ వి) (చూ. వెడతుఱుపల్లి = వేణుతురుమిల్లి ) వి శా. శ. 1024. Ep Ind 5

**వెడదప్పు** దే వి స్వల్పదోషము

సీ బ్రాహ్మణ జనముల రాజులు పూజింతురటు గాన నేను విప్రార్చనంబు, నేయుదు విప్రుని చేతన యిల్లెతి వెడదప్పునన యొందు వెరవు వాకు, దురితంబు వాపంగ దొరకొనదు ... భార. అశ్వ 3 99.

**వెడదారి** వి. (వెడ+దారి) అపమార్గము

సీ జడదారి యొయ్యారి వెడదారితిరువో నడుగు నెత్తమ్మి దుమ్మిడియె నితఁడు ... బహు 4. 82

**వెడనగవు** వి మందహాసము.

క. . . మృదులకల భాషలఁ దళుక్కొత్తెడు వెడ నగవులతోఁ, జిత్తభవుం డార్వ నవలు చిమము నెపము నన్. మనుచ. 6. 80.

**వెదపాడు** అ. క్రి. బొత్తిగా పాడు.

సీ. వెదలించె నెవ్వాఁడు వెదపాడు బావిలోనూసర వెల్లియై యున్న నృగుని... అప్పక 4 341

**వెదపేరు** వి. తుచ్ఛపు పేరు.

చ. అని మునినాథచంద్రుఁడు దయారస ముప్పతిలంగఁ బల్కిన, న్విని యలివేణి తానిదియె వేళయిఁక న్మతి వీనిఁ దక్కఁగాఁ, బెనఁగక యున్న నన్ను వెదపేరునఁ బిల్తురు లోకులంతు... విప్ర. 3 74.

**వెదపోక** వి. తుచ్ఛమగు వడుపడి

ఉ. పొట్టలఁబ్రొవ్వి కొన్ని వెదపోకల నట్టెలుచేసి యిట్టటున్ గట్టిదులై నృపుల్ తెరువు గట్టిరె నారలఁ బొట్టుపొట్టుగాఁ, గొట్టక తూపులం గదువు కొట్టక ... చంద్రాంగ. 6. 65.

**వెదమబ్బు** వి. అల్పమేఘము.

సీ. అలరు వెల్లిరులేని వెదమబ్బులు హిమాద్రి లేని మంచులు వార్ధిలేని సుధలు ... వరపథూ. 5. 135.

**వెదము** వి. ఎదము.

సీ. వెదము వెట్టకరాని ప్రియుఁ గూరుపమని రంభ కిచ్ఛకమ్ములు పల్కి తెమ్మనిటుల... శ్రీరంగ 10 58.

**వెదయేడ్పు** దే. వి. కృత్రిమ రోదనము.

గీ. ఎదురుగాఁ బోయి వెదయేడ్పు లేడ్చువారి, తోడనిట్లని పలుకు మీ తోయజాక్షి ... దశకు. 5. 92.

**వెదలఁగొట్టు** (వెదలన్+కొట్టు.) స. క్రి. వెదలించు, పోవఁదఁచు.

ఉ. గొట్టుతవానఁ దన్ వెదలఁగొట్టిన దిట్టమ రట్టడంచుఁ బోఁ,బుట్టువనొట నొందనక పోయితి. ఉ. రా 2. 309

**వెదలఁబడు** అ. క్రి. (వెదలన్+పడు) స్వార్థమున పడు) 1 వెదలు, బయలుదేరు

క. మించిన పమలకు వేరము, లెంచం బనిలేదు సీత నొక్కటి పటులన్, గొంచు న్వెదలంబడి యే, తెంచితిగా చాల మస్థితిన్నిలు మింకన్. రామా. ". 68.

2. వెలుపలఁ బడు, ఉద్ధరింపఁబడు,

గీ. హా సరోజాక్ష గోత్ర దుఃఖార్ణవమున, మునిఁగి యున్నాఁడఁ జేయూఱ్చ కొనఁగ లేక, నీ కృపాదృష్టి వేరొడగాక యున్న, వెడలఁ బడు టెట్లు ముఖము గావించుటెట్లు. జై. భా. 1 106.

**వెదలబాఁటు** వి (√ వెదలఁ బడు) వెదలఁబడుట.

చ. భువన భయంకరంబులగు వోరులఁ దమ్ములతోడఁ గూడ నీ,వు వెదలఁబాటు లెస్సయల వుంజలను న్వెలయించు చోట ధ,ర్మవున కొకింతయుం దొలఁగఁ ద్రొక్కమి యెంతయు మేలు... భార. శాం. 1. 4

**వెదలఁబాఱు** అ. క్రి. (వెదలన్+పాఱు) వెదలు

సీ. అడ్డకట్టఁగ నీక యల కేకరాతులు వెదల లజ పొరఁజించి వెదలఁబాఱె .. చంద్రా 5 27

**వెదలఁబెట్టు** స. క్రి. (వెదలన్+పెట్టు) వెదలఁజేయు, వెలిపుచ్చు.

సీ. తోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు వెదవెద నాలుక వెదలఁబెట్టు ... భాగ 10. ఉ 544.

**వెదలఁబోసికొను** స. క్రి. చెప్పుకొను, ప్రకటించుకొను.

చ. వెత వెదలంగఁబోసికొన వేఱొక నచ్చెలిఁగాన మిన్ దిశా,పతులకు నంతయుం దెలియఁ జాటుటకై గమకించునో సుమీ, యతివయవన్. రామా 6 132

**వెదలనాడు** స. క్రి. (వెదలన్+ఆడు) 1. వెల్లడి చేయు, తిఁబుచ్చు

క. నీ యంగన కపటా చా,రాయత్తము మాకు వెదలనాడుట తగదే, మీ యున్న రాత్రులంద త,దీయ వ్యాపార మేము తెలిసితి మెల్లన్. కేయూర. 3 231

2. తూలఁ బలుకు, ప్రేలు

ద్వి. విను మీఁదెఱుంగక వెదల నాడెదవు .. బస వు. 4. 50 పం

**వెదలించు** స. క్రి. (√ వెదలు) 1 పాయఁజేయు, తొలఁగించు

క. వడవడ వడఁకుచుఁ గ్రమ్మఱ, నడుగులపై వ్రాలి యో మహామతి యే నెక్కడఁ గర్మశేషమెక్కడ, వెడలింపఁగదయ్య దురిత విష విధి వలనన్ భోజరా 3. 87

గీ .. గంధవహుఁడు, సతుల వయ్యెద వెడలించి చన్నుగవకుఁ, దప్పునేసియు దైత్యు చిత్తంబు వడసి హరి 3 4.

చ. పొలుపుగ గొల్ల క్రొందలిరు బోఁడుల కుల్కుమిటారి గబ్బి గుబ్బలు బలుపెన్న ముద్దలని భావమునందల పోసిచూసి కంచెల వెడలించి మాటికిని జేతుల నొక్కుచు హాంతకారియై, యలఁతిగ నవ్వు పెన్నుఁడు దయామతి మాకు బ్రసన్నుఁ డయ్యెడున్. రసి. 1 8.

2 వెడలఁ జేయు, పైకి రావించు.

క. దయ్యాఁ దిరిగించి దేవుఁ, డొయ్యన వెడలించె నోరి యూర్పున నమ్మె, నయ్యమి వర్యుఁడు వెలువడి, యియ్యనఁ గనుఁ గొనియెఁ దొంటి యేకార్ణవమున్. హరి ఉ 9. 109

గీ కుంభసంభవుఁ డబ్ధితోఁ గూడఁ గ్రోలి, తజ్జలముతోడ వెడలింపఁ దలఁపఁడేని ... శృ నై. 2. 123.

ద్వి ఎడనెడ బొక్కలనిడిన బాలకుల, వెడలించి భక్షించు బేతాళతతులు ... హరిశ్చ. ఉత్త. 1630.

3. వీడఁజేయు; విడుమనట్లు చేయు

గీ. ... ఎల్లతెలఁగు వనులు నారాత్రిలోఁ దీర్చి ప్రొద్దు, పొడుపునకు మున్న వెడలించెఁ బురము సకల, జనములను జీవధనముల నరకు వతఁడు. భార. మౌస. 174

4. వెడలఁగొట్టు.

మ ... ధనగుప్తుం డొవరింపఁ బూనిన మహాధార్త్యంబు సర్వరబుఁ గాంచి నిశ్చెం జను మంచుఁ గంచి వెడలించెం గిన్కతో వల్లునిన్ విక్ర. 7. 180.

5. ప్రవహింపఁ జేయు

గీ. వెన్నెలరముబ్బి వెడలించె దీర్ఘికా మంద సౌగంధిక మధునదంబు.... మను చ. 6. 29

**వెడలిచేను** అ. క్రి. (వెడలు+చను) వెడలి పోవు.

క. పెద్దపులి వెడలిచనె నని... దశా 4 40.

**వెడలు** అ క్రి 1 బయలుదేఱు. (రూ వెలలు.)

క. వేగుటయు సత్వరంబుగ, నా గాంగేయుండు మించి యనికి నడచినన్ సాగర తరంగములు గతి, వేగము తరతరము మొదలు వెడలఁ దొడంగెన్ భార. భీష్మ. 2. 167.

సీ ... దైవ సైన్యంబు తిరితిఁ దరతరంబ, వెడలి మొనలేర్పరించి యుద్యోత్వప్రవృత్తి పారి 5. 2.

తే. వలయు నవరణతోడ భూ వల్లభుండు, వెడలె వేఁటకు మృగయా ప్రవీణులైన, శబర నాయకులుభయపార్శ్వములఁ గొలువ .. విక్ర 2 131.

2 బైటవచ్చు.

ఆ ... మూఁకలెల్ల జుట్టుముట్టినపుడు, వెడలువట్టి వెరవు వినరానికేమి నా,చొచ్చు నేర్పు బలువుఁ జూడు మధిప భార. ద్రోణ. 2 5

గీ దేవదేవ రక్షింపవె దివ్యమూర్తి, యనుచుఁ బలుకు నవ్విప్రుని యార్తభంగి, చూచునప్పుడు మురవైరి చూడ్కి-కేల, వెడలె నాకునుఁ గన్నీరు వేయునేల. ఉ హరి. 2 9

తే. అబ్ధితోఁ గూడ మునుగ్రోలు నౌర్వవహ్ని, యుదరబిలమున నొకచోట నుండియుండి, జటల వరునకుఁ గద్రూజ కటకకటక. విరహతాప విషంబున వెడలినపుడు పాంచు. 1. 121

3 వెళ్లు, కడచు

తే. తపము గావింప వెడలె వత్సర సహస్రములు మహాదేవుఁ డంత నా భూమిధరకు, మారి గౌరి ననుగ్రహింపంగఁ దలచి. వరాహ. 6.16.

క. చావుఁ దలపోసి మానవుఁ, దేవగ దుష్కీర్తి వారయకే దినములు పొంచై వెడలునట్లు నడవఁగ, దైవంబామీఁద మేలుతావ ఘటించున్. మనుచ. 4. 107

తే ... పాండు బహుళతపా పరంపరలువెడల, కిండితో నేఁదు ముల్లయ్యె నిందుముఖి. ఆము. 5. 84.

4 సంచరించు, ప్రయాణముచేయు.

చ ఎడపక మున్ను మింటిపయి నే తగులంబును లేక మూకతన్, వెడలెడుచో ... ఆము. 4.85

5. వ్యాపించు.

తే. మెదలు దునిమిన మీఁదికి వెదలు రుధిర, ధారలు మదాంధ పరిపంథి వీరభటక బంధములు నిర్చెఁ జెక్కులు వగలు బిరుదు, బంట్లు పట్టించు కొను దివ్వె పోఁజు లనఁగ. వరాహ. 5. 29.

సీ. ... తే వెదలు పేరెండకును శరద్వృతముడిగి, వార్షికమె యొక్క ... ఆము. 4. 181

చ. అడఁకువ మీకు నేమి యిడ నతయమౌనను టన్నిజంబుగాఁ, గొడిదెఁడు దానతోయ మదుగుం దిగ దమ్ములు ముజ్జగంబులన్, వెదలు కోలం తియై సుగుణ విక్రమ హంస పరాగయుక్తిచేఁ, గడలు కొనంగఁజేయు నల కైతవ వామను నిన్ను నెన్నెదన్ చంద్రాంగ. 1. 78.

6. తొలఁగు.

క. ... మనమున వాటిన మాటలు, వినుమెన్ని యుపాయములను వెదలునె యధిపా. భార ఉద్యో. 2. 62.

సీ. ఏమార్గమునఁ జేసి యీ దుష్టసంసార దుఃఖంబు వెదలు .... వాసిష్ఠ. 1. 171.

7. తోపు, వశించు

గీ. విష్ణుమూర్తులు కడ చన్న వేళలందు, నజుని మూర్తులు విబుధులు వెదలు నపుడు, కలదె నీకు నపాయంబు కాలకంఠ ... శివరా 1 1053.

వ. క్రి. దాఁటు, లంఘించు అతిక్రమించు

ఆ. మదవి ఒకట జలధి వెదలి నన్నపుఁగ్రయ్య, మునిఁగి రూపడంగు ననలమాడ్కి ... భార. శా ప్రి. 2. 17.

సీ. గ్రహరాజు వాజెదు ఘంటాపథముదాఁటి చుక్కలు వొడకెంచు చక్కి వెదలి ... శృ. నై. 7 87.

వి. బయలు.

ద్వి. వడలి కాళ్ళును జల్లిపగ్గంబు గట్టి, వెదలికి నీడ్చెంచెఁ దొడఁగి కాచిరువ, కులపతి యని యెదు కూరిమితేక ... పండితా. పురా. 96 పొ.

వెదలుచే(లుచు) స క్రి. (√వెదలు.) వెదలఁజేయు.

చ. అడలున నెంతయు న్గలఁగి యగ్గలికం గుడిచేయి సాఁచి మై, వడఁకెడు కొమ్మ కేలు చెలువంబుగఁ బట్టి యయాతిమాతిలో, వెదలిచి యప్పుడమ్మగువ వేనలికన్నులు మోము చెక్కులున్, మెద చనుదోయి నెన్నడుము మేను పిఱుందునుగాంచి వేడుకన్. యయా. 3. 451.

క. వికసించు తమ్మినుండు మధుకరావళి వెదలి వెలుఁగు దొరగనఁ గాసారకలావఁతుఁడు మునుగొంచక క్రింగి వెదల్చు నిమిష కురిపెణ మనఁగన్ రా వి 3. 11

సీ కుబుసంబు విడిచిన కొదమ నాగము రేవదొన వెదల్చిన పువ్వుఁదూపు సరణి ... పరమ. 2 31.

వెదలుపు(లుపు) వి. వైశాల్యము

చ వెదలుపు గల్గు నోరులోన వేయి ధరించి వియన్నదీ జలం, బడరఁగఁ బుక్కిలించి రయమారఁగఁ దెచ్చి మహానలంబుపై, వెదపడకుండఁ జల్లనది ... హరి. ఉ. 8 72.

క ఆమడ నర వెదలుపు మూఁడామడ నిడివియును గలిగి యతి రమ్యంబై, రామ ఘటకర్ణు పటు నిద్రామందిర మలరు మృదులతలను తతులతోన్ ఉ. రా 2. 293.

వ. అదియును నూఱుయోజనంబుల వెఁదల్పు నూటయేఁబది యోజనంబుల నిడుపును ... భార సభా 1. 62

సీ. రేఖలేర్పడఁగ వర్ధిలి వెదల్పయి రెమ్మ పసరు వాఱుచు నిక్కఁ బసరుకప్పు ... మనుచ. 6. 27.

సీ కంఠహారము దాఁగి గంగడో లుదయించె వెదలుపు నిడుపునై మెడ బొసంగె... కకు. 4. 159.

వెదవాదము వి, వి, వ్యర్థవాదము.

మ గదు సొక్కాక్కఁడు నిత్య దూష్యలనుచున్ గంజాతులన్ రోయ నీ. వెదవాదంబుల కేమి కామదికి భావింపన్ సతిం బోల న్పిప్పుడ మిం గామిత వస్తువుల్ బరహితంబుంబోలు పుణ్యంబులే, దదరన్ ... మల్ల భూ. 2 35.

వెదవెద విశే. అతి సూక్ష్మము; అత్యల్పము, మిక్కిలి చిన్నది (ఇది "వెద" యొక్క ఆమ్రేడిత రూపము.)

సీ. వెదవెద నూఁగారి వింతయై యేర్పడు దేరని వళులతో నారు నిగుడ ... భార విరా 1 245.

చ. వెదవెద కొఁద లీడగునె వెంకట భర్త వసించు కొండకున్ మద. 5. 64

సీ. కుంభి కుంభముఁబోలు కుచకుంభ భరమున వెడవెడ నడుములు వీఁగియాడ .. వీ. 3 155

క్రి విశే 1 చిక్కిలి యల్పముగా, కొంచము కొంచముగా. (ఇది ప్రయోగములందు ద్రుత ప్రకృతికముగాను, కళగాను గూడఁ గనఁబట్టు చున్నది. నిర్ధారక ప్రయోగము కనఁబడలేదు. కాని కళయని శ ర)

సీ అరట నుపకరంబావళి వెడవెడ యాదరించుట రాగ మదరఁ దొడరి .. ఛార విరా. 2. 278

ద్వి. వెడవెడఁ దన కచ్చ పిడంగఁ జాటి, వడి మోము వగులఁగ వాటంబు దాఁక ... ద్వి. హరిశ్చ ఉత్త. 1108.

వ ... మునివర్యులకు నృపవర్యుండు నమస్క రించి వీడ్కొని విడిదలకు నరిగి మజ్జనాది కృత్యంబులు వెడవెడం దీర్చి శకుంతలావ లోకంబునకు లోకలోచనుం గనుంగొను నప్పుడు పి శకుం. 3. 146

చ వెడ వెడయేనుఁ దొల్లి యిది వింటి ననుంగని కుంతి యెంతయుం, జెడవది వైచిపోయె ... భార. ఉద్యో 4 88

2. బిగ్గఱగా.

వ. ... ధనుర్వేదయ నిష్ఠ్యూతంబులగు శరవ్రాతం బులు వెడవెడ వార్చుచు పగఱ మొగంబులఁ బ్రవేశించి పెడతల వెడలుచు . కళా. 8. 110.

గీ. అనుచు వాలోయ కరశరాసన కఠోర, గుణ నిరావప్రతిధ్వని కుధర గుహల, వెడల వెడ వెడ వార్చుచుఁ బిడుగు తునక, వంటి నారాచ మున నదరంట నేయ వరాహ. 7 60.

చ, వెడవెడ వార్చుచున్ దిశలు బీటలువాఱనదల్చి రుద్రుపై, వడచిన నమ్మహారథుఁడు నవ్వుచు భూతపిశాచ కోటిఁ జూచుచుఁ జని వేయఁ జొచ్చె ... వరాహ. 5. 112

3. మిక్కిలి వికారముగా.

సీ. తోఁక మూఁకమేను సోఁకఁగ నులిపెట్టు వెడ వెడవెడ నాలుక వెడలఁ బెట్టు భాగ. 10. ఉ 544.

4. తలచుగా.

క వెడవెడఁ బొడమెడి యూరుపు, లుడుములు తుడుములుగ వెడలదొడవులు పడలన్, ముడి బోము జంకెన చూపులఁ, బడఁతుల వదరించి కోప పరవశయగుచున్ చంద్రా 2 146.

5 అశ్రద్ధగా

క. వెడవెడ యపఎలుకులు చెవి,నిడి కొండొక సేవ చింత యొసకరంబున పాలపడి యూరకుండి... భార. శాం. 1 56.

ఆ మగడు చన్న దెసకు మనసును జనియున్నఁ, జెయ్వు వెలఁగు పడినఁ జెవులు సొరని, వృద్ధ వనిత కథలు వెడవెడ నూఁకొంచు, నుండె వగల నొగిలి యుత్పలాక్షి. విక్ర 6. 118.

6. మృదువుగా

గీ. .. వేగ వెడవెడ తడియొత్తి....ఆము 5. 89.

7 అధికముగా.

గీ. మస్తకము వాంచి యుసురని మౌనముద్ర, నేల బొటనవ్రేల వ్రాయుచు నిలిచి కొంత, సేపు వెడవెడ చింతించి శిర సొకింత, యెత్తి సన్నంపు బెలుఁగుతో నిట్టులనియె. మనుచ 3 97.

8 మెల్ల మెల్లగా.

సీ బిడిబిడిఁ గమ్మ పుప్పొడి నిప్పుకలు చల్లి వెడ వెడగా గాలి నుడిసెనేని... రాజ చ 3 80

చ వెడవెడఁ గన్నుమూయుఁ బలవించుఁ గనుంగవ విచ్చు ... యయా 5 118.

సీ ... పచ్చరా కట్నంబు వచ్చిక పట్టని వెడవెడ మునివ్రేళ్ల నడఁచిపోవు . దశా. 1. 272

9. దృఢముగా, గట్టిగా

క. .. ప్లవంగుని మెడఁగడు, వెడవెడ బిగియించె గ్రుడ్లు వెలికుఱుకంగన్. భాగ. 10 ఉ 556.

వెడ్డరి విశే (వెడ్డు+అరి[3]) వంచకులాలు.

ద్వి పాపజాతులు విసపకులు వెడ్డరులు, మాటల మ్రుచ్చులు మందులమార్లు ... పండితా.పురా. 116. పా.

వెడ్డు విశే కపటముతోఁ గూడినది.

ఆ. పాటిపోయి వచ్చి బడిపొచ్చి యీ వెడ్డు, నిద్ర వోవఁ గృష్ణ నీకుఁ దగునె . వచ్చ 9. 272.

('అ. పాఱిపోయివచ్చి వడనొచ్చి యీగుహ' అని చి. వి. పా.)

ద్వి. వెద్దుమాటలకాని వేలుఎలకన్న, దొడ్డవాఁడవుర ఖాదూఁకలిఁదీరు ... ద్వి. క. పా. 1. ఆ. 30 పా. 1. వం.

వి. వంచన.

సీ. ముమ్మేనుపాలితుధనము వెద్దునఁ గొన్న తరు ణిమేడెప్పెట్టెదు వెరవు గొఱలి ..దశకు. 5 88.

వెద్దుకొలుపు స. క్రి. పీడించు.

సీ. అతిమాత్ర మాయాన మనుభవించును గాక విటజనంబుల వేల వెద్దుకొలిపె ... క్రీడా 287.

వెద్దు(పె)వెట్టు స. క్రి. (వెద్దు+పెట్టు) వంచించు.

చ. అనవుఁడు మున్న యిట్టులనవై తిరి వోవఁగ నీను మిమ్ముఁ గొం,దును గడువెద్దువెట్టితి ..భార శా. 6. 301.

క. ధనముగ్గలదు పుత్త్రులు లేరని యాసంజాపి యొరుని యాత్మజుఁ దానే,రుపన వెద్దువెట్టితగఁ లే,కొనె నేనియుఁ గృత్రిమంపుఁ గొడు కాతని కిన్. విజ్ఞా. ఆచా. కాం. 152.

తే. ఇట్టిగతిఁ జెల్వ మము వెద్దువెట్టునొక్కొ, పెట్ట దరి దా నృజించిన బిడ్డగాన, కొంకగుచు వంత కదియ క్రోవు వడు నొక్కొ, పదదఱఁడు చెప్పెనని వినఁబడియెఁ గాన ప్రభా. 8 10

వెఱఁద=వెడఁద విణ. విశాలము.

వ... అనంగ ధ్వజ పట కఠోర పాఠీనచ్ఛాయా చాయాదంబులై న వెఱఁద కన్నులు తలచుట్టు ముం బలిసి పొలయ ... భీమ. 2. 110.

ఉ. నంద సుతుం గనుంగొని వెఱంద కనుంగ వనించె కామవముల్ ... శృంగార రసాల వాలము. 2. (శ. ర.)

వెఱుతురు=వెలుతురు వి. కరీరము, క్రకరము. (వృ. వి.)

సీ. కోరింద వలతుమ్మ గొటికె కోడారెయు వెఱుతు రూడంగ దంతి వెత్రినిమ్మ ... హంస. 4. 9.

సీ. వెఱుతు రవంగము కెలయుఁగరీరంబు ... ఆం. భా. 2. 58.

వెన్నాఁడు అ క్రి. (వెన్ను²+ఆడు.) వెంబడించు, వెంటనంటు.

సీ పదములు దొట్రిలఁ బరువులెత్తెడివారి వనుకర్త వృత్తి వెన్నాడి చనదు ... వసు. 1. 56.

సీ. వెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకును భృగురక్త ముఖ నుబ్బు పెన్నసాకి ... రామ. 259

మ .. మాయావి యన్వాడు . . పాతాళము సొచ్చినన్ విడువకాశాఖా మృగ ధీశుఁడాతని వెన్నాడి వనున్ రసాతల బిలద్వారస్థితుం జేయు చున్ ... చం. రా. 6 23.

వెన్నిచ్చు అ క్రి (వెన్ను²+ఇచ్చు) 1. వెనుదీయు, వెనుకకు మఱలు.

మ. నరుఁ డాభీల పరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి విచ్చి,రి వార దఱు దివ్య సంఘము నుతించం ... భార. కర్ణ. 3. 313.

2. (యుద్ధరంగమునుండి) పాఱిపోవు.

సీ. వెన్నీక రణములో విగతాసుఁ గువారు వివి ధాధ్వరములు గావించువారు ... వరాహ. 10. 113.

సీ ఇలఁగు భృత్యులకు వెన్నీని కూర్మిపతులు గోత్ర వర్గము బలిమిఁ గూల్పు విం(ద్రులు ... బిల్హ. 1. 30.

క దగగొట్టి కలనఁబెట్టిన, మగఁటిమి వెన్నిచ్చి పాఱు మాళవ నృపతిన్, మగధపతి యట్టి తఱి నా,కుగతిన్ వెన్నాడి కోటఁజొరఁదోలి వడిన్ శా. వి 5. 16.

3. వెనుక దిరిగి పాఱు.

సీ. ... పగఱకు వెన్నిచ్చి పఱవక సంగర క్షోణిఁ గూలిన మహోశూరులకును ... దశా. 4. 95.

వెన్ను¹=వెను వి అవా. 1. వీపు, పృష్ఠభాగము. (రతిదేవి)

గీ. మొఱని క్రొవ్వేడి వెంటపై నెఱసిపొలయ, నడలు దరికొని వావిరి నఱచుచుండె ... కు. సం. 5. 565.

వ. మనుజపతి యనుజులుం దానును వెన్నయ్యె. విందానువిందులుం గాంభోజుండును, శూర సేనుండును బుచ్చుంబై రి ... భార. భీష్మ 2.96.

వి. పృష్ఠభాగము.

గీ ఉట్టిపడి మ్రొక్కె గతిఁదెల్ప మరగప్రైరి, వెన్ను వెన్ననఁగొని విన్నువీథి కెగసె ... జహ్న.3 4.

సీ జరఠ కచ్ఛప కులేశ్వరు వెన్నుగానరా జగతికి మిన్నేఁటు దిగినచోటు . . మనుచ 2. 7.

వి. 2 ఇంటినడి కొప్పు

వ. . . పాడిల్లునుం బోలె వెన్నొఱగి ... కవిక 4 113

**వెన్ను²=ఎన్ను** వి వరి మొదలగువాని యెన్ను. కణిశము

ఆ ఉత్తముని కడుపున నోగు జన్మించిన వాఁడు చెఱుచు వాని వంశమెల్ల, చెఱకు వెన్నుపుట్టి చెఱుపదా తీపెల్ల ... వేమ 2 ఛా 2.

గీ. కలమ గర్భంబులా మహోత్పల దళాళి, పిక్కలకు నోడి తద్దయుఁ బిఁకెపాటి, వెన్నుచూపి తృణంబూని యెన్నరాని ... రసిక. 2 101.

**వెన్నుఁడు** వి (సం విష్ణువు) విష్ణుదేవుఁడు, కృష్ణుఁడు.

క. వరనాథ సమర్పిత మగు, విరవాదుల తండ యొప్పె వెన్నుని పాదాం, బురుహాంబున నంగుటమున, సురలిప యాకాశగంగ కుప మానంబై . . నైష 3 115.

గీ వెన్నునకు నస్మదాదుల మెన్నడైన, నపకృతి యొనర్పము ఉ. రా 2 28.

ఉ వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు తోడఁ బోవన్న కుమార యిట్ల యిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు . భార. ఉద్యో 3 348.

క వెన్నుఁడు నవ్విభు దవ్వుల, గన్గొంతవ నిజ సమాధి కవితాసనమున్, గ్రన్నన విడిచి యెదురు నని, సన్నత మౌళియయి భక్తిసంభరిత గతిన్. హరి. ఉ 6. 32

విన్నవాఁకఁ బలుకు వెలఁదిఁ బుడుకు, కొడుకు రిక్కతేని నొడలి చూపాడయని ... రామ 197

**వెన్నుఁగాడి** వి (వెన్ను+గాడి) వెన్నెల, ఇంటి నడుకొప్పు మ్రాను (శ ర పా)

**వెన్నుగుదియ** వి (వెన్ను+గుదియ) వీపుపై కొట్టుట కుపయోగించు కఱ్ఱ

తే గీ మందులాడి చెడుగు మానిసి భూతంబు, పిసిఁడి బిచ్చగాండ్ల వెన్ను గుదియ ... చెన్న. 2 24

**వెన్నుచూచు** స క్రి (వెన్ను+చూచు) పాఱఁదోలు.

వ నిర్జరులం దర్శించి, కిన్నరుల వెన్నుచూచి. హరి, 8 9

**వెన్నుచూ(సూ)పు** అ క్రి. (వెన్ను+చూపు) వెన్నిచ్చి వెనుక మఱలు.

సీ మురియ వైవగవచ్చు మొన దారపించిన శూరత్వమున వెన్ను చూపఁ డనుచు ... పాండు. 1 63

గీ కలమ గర్భంబు లా మహోత్పల దళాళి, పిక్కలకు నోడి తద్దయుఁ బిఁకెపాటి, వెన్ను చూపి తృణంబూని యెన్నరాని, నావఁదల వంచుచుండె వనాంతరంబు రసిక 1 101.

(వెనుఁగవఁ బఱచు అనియర్థాంతరము)

సీ చనునె శత్రువుల వెంట మునుదాన తగిలి యావ్వీరులు నెగువంగ వెన్ను మాపి, పఱచుట ... హరి ఉ 2 3.

పంచచామరము అలంతులయ్య కూర్మ మత్త కాదు లైన భోదుల, బ్బలారి వెన్నుసూపి పార పాచినాఁడ కాని నేఁ, డలంఘ్య బాహుశక్తిఁ దావకాజిలోన నుండుఁ బి,చ్చలించి తెల్పెఁ దత్కథల్ వచః ప్రయోగ చాతురిన్. కకు. 2. 126.

**వెన్నుదన్ను=వెనుదన్ను** స క్రి (వెన్ను+తన్ను)

1. వెంబడించు, అనుసరించు

సీ. చిన్ని వెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టు మాకు ..,మనుచ. 2. 43.

చ మొదలు గలంగినం గని సముద్ధత వ త్తినదల్చి వెన్నుద,న్ని నిలిచె దానవేశ్వరుఁడు ... నిర్వ 3 13

మ గడఘోఁటు వ్వెనుదన్ని నిల్వ విలుమ్రోఁక న్వెంబడిన్ గాఁవుగా నడవన్...చంద్రా 6 78

ఉ. ఆ హరి వెన్నుదన్ని కుసుమాయుధ సాత్యకి సాంబ సారణుల్, బాహుబలంబు మీఱఁగఁ గృపాణ శరాసన సాయకాది సన్నాహము తోడ నిల్చి . . చిత్రభా 8. 12

సీ ధారాధరము వెన్నుదన్ని పుట్టిన చాయనున్నదీ బింబాధరోష్ఠి వేణి ... విజ వి 2 106

(ఇట ఔపమ్య ద్యోతకము)

2. తిరస్కరించు

వ. సెన్నడుముల విమ్న వెన్నుదన్ని ... మనుచ. 5 101.

అ. క్రి వెనుక నిలుచు.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణ సుతుం డును కర్ణుఁడున్ బకు,త్రాణ పరాయణత్వమున దర్పసముజ్వల భంగి నుల్ల స,ద్బాణ పరంపరల్ గురియఁ బార్థివుఁడున్ వెనుదన్ని చూడ న,క్షీణ బవంబునంగవియు సేనకు మార్కొన వగ్గ లించితే. భా విరా. 5. 278

వ. ... వెన్నుదన్ని చూచు నవసరంబున ... ఉ హరి 3. 26. (శ ర త్రౌ)

వెన్నునడుగు విష్ణుపదము, ఆకాశము

గీ .. జక్కవలు వెన్ను, నడుగు వట్టుక మొటి పేయఁ దొడఁగె నవుడు. అచ్చ రా అయో 15

వెన్నువిఱుగు అ క్రి ధైర్యము కోల్పోవు

వ ఇట్లు జంభాసురుండు ... పడినం దానికుండు వెన్ను విఱిగి పడి నిశ్చేష్టితుండై యున్న ... కుమా సం 12 857.

వెన్నువమ్మెట వెన్నుపైని కొట్టుట కుపయోగించు నమ్మెట.

చ మద మొదవంగ మూపక కుమార సమూ హము వెన్నునమ్మెటై, మొదవిన వాల మార్పుచు ... శోజరా 4 20.

వెన్నున(చే)ఱచు స క్రి (వెన్ను+చఱచు) వెంబ డించి తఱుము. (అమారు వర్ణనము.)

సీ జంకించి పర పృథగ్జన కోటి చందానఁ గఱకు జీకటి వెన్ను సఱచు వాఁడు ... కాశీ 3 234.

వెన్నుసొచ్చు స క్రి. (వెన్ను+చొచ్చు) వెనుక జేరు, శరణొందు

సీ. విప్రులఁ జుట్టల వెన్నుసొచ్చి యట్టివారిని గొలి చిన వారిఁ బ్రజల, హర్షంబుతోఁ గాచి యన్యాయ ముడుపుచు . ద్వా 7

వెన్నెక్కు అ క్రి (వెన్ను+ఎక్కు) గర్వించు

ద్వి నిమ్న నీ వెఱఁగక వెన్నెక్కి క్రొవ్వి కన్నులఁ గానక కఱకంఠ మూర్తి, నొడలు గల్గఁ జూచి యెరువిగాఁ జూచి ... పండితా. పురా 95.

వెన్నెముక వి (వెన్ను+ఎముక) వీపు నడిమి యెముక (శ. ర పా)

వెన్నెల1 వి (వెల్ల+నెల) 1 చంద్రిక. (చందు రుని) తెల్లని కాంతి

చ. . చందురు మనుపోగ వెన్నెలలతోఁ దులఁ దూఁగెదు తద్గుణంబులన్ నైష 1 50

చ. వలిమల యల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగు త్తి వేల్పు,ల గమిజీవగఱ్ఱ యుడివోవని చల్వల పెంకి వెన్నెలల్, మొలచిన పాదు .. పారి. పీఠి. 6

2 వెన్నెల వంటి కాంతి

ఉ .. నా సఖ, న్ని కనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే. ఉ హరి. 1 62

సీ. పిడెంపు బలుకెంపు విరిసి వెన్నెలగాయ వరిగింజ నొకటఁ బల్వరుస . ఆము 1 60

3 ఒక విధమైన యాట.

ఉ. అల చిమ్మన చీఁకటి చూట మొట్టియా వె,న్నెల లాట మెట్టినటు విన్నలమెన్ మును మున్ని లాసలిన్ .. ముకుంద 3 53.

వెన్నెలకందు = లేతచందురుఁడు.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడ మిన చెలువ తోఁబుట్టుమాకు . . మను 2.43

వ్యావ అడవిగాయు వెన్నెల నిష్ఫలము

క అతివల హృదయము లాఁ సి, రతికలన న్దేల్పలేని రట్టడిరూపున్, జతురతయు జవ్వనంబును, వితి యచుమీ యడవిఁ గాయు వెన్నెల రీతిన్. కళాం 3 73.

ఇక్లే కానఁగాచిన వెన్నెల

వెన్నెల² వి పక్షివిశేషము, పందనభేదము

సీ జోహారు నీకు మంజులకీర రుకాక చిన్నివెన్నెల నీకు జిత్తజన్మ .. ఇందు 3 87

వ. శ్వేతగిరి యందలి సింహాలోచమునకు వెన్నెల ధర్మపురియందలి యోగానందునకుఁ గొల్వు మ్రొక్కి . ప్రబంధ 1. 660.

వెన్నెలకుప్పలు వి బాల్యక్రీడావిశేషము

సీ దాఁగిలి ముచ్చులాటలు గచ్చకాయలు వెన్నెల కుప్పలు తన్ను బిల్ల . కాశీ 3 33.

తే గీ అసపుఁ గప్పుగవుం గుప్పలవనినుంతుఁ, గూర్మి నను పేర్మి వెన్నెల కుప్పలాడు . . కా వి 2 23

సీ రమణీయగతిఁ జకోరి కుమారికలు గుంపు గొని యాడు వెన్నెల కుప్పలనఁగ ... పి. శకుం. 2 183

వెన్నెలకూన వి బాలికా క్రీడావిశేషాలు

సీ చేతుల కణఁగవీ చెలువ చెక్కు లటంచు వెన్నెల కూనకు నన్ను బిలరు . పార్వ 2. 21

వెన్నెలకోలు వి నమస్కారము, వందనము.

రగడ విష్ణుపుర బున విలసిల్లు మహావిష్ణు స్వామికి వెన్నెలకోలని . . హంస 4 213.

వెన్నెలగీము వి (వెన్నెల+గీము ) చంద్రుఁడు

సీ. కటిక చీకటికి నగ్గంబైన రేవన్నెలాఁడి వెన్నెల గీముఁ గూడుకొల్ల . ఉ రా 5 100

వెన్నెలగుత్తి వి (వెన్నెల+గుత్తి ) చంద్రుఁడు

వ. తెల్లని దివిరాజు, మడివాలు కేలువఁ దనరివ మొదయ, కాకరా వెన్నెలగుత్తి కన్దోయి మన్నీడడ ప్రబంధ 216.

వెన్నెలపావఁడు వి (వెన్నెల+పావఁడు )చంద్రుఁడు.

సీ వెలఁదిరో యీతడే వెన్నెలపావని పువ్వుగాఁ దురిమిన పుట్టుభోగి .. వీర 3. 157

వెన్నెలపులుఁగము వి (వెన్నెల¹+ పులుఁగము.) క్రీడావిశేషము.

వ. సరస సల్లాప బుల వల్లభులంగూడి వెన్నెల పులుగంబులాడు క్రీడావతులును . . వరాహ 4. 155

వెన్నెలపులు(గ్లు)గు వి వెన్నెలకు సంతోషించెడి పక్షి విశేషము, చకోరము.

గీ తొపఁగరే యింతి వెన్నెల పులుఁగుగములఁ, బెనుచుటకు మేత నించియుంచిన వెడంద ... అచ్చ రా అయో. 18.

సీ వెడఁద గూడులనుండి వెన్నెల పులుఁగులు తెమలె నా నేత్రాంచలములు తెలుగ ... ప్రబంధ 290.

చ స్ఫురిత నవోత్పల ద్యుతులు చొప్పడ యామిని కామినీ భవ, స్మరహార మూర్తియై తదుము మూర్చిల వెన్నెలపుల్గు వేలుపుం, దొరల కొసంగఁబూని .. కృ శకుం 2 194.

వెన్నెలప్రోవు వి (వెన్నెల¹+ప్రోవు) వెన్నెలలో బాలురు కుప్పలుగా నిసుక పోసియాడువాట.

సీ మురిపెంపు నగవులు ముద్దు లేఁజెక్కులఁ బొద లుచు వెన్నెల ప్రోవు లాడ ... 1. 85

వెన్నెలబచ్చె వి (వెన్నెల+బచ్చె) చంద్రుఁడు.

వ మీ మొగంబుల మిల మిలలు గెలుచాడ వచ్చెఁ జుమీ వెన్నెల బచ్చుముచ్చు ... వసు. 4 28.

వెన్నెలబొమ్మ వి (వెన్నెల¹+బొమ్మ) వెన్నెలతో చేసిన బొమ్మ.

సీ వడపాడ నేర్చిన వవకంపు లత లనఁ బొలు పొందు వెన్నెల బొమ్మలనఁగ ... ధనాభి. 2. 23 వం

వెన్నెలరా వి. (వెన్నెల¹+రా) చంద్రకాంతమణి

ఉ ... బలు వెన్నెలరాల నరాల జాలురాఁ జెన్నెలఁ జాడమట్టి . ముకుంద 3 53.

వెన్నెలరాచజా వి. (వెన్నెల¹+రాచ+జా) చంద్ర కాంతమణి.

ఉ, వెన్నెల రాచజా చలువ విప్పటరంగులఁ జేసి జాళువా, కిన్నరలూని . . అచ్చ రా. బాల 120

వెన్నెలరాయఁడు వి (వెన్నెల¹ + రాయఁడు) చంద్రుఁడు.

చ విను రతవంపు వంగడపు వెన్నెలరాయ మర్యు సేరివన్ .. అచ్చ. రా. యు. 266 (సూర్యవంశ శ్రేష్ఠుఁడని భావము.)

వెన్నెలతేఁడు వి. (వెన్నెల¹+ తేఁడు) చంద్రుఁడు.

చ వికట జటా కుడుంగమున వెన్నెలతేని ధరించి ... పాదనూపె భీమనాయకుఁడు ... భీమ. 5. 58.

రగడ గురువెంద వరె గిలుబు కొనియెంబయ్యర
దొంగ, విరులఁ గరికుంభ కుచవెరఁజు మైయర
గ్రుంగ మనుచ 3 84.

వ వమతించి వచ్చి కాఁగుచున్న కాఁగుల మీఁది
మీఁగడలు మెల్ల మెల్లనె పుడుక వెరఁజి యారగించియును ... వి. పు 7. 128

4. కనుపెట్టు, కాచియుండు.

సీ. వేప మన్నీఁడ నీవీకావ వెరఁజుము గైత నీవా
జాడ గవఁగఁ జూపు .. ప్రబంధ 183

5. గట్టిగా పట్టుకొను

చ. బరవవమొప్ప గాలి తడఁబాటు మెయిన్ గవిఁ
దూటి యొక్కకుర్కురము తమంబులో వెరఁజి
కోటలచేఁ గబళించి పొట్ట పెం, తెరమడుమంచుఁ
దెచ్చి కని చేవరొటంగక త్రుంచివైచె. మనుచ.
4. 52.

**వెరవరి** విశే (వెరవు+అరి) 1 ఉపాయశాలి.

చ. వెరవరిగాక వీఁడు కురువీరులకుం బొడ సూపు
వాఁడె యచ్చెరు వొక ప్రాని పేర నిటసేరఁగ
వచ్చుచు నున్నవాఁడు .. భార. విరా 4 81.

ద్వి వెరవరులై మేష వృషణముల్ దెచ్చి, సురలు
వంధించిరి సురలోక పతికి .. రం రా బాల
50. పొ 28 పం.

సీ సకల విద్యా విచక్షణత మించినయట్టి వెరవరి
సైరంధ్రి వెంటరాఁగ .. రాజశే 3. 201

2 జీవనోపాయజ్ఞుఁడు

సీ ధనమెంత దఱుగునో యనఁ డింత వెచ్చ మా
వడ్డికాసుల వెరవరికిఁ గలికి ... రా వి
1 85.

**వెరవిఁడి** విశే (వెరవు+ఇఁడి) 1. ఉపాయహీనుఁడు

క. మఱువక యేఁడులు పూఁడులు, గొరికిన నా
యొడలు మృదువగునె నీకేలా, వెఱవిఁడి
చందము పుట్టెన్, దటి దీనికి వెరవుఁ జెప్పె
దన్ విను మక్షిన్ వేం పంచ 4. 544

క. తరుణి విరహాతురుఁ డగు, వరనాథ తనూజు
మంత్రి నందనుఁ గని యా, నరపతి సుదక్షురా
యని, వెరవిఁడియై పలుకఁదొడఁగె వీడని
కాఁకన్. సుద. 5 4.

క. గురుజను లెఱుఁగక యుండను, వెరవిఁడియై
మిమును గట్టి వెళ్ళి చనువునన్, వరియింపఁ

దగిన పురుషుఁడు, వరిణయమగునేని నదియు
పైశాచ మగున్. విజ్ఞా ఆచా 101

2. తెలివిలేనివాఁడు, మూఢుఁడు

క. అరులకు సిరియిచ్చెదనను, వెరవిఁడియుంగలఁడె
దీని విడువుము .. భార శల్య 2 78

క ఉరు బాహు బలము గల్గియు, వెరవిఁడివై తేర
కాని విధమున నకటా, కరుణ యెదలోనఁ
దలఁపక, దురమున జముచాత నిన్నుఁ ద్రోచితి
పుత్రా భా రా. యు 1385

**వెరవు** వి. 1. ఉపాయము

క వెరవును లావును గలిగిన, పురుషులు లే రెట్లు
లోకమున .. భార శాం 3 31

ద్వి ధరణీశ మీకు సంతాన సంప్రాప్తి, వెరవైన
కథ మున్ను విన్నాఁడ నేను ... రం రా.
బా. 11. పొ 7 పం.

ఉ .. రామావని నాథు తమ్ములకు నట్టి యపౌ
రుషవృత్తి మేలె మీ, కి వెరవాదరింపఁ దగునే
యనినన్ మును తెల్ల నవ్వుచున్ నిర్వ 10.10

క ఎట్టి వెరవునవైనన్, ఱితి పులకరి జయము
ధనోన్నతియుఁ బ్రజానీతి రక్షణము ధర్మం
బుల్. ఆము 3. 35

2. నేర్పు, చాతుర్యము

సీ . . కీర్తి ధనార్జన క్రీడనంబు.

ఆ. గలిగి జనుల నేలఁగాని యొన్నండును, నోరులఁ
గొల్చి తిరుగ నె వులేని, యట్టి నీవు విరటునెట్టి
చందంబున, ననుచరించువాఁడ వధివ చెపుమ.
భార విరా. 1. 67.

గీ అఖిల మోహనమూర్తిగా వరుఁబోడిఁ, బంచ
బాణుండు తాన నిర్మించెఁగాక, వేదజడుఁడైన
యజునకు వెరవుగలదె విక్ర 7 44

క. కైవచ్చె క్రూరజంతుఁ, జే వెరవున నేయు
చుందు సిగ్గె చెపుమా నార 7. 57

3 రీతి, విధము.

గీ నగరు వెరవునఁబురుకుత్సు సరణి వలుని రమణ
వర్జున క్రియఁ బురూరవుని చందమున . విక్ర.
269.

క సిరితామో కాలొడ్డిన, కరణినిఁ బైకొనుచు
నేనె కదియఁగ నను నీ, వెరవున విడనాడుచు
నోక, తిరిపవుఁ జెలిపట్టఁజేరఁ దివి రెదవేమీ.
యయా. 2 78 (శ ర. పా)

4 ధర్మము

గీ మేలుగల నాఁడు మురియుచు మెచ్చనేర్చి, గోడవ లోదవెడు తటిఁబోవ విడువఁదగునె, తలఁపనుసురుల యొడయఁడైతనరు మగని, వెరవెఱింగిన నాడెంవు వెంఁదుకలకు అచ్చ రా అయో 71

5 అనుకూల్యము

సీ మాతలేశ్వరు నొక్క మణికందరంబున విశ్రామ ముండంగ వెరవువేసి హర 5. 40.

6 ద్వారము

వ. ప క్వాన్న గంధంబు గాలివెరవున నాఘ్రా ణించి .. కాశీ 4 120

గాలి వెరవునన్ = గాలిద్వారా

విశే 1 శక్తము, సమర్థము

క పావన గుణానుభావము, భావన భావింపనెట్టి పరమ నదులు నీ, కావేరికి సదృశంబులు, గావేరికినైనఁ బోగడఁగా వెరవగునే కళా 2 18

ద్వి పొరి భూతకోట్లను బుట్టింపఁ బెంప, విరి యింప నొక్కఁడె వెరవైనవాఁడు . రం రా ఉ 103 పా 10 పం

2 యుక్తము

ఆ వాములానితోడ వాట్లనితోఁడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటమటీనితోడనడయరితోడను, వెలకునెత్తమాడ వెరవుగాదు ఉ హరి 3 112

మ. వరవైతాళిక వంది బృంద జయ జీవస్ఫార శబ్దంబులున్, వెరవై పేర్చి చెలంగ వెల్వడియె సంప్రీతిన్ నిజావాసమున్ హరి ఉ 4 117

క పరవగు మోహాస మేర్పను, వెరవగుచో నెల్లి నేఁడు విడిసెన మధురా, పురమున .. ఉ హరి 4. 168

3 అధీనము

క గరుడునిపై శార్ఙ్గ ధను, ర్ధరఁడగు విష్ణుండు మేరు తటిఁబోలుచు తటి,త్పరివృత జలదము బోలుట, వెరవ దనుజ రాజ హంస వితతి యితని కిన్ నిర్వ 3 5 (శ.ర )(విరియ ముద్రి పా )

వెరవుపడు[1] అ క్రి (వెరవు+పడు) వశమగు, అధీనమగు

వ. అప్పాటం బ్రతివచనంబునఁ బాటిల్లు చీకటి తప్పు కప్పి వుచ్చ వెరవు పడకుండునట్లుగా బ్రకాశించిన హర. 5 57

వెరవుపఁడు[2] అ క్రి (వెరవు+పడు) అనుకూలమగు

గీ అపుడు గాని మా తండ్రి యున్నట్టి చోటు, నరసి సంధించు కొనుటకు వెరవు పడదు కళా. 6 154.

వెరసి వి అంకెలను గలుపఁగాఁ దేలిన మొత్తపు లెక్క

ద్వి చదువు లెక్క ల [illegible] బస. పు 6 783. పం.

వెరసి(ను)మాట పర్యవసానము, చివరకుఁ దేలిన సంగతి

వ అన్నియుం జెప్పనేల వెరసి మాట యొకటి గలదని యిట్లనియె కళా. 78.

క తగవెరసు మాట చెప్పెద, మగువలసంచల కటాక్ష మార్గణ జాలం,బు గెలువఁ దాఁకినఁ దాఁకవె, జగతిం గోవిదుల మతులుఁ జదువులుఁ దెలువుల్ ప్రబోధ 1 47

వెరసు వి. అంకెలు లోనగు వాని పంక్తి

చ. హరిదవధిక్షమా రమణులాతురగాలిమదుళ్ల పట్టముల్, తరువుల రాయసంబుల విధంబునఁ గన్గొని శ్వేతదిమాన వేశ్వరునకుఁ దెచ్చియిచ్చిన సువస్తు పరంపర లెక్కఁ గూడు పెన్వెరసుల రీతిఁ దత్పవన వీతిఖురాంకము లుండు నుర్వ రన్ వరాహ 12. 60

ద్వి స్వర్గంబు గరసు మోక్షంబుల వెరసు, శివ యోగుల కిరవు సిద్ధుల వెరవు ... పండితా. పర్వ 813

వెరసుబడి వి (√వెరసు) అంకెలపంక్తి, అంకమాలిక

క విను మీతని సేనం గల, వనచరభట సంఖ్య వర్గ వర్గములెల్లం, బెనురాశి నేసి కవిలెం, బన వ్రాసిన వెరసుబడి నిశాచర నాథా భా రా. యు 364.

వెరశించే స క్రి. చెలఁగించు, విజృంభింపఁజేయు. (ప్రయోగాంతరము కన్పడ లేదు. ఇంకను విచార ర్యము.)

గీ. చికిలి లోపలనే చీమ చిటుకుమన్నఁ, గనకనవ
కూయు ఒకదారి కవలకదన, వరుని వెర
ఱించు మల్లెంటు విరులకదన, బడుకయిలు
మాని విరహాతాపంబుఁ బూని కువల. 5 88

**వెఱ** వి. (త వెఱు.) 1. భయము

క. చెఱువు వడుమ విసినను బెను, వెఱమొగములు
సెదరినను వివేకవిధియు, క్కటి బహుళ సైన్య
మటి ముటిఁ, బఱచిన వా గంగరాదు బలి
యురకైవన్ భార శాం. 3. 16

చ. వెఱమెరలేని యట్టి బలు వీరుఁడు కృష్ణ
కుమారుఁ డొక్కచే, జఋది . భాగ 10
పూ. 662.

శా. పుట్టంబుట్టఁగఁ దల్లిదండ్రు లడవిన్ బోఁ
ద్రోచిరి వైఖరిన్, బొట్టుంగట్టిన ప్రాణనాయ
కుఁడు పో పొమ్మంచు నోవాడెడిన్, గట్టా
కోయిల పిల్లచందమున బల్గాసిన్ వెఱంగొంటి
న, న్నిట్టట్టుఁ గికురింపఁ జూచెదవా కుయ్యా
లింపవే శ్రీహరీ కృ శకుం. 3. 164

2. ఆశ్చర్యము.

గీ. నేను మొదలుగ నొండొండ నెనఁగునంప, వెల్లి
వఱపియు వస్త్రముల్ వెలయఁజేసి, కాన
మొక్కని వందుఁ దాకదు దగులదు, ఱిచ్చవడి
నిలిచితిమి వెఱ ముచ్చముడిఁగి. హరి.ఉ. 5 67.

గీ. అనఘ మణికంథరుం డట్లు తనదు తపము,
విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడమెడుఁ,
దిరుగఁ దపమొనరింపంగ దొరకొనియెనో,
యిపుడు రంభతో నున్నాఁడొ యెఱుగ
వలయు. కళా 3. 47.

గీ. డిగధి పాలుర నెల్లఁ దోడ్తేరఁబనిచి, వారు
దాను రహస్య విచారతత్పరత, నుండి వెఱతోడి
భయమునను దిఱగొనుచుఁ, బలికె గీష్పతిఁజూచి
యాబల వితేది. కవిక. 7. 97.

3. నిశ్చేష్టత

మ. పనిగావేర దటంచుఁ బూనక వెఱంద్రావింతు
రెంతేజముల్, వనికిన్ మేకొని విఘ్నలేశము
జనింపవ్ ముఖ్యముల్ వీఁగి యం,తనె చాలిం
తురు ... మల్లి నీతి. 72.

**వెఱఁగందు** అ క్రి. (వెఱఁగు+అందు.) ఆశ్చర్య
పడు.

క. ఈ జనపదమున కధిపతి, యే జనపతి యో
మునీంద్ర యిదిక్కృతయుగ వ ద్భాగ్రజితమని
వెఱఁగందెడు, నాజి తనూభవునితోడ యతి
వరుఁ డనియెన్. చం రా 2 96

గీ. చిత్తజాతుండు కనుమూయ చేసినాఁడొ, మన
మనంబుల విభ్రాంతి మట్టుకొనెనొ, కమలలో
చన పతితాప గౌరవంబు, యనుచు వెఱగంది
మదిఁగుంది యబ్జముఖులు విక్ర 1 188.

**వెఱఁగు = వెరఁగు** వి (క బెఱగు త వెరళ్)
ఆశ్చర్యము, వింత

క. తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవుల
కెల్ల మోదము వెఱఁగున్, మది మొలవఁ జక్ర
ధరుపై, వదలక వినువీథిఁ బుష్పవర్షము గురి
సెన్ ఉ హరి. 1 122.

ఉ. . వాసియు వన్నెయుం దగవు వైభవముం
జన్మముల్వివేకమున్, బో సవతుల్ భజించుటకుఁ
బో వెఱఁగయ్యెడు నేమి చెప్పుదున్ పారి 1.92

క. . . నతఁడా, రూపం బెడఁబాసి ఖేచరులు
వెఱఁగందన్. మనుచ. 4. 116

2 అద్భుతకృత్యము, వింతపని.

క. శ్రీ విశ్వ విభుఁడు చేసిన, యా వెఱఁగుల కలుగ
వలయు వలిగిన కీదవన్, భావింప నతఁడు
ధీరుఁడు, వావిరి నవుఁ దేరవ్ఁడతను వడిఁ బడ
వలయున్. కావ్యా 1. 104.

ద్వి. వెఱఁగైన యా రంగ విభు మహామహిమ,
మఱి వేల్పులకు నవాజ్మనస గోచరము ...
ద్వి పరమ 5. 417. పా.

**వెఱఁగొందు** అ క్రి. (వెఱఁగు+ఒందు) ఆశ్చర్య
పడు.

సీ. విక్రమార్కుని సైన వెఱఁగొందఁగాఁజేయు
జండ తతాఖిల పాహాటములు ... విక్ర. 1.87.

**వెఱఁగుపడు** అ క్రి (వెఱఁగు+పడు) 1 ఆశ్చర్య
పడు

క. వెఱఁగుపడి హర్ష రాగము, దఱిఁగిన వెల
వెల్లనై వదనములు వ్రాలం, దెఱఁగేది ఱిచ్చ
వడి ర, త్తఱిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు
నంతన్. భార అర. 7 158.

గీ. నేఁటితోఁ బాసె రాక్షసానీకమునకు, వీర
హోమంబుచే నీవు వేలుపఁబెద్ద, వెఱఁగు పడఁ
జేసి లోకైక విజయహేతు, వంముతోందుటఁ
బౌలస్త్య వరకుమార. ఉ. రా 2 214

వ కౌతుకాంకురంబు కరఁగు వడ వెఱఁగుపడి .. మనుచ. 6. 79.

2 నిశ్చేష్టత నొందు

చూ: వెఱఁగుపాటు.

**వెఱఁగుపఱుచు** స క్రి (√వెఱఁగు పడు) ఆశ్చర్యము నొందఁజేయు.

వ తంచు మించుగన్ బఱచుట గగన చరుల వెఱఁగు పఱిచి ... మనుచ 4 115.

**వెఱఁగుపాటు** వి. (√వెఱ గు పడు) 1 నిశ్చేష్టత

గీ దాని కమ్మనమెల్లఁ జిత్తమున భయము, విస్మ
యంబును బెనఁగొన వెఱఁగు పాటు, గదిరి
చిత్రరూపంబులఁ గరణి నుండ . భార.అను.
4 400

ఆ. . . వెఱఁగుపాటు దనికె నెఱనాడె నొవ్వ
నెవ్వగలు వగల నీరె దిగులు వొదివె ..భార.
విరా 2 106.

క అబ్బెఁ దగుశోభ మని మది, మబ్బెదుకో నంత
రాయ మొదఁ గూడుటయున్. బ్రబ్బికొను
వెఱఁగు పాటది, నిబ్బరపు విషాదమువఁగ
నెగడుం జూడన్. కావ్యా 1 73.

2 అబ్బురపాటు, ఆశ్చర్యము

అ వెఱఁగు పాటు తోడి వెఱపు నాకసిద్ధిక, సమ్మ
దంబు మానసంబు నొలయ . హరి. ఉ
3 188

చ. ... గురు శిష్యులు కౌరవ సేనలోని భూపతి
సుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి ...భార
విరా 5 126

**వెఱచేఱుచు** స క్రి. (వెఱ+చఱుచు) భయపడు

క వెఱచఱవ నింతకంటెం, దఱుమగ బాణంబు
లేసి తడయక పగఱం, జెఱుతునని యిసుము
చల్లుచు, గ్రుఱుక ధనంజయుఁడు రణజయో
న్నతుఁ డరిగెన్. భార. సభా 2 305.

వ. ఇట్లు క్రీడించి గాంగేయుడించి గాండీవి దన యరదంబు రయంబున

క పఱపి రథికులను సూతుల, నఱికిన మ్రోడుపడి
యుండె నానారథముల్, వెఱచఱచిరి కురు
వీరులు పఱిపఱియై మనబలంబు భయముం
బొందెన్ భార భీష్మ 2 38.

లయవిభాతి తఱిమి వెసరక్కసుల వెఱచఱువఁ
బట్టుకొని, పఱిపఱిగ వేతలలు మఱిపి ... భా.
రా యు 1437

**వెఱచు** అ క్రి 1 భయపడు

క. రవిసుత పార్థుల ఘోరా, హవమునకును
వెఱచుచున్న యది కుంతి. .. భార. ఆది.
6 41

చ. పరమున కేను దాసుఁడని పల్కఁగఁ బ్రాపుఁడఁ
గాను మత్సుతన్, హరునకు నిత్తునా వెఱవ
నయ్యో . కు సం 3 370.

చ వెఱచితి రాఁగదే యనిన వెండిక దావగఁ
దీర్తు నీవు నా, వెఱపెటులున్న నీ రథిక వీరులు
వాపెదరు ... భార ఉద్యో 4 139

ఆ. పాపఁడనక వెఱక పాపని మొదలింటి, పోక
లెల్లఁ దలచి పొగడఁ దొడఁగె ... భాగ.
10 116

వెఱక = వెఱవక.

క . విహంగంబులు రుతముల, నవని సుతను
వెఱకు వెఱకు మన్నంట్లుండెన్ భా రా,
అర 2 150.

వెఱకు = వెఱవకు

గీ ... అని జయంబిచ్చి తన గదా హతికి వెఱని,
మనికి ధనపతి దయచేసె ... సమీర 2 133

వెఱని = వెఱవని

ఇది 'వెఱచు' ధా యొక్క వ్యతిరేకార్థక విశేషణము

2. జంకు, సంకోచించు

గీ అదియుఁగాక మరుత్తుండు యజ్ఞవేళ, నుచిత
దక్షిణ లర్పించి యున్నధనము, గొల్లవిడిచిన
బ్రాహ్మణు లెల్లఁదనిసి, విడిచి రర్థంబు దీనికై
వెఱవవలదు జై భా 1. 73

సీ హీర కుట్టిమ భూము లిసుకనేల లటంచు
గట్టిగా నడుగులు పెట్ట వెఱచు . దశా
1 272.

క. ... వన్నిన భయమున బేడిస, లెన్నఁడు జల దుర్గభూము లేమఱ వెఱచున్. హరివం 2 90

3. వప్రమత్తగా నుండు

క. ... విను కావునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్. భార. శాం. 2. 261

**వెఱచుకొను** అ. క్రి (వెఱచు+కొను, స్వార్థమున) భయపడు

ఆ ... వెఱపించఁబోయి వెఱచుకొన్న చాయ యయ్యె. కృష్ణ. 3. 43

**వెఱపరి** విశే. (వెఱపు+అరి³) భయము కలవాఁడు, భయము కలది.

సీ ... భయశీలుఁడౌ వెఱపరి .... ఆం. భా. 3. 9

**వెఱపాటు** వి (వెఱపు+పాటు) భయము.

ద్వి. నిరవైన పతి మీఁది నెయ్యంబు దలఁచు, వెఱ గందిచింతించు వెఱపాటునొందు .. రం. రా ఉ. 122. పా 3. పం.

క. ఏ వరము కొల్లదేవా, దేవర కరుణాకటాక్ష దృష్టి యునిచి నా, కావరముచేత వచ్చిన, యీ వెఱ పాటుడిపి ప్రోవవే యని పలుకన్. శ్రీరం. మా 4 83.

**వెఱపించు** స క్రి (√ వెఱచు) భయపెట్టు.

ఆ. ... వెగడు పడఁగఁ బాతి వెఱపింత మొజ్జలు తత్ప్రయోగ విధులు దప్పెనఱవ. భార ఆది. 2 130

క. సమరంబు గలుగు ననుచును, మము వెఱ పింపంగవలదు మాధవ ... భార ఉద్యో 3 43.

ఉ. తేలవుగాదె నీవు వెఱపించెదు వీరిని వారిఁబోలె న,మ్న .. రాఘవ 4. 10.

**వెఱపిఁడి** వి (వెఱపు+ఇఁడి) నిర్భయుఁడు, భయము లేనివాఁడు, భయములేనిది.

వ. .. వెఱపిఁడి తఱపికొన్న విధంబున శిబి రంబు చొచ్చి .... విక్ర. 4 98

**వెఱపు** వి (√ వెఱచు) భయము

క కఱవు పయిఁ గఱవు వొరయుచు, వెఱపు పయిన్ వెఱపు డోఁప విడువని యిడుముల్, దొఱఁగమిపైన్ ... భార. శాం 4. 72.

మ. కరకంఠుం దరుణేందు శేఖరుని షట్కా లంబు పూజించు నెం,దఱు భక్తుల్ దనువేఁడి నం బ్రమదమున్ దాత్పర్యమున్ భక్తి యున్, వెఱపుం గల్గి తదిప్సితార్థములు గావింప న్ని రాలస్యతన్ హంస 1 11., దశా 2 333

**వెఱపెక్కు** అ. క్రి (వెఱపు+ఎక్కు) భయపడు.

చ ... చొప్పుడునే నినుబోఁటి కాప్తి చెప్పిన క్రియఁ జెప్పినీవు వెఱపించిన నే వెఱపెక్కు వాఁడనే భార కర్ణ 2. 38.

**వెఱబొమ్మ** వి (వెఱపు+బొమ్మ) పక్షులకు భీతి కలుగుటకు భీకరాకారముగఁ గట్టెడు బొమ్మ

క నెఱవగు సంపద గలిగిన, నెఱదానం గుడువఁ గట్ట నేరని మనుజుం, డఱముఱిఁ జేరికఁగట్టిన, వెఱబొమ్మయె కాఁడె యెన్ని విధములఁ జూడన్. విక్ర 2. 179.

ద్వి. వీఁ డొక్క వెఱబొమ్మ విప్రవ్యళీకము. పీడించి వీరి నొప్పించుచున్నాఁడు ద్వి. హరివం ఉ 932 పం.

**వెఱవెఱపాటు** వి. (వెఱ+వెఱ+పాటు) నిశ్చేష్టత

ద్వి. వెఱవెఱ పాటును విహ్వలత్వంబు, వెఱపును మఱవును వీడి కోడాడ రం. రా అయో 36 పా 17 పం.

**వెఱవేఁకి** వి (వెఱ+వేఁకి) 1. భయజ్వరము.

గీ ఏను నామాట పద్యంబుగా నొనర్చి, వ్రాసి నిలిపితి నంత నెవ్వారలైన, ద్రొక్క జను లెంచి కాంచివిదిక్కు వడుచు, వెడలి మఱి జూడ రిట వెం వేఁకిపట్టి ద్వా. 4 70.

ద్వి వన్నెఱింగెదు గాక నాపేరు తెలియ, విన్న మి త్రికి నైన వెఱవేఁకి వచ్చు ... ద్వి హరివం. ఉ 1194 పం.

సీ మొన్నఁ బారాశర్య ముని యోటరాఁ గూఁత లిగయించి వెఱవేఁకి యెత్తఁజేసె . . కువల. 2 80

2. సంతాపము, జ్వరము

ఉ ఏవి దినంబులో రజను లెయ్యది యో విను నిద్ర యెట్టిదో, వేవుట యెప్పుడో యలఁత వెమ్ముతునం బన కెద్ది మందొ యే, ప్రోవలఁ శ్లోయెవో తలఁపు తోఁడవ చెయ్వు లెఱుంగ నేను నా, కీ వెఱవేఁకి మాన్పఁ గమలేక్షణ యబ్బితి నీవు వెజ్జవై. హరి ఉ 7. 170.

(ఇందలి 'వెఱ' శబ్దము సాధురేఫ ఘటితము విర హార్థకము ప్రత్యేక ప్రయోగము లేనిది అని శ. ర)

**వెఱసొచ్చు** అ క్రి. (వెఱ + చొచ్చు) భయపడు

సీ. ... పశువుఁ జేయ, విప్రులు పట్టరా వెఱసొచ్చి యొదిఁగెడు గవయంబు చాడ్పునఁ గర్ణ భీతి, మల్లఁ అనుశుకుమ నుండును ..భార కర్ణ 3 33

క. ఇటులఁ దమి హెచ్చి మారుఁడు, పటవంబెట్టంగ నొచ్చి నడి పటు నిటుఁ జెం,దుటకు వెఱసొచ్చి రతిసం, ఘటనార్థము మిగుల వేగు కాలము నందున్ హంస 3 156

**వెఱగాయలాటలు** వి. బ బాలక్రీడావిశేషము

గీ దాయముల వాడు వామనగాయ లాడు, బాట లను బాడు వెఱగాయ లాటలాడు, మున్ను మున్నగ దాఁగుడు మూ తలాడు, నా సుశీల జగన్మోహనాంగి యగుచు బ్రహ్మో. 3 27

**వెఱ్ఱి** వి (క. త మ వెరి.) 1. పిచ్చి, ఉన్మాదము.

ఉ వైదిక కర్మచారి జనవత్సల నీ మది బట్టు కొన్న యు,న్మాదము హీన మానవు మనంబునఁ బుట్టిన వెఱ్ఱివో లెన,ప్పాదులఁ దీర్చుటొప్పదు... భార. శాం 1 101

గీ. .. అవెంయూ వెఱ్ఱి పట్టె నేమొ, యనుచు నాలాగె కావింప . . శుక. 2 456

2 అవివేకము

క జడలు ధరియించి యడవుల, నిడుమలఁబడి కాయ గసరుతే మెసఁగెడు పెన్, బడుగు నిమఁ గవయఁదగునా, విడువిడు నీకేలపట్టె వెఱ్ఱిఁ అహాంగి రామా 6 152.

చ తనకిది దక్కెనంచుఁ బ్రమదంబునఁ బంక్తి ముఖుండు మీన కేతుని చిగురాకులూఁకుమదిఁ దూరినఁ దాలిమి మాలి చేరఁగాఁ, జని యిది యేమి వెఱ్ఱి యొకొ జవ్వనమున్ బొలిపోవ విష్ణుఁడం, చును కలకాలమున్ దపసి చొప్పున దాఁచెదు వృద్ధకాంతవై ఉ రా. 3 115

విశే 1 వివేకము లేనివాఁడు, వివేకము లేనిది.

ఉ ఇమ్మది వెఱ్ఱి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొని యాడె ... భార. సభా. 2. 39

క. నీ పడవి కరుగ నొడఁబడి, నీ వెనుకవ వచ్చు నప్పుడు నిందింతురు మ,మ్మీ వెఱ్ఱు లితని మాన్పం,గా వలఁతులు గాకయని జగజ్జనులధిపా. భాం శాం 1. 66

ఆ వినుు పతివ్రత లగు వెలఁదుల దిక్కు రా, వెఱ్ఱి యేయను ర్త్య విభుఁడు నీకు, వలవదతని మీఁది వైరస్య మనుకూల, వృత్తి బోలునయ్యవి ప్రియంబు హరి ఉ 9 78

మ వలదమ్మా యిటువంటి కానిపని యోవామాక్షి యీ వెఱ్ఱిబు,ద్ధులు నీకేల ఘటిల్లె నమ్మ తెగువన్ దుర్భాషలిట్లాడి యీ,కాల నాకేటికిఁ గట్టెదమ్మ ... సారంగ. 2 102

2 పిచ్చివాఁడు, ఉన్మత్తుఁడు, పిచ్చిది

సీ వెఱ్ఱులు దొలు మేన వెడ్డున సాధు జనము మోస పుచ్చి ధనంబు గొన్న జనులు . భార అను 5. 105

ఉ .. నీ, చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁ జేయదే ... మనుచ 3 68

3 వికృతము

గీ . క్రోటి నిర్వంకఁ బతు, తులను నివురుచు వెఱ్ఱి చూపుల మరంబుఁ, గెలఁకుల గనుఁబాం గొమచుఁ గానఁ గేకులుండె అము. 4. 181.

**వెఱ్ఱికుందెన** వి (√వెఱ్ఱి) వృక్షవిశేషము (వృ వి.)

సీ వెలగ విషము దారి వెఱ్ఱి కుందెన మంచి కుందెన కలబంద గువ్వ గుత్తి .... హంస 4 10.

**వెఱ్ఱిగొను** అ క్రి. (వెఱ్ఱి + కొను) అవివేకము నొందు

గీ ఏల ప్రేపల్లె పెద్దవారిట్లు వెఱ్ఱి, గొనిరి కృష్ణుఁ బోనిచ్చినఁ గ్రూరులైన, రక్కసులు లోనుగాఁ జేయ క్రందులెల్ల, నుడుపఁ దమకు దిక్కైన వాఁడొరుఁడు గలఁడె. హరి. పూ. 8 181.

**వెఱ్ఱిగొలుపు** స క్రి (√వెఱ్ఱిగొను) అవివేకము నొందించు, మోహపెట్టు

క ప్రకృతి గుణంబులఁ గొని బహు, వికృత రూపముల నట్లు వెఱ్ఱి గొలిపెనే, వకలంకుడ ... భార శాం 6 51.

**వెఱ్ఱిచిక్కి** వి (వెఱ్ఱి + చిక్కి) వృక్షవిశేషము (వృ వి) ఒకజాతి యడవిచెట్టు

సీ గోగు పొగడముబు గోరంటలును బెద్దవెలమ సుంకేసరి వెఱ్ఱిచిక్కి ... హంస 4 11.

**వెఱ్ఱిచెఱకు** వి. (వెఱ్ఱి+చెఱకు) ఇక్షు విశేషము, అడవిచెఱకు (వృ. వి.)

ఆ. వెఱ్ఱిచెఱకుఁ గోలవింటి బద్దకు మల్లె, తీవె నారిఁ జేసి ఖావ భవుఁడు, పఱచుపువ్వు కోండ్ల చెఱచోటులకొ మెత్త, విరుల తూఁపులేసి మరులు కొలిపె. వైజ 2. 35.

ఆ. వెఱ్ఱిచెఱకు వందు విలసిల్లు ముత్యాలు, పొరలు ప్రేంఖణంబు పువ్వుచాయ, వది సమస్త భూత లాధీశ కామినీ, వశ్య కరము ధరణి వలయము వను రత్న 40

సీ. రసదాళి చెఱకుతోఁ బతివెఱ్ఱి చెఱకైనఁ జాన వాతెఱ ప్రతి చక్కెఁగును ..చంద్రా 4 105.

**వెఱ్ఱిజిల్లేడు** వి (వెఱ్ఱి+జిల్లేడు) రాజార్కము, ఒక జాతి జిల్లేడు (వృ. వి.) (శ. ర)

**వెఱ్ఱితనము** వి. (వెఱ్ఱి+తనము.) అవివేకము, తెలివి తక్కువ తనము.

సీ. కాహు బలాఢ్యుల బలవిహీనుల క్రియ వెకలంగ వడిచిన వెఱ్ఱి తనము .... ఖార ఉద్యో 1 376.

మ. మత్తెతవోరి మా వదుచు మార్కొన్నన్ జలి తింపఁ బూని వీ, వెఱ్ఱితనాలు మానవని వేడ్క నిటాడఁగ నింటనుండి కాఁ, జిట్టున్ఁ గోప గించుకొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ, వెఱ్ఱియగారు మంచిగురువే దొరికెన్ జదువెట్లు చెప్పునో వైజ 4. 12.

గీ. ... దైవకృతంబులకును, విఱ్ఱవీఁగుట ప్రేఁగుట వెఱ్ఱితనము దశా. 2 418

**వెఱ్ఱినారువ** వి. (వెఱ్ఱి+నారువ) అరణ్య వృక్ష విశేషము, ఒకజాతి యడవి చెట్టు. (వృ. వి)

సీ. వేరు వవనగుత్తి వెఱ్ఱి నారువ రేల వవన కంక కొమ్మిని పలుకరేణి ... హంస 4 11.

**వెఱ్ఱినిమ్మ** వి (వెఱ్ఱి+నిమ్మ) అరణ్య జంబీరము, అడవినిమ్మ.

సీ కోరింద నలతుమ్మ గొటికె కోదారయ వెణుతు రూదుంగ దంతి వెఱ్ఱినిమ్మ ... హంస. 4. 9.

**వెఱ్ఱినీరు** వి (వెఱ్ఱి+నీరు) వెఱ్ఱి యెత్తించు నీరు, మద్యము, కల్లు.

గీ. వెఱ్ఱినీరాను కతమున వెదలునట్టి, చొక్కుఁ గోదట్టి యొకకమ్మ వెక్కఁబెట్టి, దతి గఱవఁ కోవు వేఁపి చందమునఁ బట్టి; ఎరున మెచ్చఁగ నూరుజ ప్రముఖుఁ బలికె. శుక 3 32.

గీ మేఁపులిఁటిన గొటియల మేఁక గముల,గొటి యపోతుల నటికి ప్రోగులుగ నిడ్డ, వెగ్గలపుఁ బచ్చి వంజుళ్ళు వెఱ్ఱినీళ్ళు దోరహత్తుగ నిడఁగడు పార మెసఁగె అచ్చ రా యు 231

**వెఱ్ఱిపాల** వి. (వెఱ్ఱి+పాల) అరణ్య వృక్ష విశేషము, అడవి పాలచెట్టు

వెఱ్ఱిపాలాకు అరిక బియ్యము పిట్టున ఎలుక కాటు మానును. (చి శి చి ని)

**వెఱ్ఱిపుచ్చ** వి (వెఱ్ఱి+పుచ్చ) చేఁదిపుచ్చ (వృ. వి)

గీ. పాపంయు వెఱ్ఱి పుచ్చయు బత్రపుష్ప, వల్లరి ఫల మూలంబులుల్ల పిల్లి, గ్రహణమునఁ దెచ్చి చూర్ణంబుగా నొనర్చి, నీళ్లతో నీయవిషము లన్నియును దీఱు (చి శి చి. ని)

**వెఱ్ఱిబాగులు** వి (వెఱ్ఱి+బాగులు) తెలివిలేని స్త్రీ (గ్రా.) తెలివిలేనివాఁడు, వివేకము లేనివాఁడు (శ. ర పా)

**వెఱ్ఱిబిల్ల** వి (వెఱ్ఱి+బిల్ల) అరణ్య వృక్ష విశేషము, ఒక జాతి యడవి చెట్టు

సీ పుణిచింత మోదుగు ములుమోదుగును వెల్ల పుల్ల వెలగ వెఱ్ఱి బిల్లశిల్ల ... హంస 4. 11

**వెఱ్ఱిబీఱ** వి (వెఱ్ఱి+బీఱ) చేఁది బీర (వృ వి)

గీ ముసిని వెఱ్ఱిబీఱ ముష్టి యుమ్మెత్తల, విత్తన ములఁ జెముడు వేళ్ల ఖాను, మూలములును దైలమున దించి చమరిన, సర్వ వాతములును శాంతి నొందు (చి శి. చి ని)

**వెఱ్ఱిమొల్ల** వి. (వెఱ్ఱి+మొల్ల) అడవిమల్లె (చి. ని)

**వెఱ్ఱివాఁడు** విణ (వెఱ్ఱి+వాఁడు) 1 వివేకము లేని వాఁడు

చ. విడువక నీవు పట్టవము వీథుల వీథుల వెఱ్ఱి వాఁడవై, చెడుగులఁ గూడి ధౌర్త్యములు సేయ మహీరమణుం డెఱింగెనే, విడుచును సోమ యాజి మను వృత్తులు చేకొనువెల్ల వెంటలన్, జెడుదుము గాదె నీకతవఁ జీరయుఁ గూడుమ లేక పుత్రకా కాశీ. 4 93

2. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు (శ. ర పా.)

**వెఱ్ఱిసెనగ** వి. (వెఱ్ఱి+సెనగ) ఒక జాతి చిన్నచెట్టు, చిన్న మొక్క.

సీసమాలిక. ... కామ జిలుగు మెట్ట దామర వెట్టి సెనగ జుంచిరము కాచి నల్లకాచి .. హం.. 4 10

వెట్టిసొట్ట వి (వెట్టి+సొట్ట) తుంబీ భేదము, చేఁతి సొఱ.

చ నిలువక వచ్చి వచ్చి ధరణిం జిఱువెంచి లున్ వసుంధరం, గలసిన గోడలుం జివికి గంపలఁ గాచిన వెట్టిసొట్టలీ, వలు చిగిరెంత గంటగమి వాతులుగప్పిన పూడు పాఁతరల్ ... వేం పంచ 1 467

వెల వి (క బెలె త విలై) 1 కొనువస్తువున కిచ్చెడు విలువ మూల్యము, క్రయధనము

క. ఇలకు వెలగా హిరణ్యం, బలఘుమతీ మాకు నొసఁగు మనుటయు .. భార. అశ్వ 4 189

గీ జీవహింస యెన్నండును జేయవనఘ, ఘురులు నంపి తెచ్చిన మాంస మొనర విలిచి, తగిన వెల కమ్మి బ్రతుకుదు ... భార. అర 5. 38

ద్వి ఏ మేడ దేశంబు లేలుట లేడ, భూమికి వెల యిమ్ము భౌమీశమాకు .. రం. రా బాల. 16. పా 14. నం

వ .. తపస్వులకు నూఱువురకుం బ్రోలునాంటి బబ్బర వాఁడు పన్నస్రలు దగువెలకు విలిచి కొని ... ద. భా 1281 9

సీ విలువనా జిట్టినా వెలయన రోయన వెలయుచు మందును విక్రయంబు.. అం. భా. 2 287.

2. పందెము

ఆ. వాదులానితోడ వాట్లనితోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటమేటినితోడ నడియరి తోడను, వెలకు నెత్తమాడ వెరవుగాదు ఉ. హరి. 3. 112.

వెలఁగ వి (క బెళల, త. విళవు.) కపిత్థము, వృక్ష విశేషము.

చ. .. తత్పదములఁ దోకయున్ బిగయఁబట్టి చెలంగి వెలగ మ్రానితోఁ, బదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు వేఁగ రక్క సున్ భాగ. 10. పూ. 435.

సీ. వెలఁగపండులు పుల్లవెలఁగ పండులు మోవి పండ్లు వంకెనపండ్లు బలుసుపండ్లు . కాళ. 3 99

ఆ పిలికి పూలు బూతపిల్లు లేనికకొమ్ము. లలరుఁ దేసె పెద్ద వెలఁగపండ్లు, వెదురుఁ బ్రాలు ఊతి పదనికల్ గసగసాల్, జల్లి మెకపుఁ జాలుఁ జాలుపప్పు. యయా 1. 31.

వెలఁగొను స క్రి (వెలన్+కొను) వెలయిచ్చికొను, విలిచికొను

ఉ. ఆసలఁ బెట్టి యేచు వసువంచు వచింపఁగ నేల సంతతో, డ్భాసి నిజాభిజాత్యమునఁ దద్వసువున్ వెలగొన్న మోహసంవాస పదంబు దారమణి వారక తు క్రీమతిం జనించె . వసు. 4 111.

(ఇట వశము చేసికొన్న అని భావము.)

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను వేశ్యలు, శ్రీలఁ గుబేరుని జెనకెడు వైశ్యులు . కుచేల 1 23

(ఇట పోలు అని భావము )

వెలఁది విశే (త వెళిదు) 1 నిర్మలము

గీ ... కుప్పతిలు చుట్టుఁగొండపైఁ గొనలుసాఁగి, వెలఁది వెన్నెల తెల్లడ వెల్లివిరిసె, శ్రీరం. 2 256.

ద్వి సలలిత శశి కాంత చంద్రశాలలును, వెలఁది ముత్యంబులు వెలయు వాకిళులు ... ద్వి హరిశ్చ. పూ 178

సీ ఓలి నన్నింటి సద్యోఘృతంబులు నించి వెలఁది పట్టున వర్తులలవరించి ...

గీ .. యందముగ నివాళించి రయ్యవని పతికిఁ, జారు కంకణ ఝణఝణాత్కార మెసఁగ . భోజరా. 2 96.

2. తెల్లనిది, ధవళము.

గీ చలువ లందిచ్చె నొక చెల్వ వెలఁది నవ్వులుత్తరీయము లందుచే నాడియ మూల్య, భూష ణంబులఁ గైసేసె బోలఁతి యొకతె ... దశా. 6 27.

ఆ చెలువ యొకతె చలువ వలువచేఁ దడియొత్తు, మగువ యొకతె సొగసు సిగయొనర్చు, వెలఁది చందనంబు వెలఁది యొక్కర్తుమై, నలఁద నొకతె ధూపములరఁజేయు. ఇందు. 5 26.

ద్వి. దళుకొత్తు వెడఁదడెందము మీఁద జిగుగు, వెలఁది జన్నిదములు విలసిల్లుచుండ ... ద్వి పరమ. 3 244. పా 12 పం

3. మేలైనది

సీ. వనసమాగమమునఁ జవులు వక్కాణించి మించఁ జాలు వెలంది మిన్నగములు ... వసు 6 72.

(నారీ రత్నముల సముదాయములు అని యర్థాంతరము)

క. సికఁజుట్టె విరులొక్క, సికతామయనితంబ వెలఁది కస్తురి నొక్క వెలఁది యలదె...సారంగ 2 192.

4 ప్రసన్నము, సంతోషభరితము

చ. ... పైపయి నద్భుత ప్రగుంభనము మనంబునం బెనుపఁ బల్కె నమంగు వెలఁది పల్కులన్ కా. న. 2. 102.

(నలపతమున ప్రియసఖి వచనములతో అని యర్థము.)

5. విశదము, స్పష్టము.

ద్వి. వలనొప్పఁగాఁ బోయి వచ్చిన తెఱఁగు, వెలఁదిగా నంతయు వినిపింపఁగోరి ... నవ 2.65. పా. 6. పు.

వి. 1. చక్కని యాఁడుది, ఆఁడుది, భార్య

గీ. వెలఁది సంకల్ప సోపాన వితతియందు నతఁడు మాడఁగ సంచరింతహారహంబు...నైష 2.87

క. .. శైవ శరాసన మెక్కిడి, యా వెలఁదిం బెండ్లి యాడు మా రఘురామా రామా.4.81.

సీ. ... ఎలనాగ కోమలి యింతి చెలువ చెలి వెలఁదుక మెలఁతుక వెలఁది మెలఁత. ఆం. భా. 2. 104.

గీ వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము, సొమ్ము విప్ప్రయోజనముగ నమ్ముసేఁత, యనెడు సప్తవ్యసనములఁ జనదుతగుల. భార. ఉద్యో. 2. 44,

సీ వెలఁదులు పదియాఱువేవురలో నెన్న సరిలేదు సౌభాగ్య గరిమ నీకు ... పారి 1 58.

గీ. చిత్రకారుఁడా తెఱఁగెల్లఁ జెప్ప విభుఁడు, వెలఁది తోడమచ్చ యేకాంతవేళఁ జూచి .... విక్ర. 3. 57.

ఆ. . వేయు వత్సరములు వెలఁదితోఁ రమియించి దశా 3. 62.

2. ధాళధళ్యము, తళతళ కాంతి.

గీ. ఈ వెలఁది యొడల్ పైఁడిలో వెలంది, యీనెలంత లలాటంబు లే నెలంత, యీసుపాణి రదశ్రేణి యేసుపాణి, యీబిడారు మృగమద శ్రీబిడారు విజ వి. 1 130

వెలఁదిమిన్న వి స్త్రీరత్నము, శ్రేష్ఠురాలైన యాఁడుది

వ. వేఁడివేల్పు వెలంది మిన్న వేనలి నలవరించుకొన్న సన్నజాజి విరుల సరుల పిరులంగడలుకొని ... ఉ రా 4. 163.

వెలఁదుక వి (వెలఁది+ఉక స్వార్థమున.) స్త్రీ. ఆఁడుది.

క. ... సౌరభమాలా, కలిత మధుమత్త మధుకర, విలసనమున నొప్పు వనము వెలఁదుక పొల్చెన్ మార్కం 1. 24

సీ అనయమ్ముఁ జెఱయిమ్ములను ద్రిమ్మరుచునుండు చలి వెలుంగు నమంగుఁ దెలియలేనయొ .

గీ ఇవ్వెలందుక కనిలవ యాడుచేడె లందఱును డెందముల నుబ్బి యాడుకొనఁగ నీలా 1 52.

వెలఁబెట్టు స క్రి. వెలయిచ్చికొను.

క కలిగిరిపో యిది మస నస, వెలఁబెట్టని భృత్యు లనుచు వెలఁదియుఁ దాను , గలకల నవ్వుచు నాట్యము, సలిపిరి కరడమరుతాళసహితము గాఁగన్ ప్రబోధ. 3 58

(వెలఁబెట్టని భృత్యులు = వెట్టి నౌకరులు.)

వెలకుఁజూపు స క్రి (వెలకున్+చూపు.) అమ్మఁ జూపు, విక్రయింపనెంచు

సీ. వెలకుఁ జూపవు పొన్న విరియంతగోవ్యమా యది యరంటులలోయ నయ్యోఁజుమ్ము ... కవిరా 1. 81

వెలకెక్కించు స క్రి. (వెలకెక్కు) ప్రసిద్ధినొందించు.

క ఆ రాజునుఁ దునుమాడక, పోకాడు పురంబునకును బోరాటమహా, ధారాట రథ మదద్విప, వీరాటవ పాటవంబు వెలకెక్కించున్. మద. 5. 76.

వెలకెక్కు అ. క్రి (వెలకు+ఎక్కు) ప్రసిద్ధిచెందు
చూ. వెలకెక్కించు

వెలగఅవుసేయు అమూల్యమగు
గీ. వెలఁ గఅవుసేయు కౌశేయములు గలు
గఁగ, మానమైనట్టి మైనమై నూనవేల
సారంగ 2 188.

వెలచాన వి (వెల+చాన) రో వెలఁది, వేశ్య
గీ. అప్పుడంబునఁ గామ సేవాశిథాన, యైన వెల
చాన మీఱు జయైక తాన శుక 210

వెలచే స. క్రి శుభ్రపఱుచు, తోము.
సీ. వెండి యెద్దెనలపై వెలచి తెచ్చిన పైఁడిం
పళ్లెంబు లాయత్త పఱచవరు నైష
6 108
(ఇది సానుస్వారమని చి ని, బ్రౌ, నిరను స్వార
మని శ. ర. సిద్ధారక ప్రయోగము లభింపలేదు
కనుక నిరనుస్వారముగా గ్రహింపఁ బడినది)
సీ. పుష్పాడికంబె బుష్పాడలోనఁ బోఁలిచి వెల
చిన చెంగల్వ విరులకంబె పి శకుం 4 146
సీ. విరహుల మర్మముల్ విదళింపఁ గరసాన వెల.
చిన మరునస్త్రు గుళికయనఁగ శివలీలా
విలాసము 1

వెలచెలువ వి (వెల+చెలువ) వెలచాన, రో వెలంది,
వేశ్య
వ. నిలింప పతి కొలువు వెలచెలువల కెలువంబులు
మెచ్చుని మెచ్చు లాఁడులు. ఉ రా 5. 248

వెలడు = వెడలు అ. క్రి నిర్గమించు, పైకివచ్చు,
బయలుదేఱు
క. వెలడు నెడఁ దెలివితోన,గున్నలువలపల
నుడియు శిఖలఁ గొమరుగు భార శాం 8 14.
తరువోజ వెలడు విట్టూర్పుల వెన నుచ్చలించు
వెలుపుఁ గలుగు నెవ్వీఁగుచుందోయి.
కు. సం. 5. 588

వెలతలిరుఁబోఁడి వి. (వెల+తలిరుఁ బోఁడి) వేశ్య,
రో వెలఁది
గీ. సంభవించెఁ గచాకచి సంగరంబు, చక్కఁగా
వేగ దిక్కుల జాట వేఁడు, దండహతు లొద
వెను వెలతలిరుఁబోండ్ల, తల్లులకుఁ దూర్పు తెల
తెలల్ చాయునపుడు. రా వి 1. 77.

వెలన = వెల్లన వి తెల్లఁదనము చూ. వెలనగు

వెలనగు అ. క్రి (వెలన+అగు) వివర్ణమగు కాంతి
రహితమగు
సీ. పాత్రావలోకనోపాయంబునకు నైన వెలనైన
దీపంబు వెలుఁగఁజేసె. కాశీ 4. 133

వెలనా(ల్నా)డు వి దేశవిశేషము.
క. వెలనాఁడు వేఁగినాఁడును, బులుగుల వాడ్పా
కనాఁడు పొత్తపి నాఁడున్, గల మురికినాఁడు
రేనాఁ, డలయక గముఁగొంటి నచటి యబలలఁ
గంటిన్ హంస 1 53.

వెలనేస్తకాఁడు వి (వెల+నేస్తకాఁడు) విటుఁడు,
బొజుఁగు
గీ. చాపమైనుండి యుచిత సల్లాపగరిమ, నుబుసుఁ
బోకల వొకకొంత యూరడించి, వెలఁబన్నెడు
తనకూళ తలఁపు వేఁడు, గానతేఁడని వెలనేస్త
కానిఁ జూచి ప్రబంధ 726.

వెలపడంతి వి భోగముచాన.
గీ. ముకుర పీఠావిధానంబు మొదలులేక, వెల
పడంతికిఁ గాతాదు విటునిఁ గవయ క్రీడా
1 186.

వెలపెట్టు అ. క్రి. (వెల+పెట్టు)
వ. భీమసథనం దన వనమువకుం జంగ కాయ
లకు వెలపెట్టిన గన(హ)స్తిమాడలు ఇరువది
20 ... దశా. 1211 15.

వెలపొలఁతి వి (వెల+పొలఁతి,) రో వెలఁది, వేశ్య
ఆ. మమత మూఢవిటులు భ్రమతురింతియ కాక
వెలపొలంతి కెందు వలపు గలదె. వైజ. 2.76.

వెలపోయు స. క్రి వెలగానిచ్చు
గీ. పడుచు పని చేసితివి రేఁగుబండ్లకొలకు, ముత్తి
యంబులు వెలపోయు ములుచగలఁడె జై
భా 5 58
చ. మసగొని రేఁగుఁబండ్లకును మౌక్తికముల్
వెలపోసినట్లు దుర్వ్యసనముఁ జెంది కావ్యము
దురాత్ముల కిచ్చితి మోసపోతి .. దా. శ. 7.

వెలమ[1] వి బ శూద్ర జాతిలో నొక యవాంతర
శాఖ, ఆ శాఖకుఁ జెందినవారు
వ. అందు (శూద్ర వంశమునందు)ఁ బద్మ
నాయకులన వెలమలనఁ గమ్మలన సరిసర్లన
నొంటర్లన బహుప్రకార శాఖోపశాఖా భిన్నం
బులైన మార్గంబులన్ ... భీమ 1. 81.

(వీరు మహాశూరులు, మిగుల క్షాత్రవంతులు.)

గీ. వరలుకరు లోక రెండువేలరసిచూడ,రాజులును వెలమలుం గ్రమ్మ ప్రజలు ఘనులు, గలుగు రాయలతోం జోరి గెలువ మనకు, వశమె యైన ఖుదా యున్న వాం డటంచు కృష్ణ. 3 26.

క. హారమౌళి హీర మచ్యుత, చరణాబ్జ మరంద ధార జాహ్నవి లోకే,శ్వరి తమ సోదరి యౌనట, వురి వెలమల భాగ్యమహిమ పొగడంగ వశమే. పాండు. 1 112.

(ఇట శూద్ర సామాన్యపరము )

వెలమ² వి. ధనము, వృత్తివిశేషము.

వ. ఇవ్వకవ్వర మద్దిగద్దగోరు గోరంట వెలమయులిమిరి మూంగ వేంగిన మొదలుగం బెక్కు తెలుంగుల ప్రూంకులు ... పి. శకుం 2 14.

వెలమండు వి. (వెలమ¹+వాండు.) వెలమ తెగకు సంబంధించినవాండు.

ద్వి. పరమేశ్వరుండు తనదాసలోంతరయ, వరు దెంచి వెలమండై యరి యప్పనంబు ... బస. పు. 4. 877. పం.

క ధనవంతుండై న శతహలి, యను వెలమని మీంద తేవి యన్యాయపథం, బొవరించి .. దశకు. 3 148.

వెలమనూళ్లు వి. బ. తెలిక జాతిలో నొకభేదము ఈ జాతిలోని భేదాంతరములు.

పత్తిపాలు, వరియూళ్లు, కుముదాళ్లు, మజ్జూళ్లు, పోవండ్లు, ప్రావకులు, ఉంద్రూళ్లు, అనుమగొండ్లు, అడ్డనూళ్లు.

వేగిశా. శ. A. D. 1086. Ep. Ind 6.

వెలమనంది వి శాకజంఘ, నేలవేములోని భేదము (వ్య. వి.)

సీ వెలమనంది చివికి వెలమనంగాం గాక జంగాభిధానంబు చనును ... అం. భా. 2. 66.

వెలమిటారి వి (వెల+మిటారి) వేశ్య, పణ్యస్త్రీ.

గీ. విటుల తళ్ళిబ్బులకుం గేరు వెలమిటారి, నగవు నేలివడాలు ... కలిగి చౌదంతి పొడమె నా జలనిధి యందు. దశా. 2. 228.

వెలయబ్బురము విశ (వెల+అబ్బురము) మిక్కిలి వెల గలది, అమూల్యము

సీ. వెలయబ్బురపుం గ్రొత్త విడి కెంపు రవగుబ్బి గలశాలి జిగివాటి గలని వెలయ ... ఇందు. 5 37.

వెలయూట వి (వెల+ఆట) 1 సురతక్రీడ, రతి.

గీ అంగరాగంబు దమ వెలయాటవంత, రంగ రాగంబు పొసంగెదు వప్పురంబు, గట్టివాలు పదంతులు వంతుచేతి, గట్టివాలున కొప్పింతు రెట్టివాని కవిశ. 1 1 22.

2 ద్యూతక్రీడ, జూదము.

గీ. ... పెద్ద వెలయాటం దెగ గెలిపించువారు. దశకు. 5 36.

వెలయాలు వి. ఔ (వెల+ఆలు; బ. వెలయాండ్రు, వెలయాండ్రురు.) రోవెలంది, వేశ్య.

క వెలందియు ధరణీ విభుండును, వెలయాలును దాసింగూడి విమలాకృతులై, వెలువడిరి యగ్గిగుండము, జలరుహాషండమున మండి చను వెంచు గతిన్ విక్ర. 6 133.

చ. .. జలారి కొల్వులోం, గల వెలయాండ్ర కెల్లను శిఖామణి వీవెకదా...ఉ. రా 4. 213

క. ఇల . వెలయాండ్రురు కలువు మగల విడువు నతులన్ కు. సం. 8. 165.

ఉ ఆ మహితాత్ముం డొక్క వెలయాలికి మిక్కిలి తాను గూర్చువాండై, మమత నెమ్మెలంగుచు ... విప్ర. 4. 42.

ఱుడంబడక క్రమ్మఱటి వేరా,స్వామికి వెగటుగ ననునట, యా మాటకె యాజ్ఞ వెట్టునంట

సీ. భవ్యకలవక పాదప పరిష్కృతాత్మీయ విపిన శీలనముల వెగటుంబూని ... హరిశ్చ వత 2. 18

6. కృత్రిమము, తెచ్చిపెట్టుకొన్నది.

వెలయించు స. క్రి (√వెలయు.) 1 బయలు పఱచు, ప్రకటించు.

క. నా పురుషత్వము గైకొని, వేపోయి దశార్ణ పతికి వెలయించిన మీ, యాపదలు దొలంగి చనంబోద, మూవుము పదినాళ్లయంత మావృత మొసపన్ . భార. ఉద్యో. 4. 387.

ఉ అక్కట యుగ్రసేనుని మహాత్మునిఁ బల్కుట సంగరంబునం, దెక్కుడు పౌరుషంబు వెల యించుటయే పలుకందలంచితివ్, స్రుక్కక నన్నుఁ బల్కుము విరోధి నొకండన కాన నీకు నీ యుక్కివ మెన్ని చందముల నోర్వక పోవునె వేయు నేటికిన్ హరి ఉ. 30

క. జనని సతీత్వము వంశం,బున విమలత్వమును దనదు భుజవీర్యము నా,తనయుం డిటు వెల యించునె, యని ప్రార్థనఁ బు కాఁగఁ బ్రాణమ్యతుఁడై మార్కం 8 27

2. ప్రసిద్ధి కెక్కఁజేయు.

గీ. తన మహత్త్వం బు భూమిఁ బఁ దాను వారి,పేరు వెలయింపఁ జాలు గంభీరమహిమ... హరి పూ. 1 22.

3 ప్రకాశింపఁ జేయు.

మ. మహి మున్నాగముశాసముఁడు సృజియింపం గుండలింద్రుండు దన్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుఁడు ప్రోవన్ మహా,మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ, బహుళాంధ్రోక్తిమయ ప్రపంచ మువఁ దత్రాపగల్భ్య మూహించెదన్ వసు. 1. 10.

క వెలయించు పట్టె యెకమణి, వెలుఁగారం గొనుము ... ఆము. 4. 283

4. కావించు

ఉ. ఈ యిల ధర్మరక్ష వెలయింప జనించిన యట్టి యాది నారాయణ మూర్తి వీవు ... విక్ర. 2. 64.

5. వ్యాపింపఁ జేయు.

క. ఆజ్ఞ వెలయింతె దిక్కుల ... విక్ర 4. 10.

6. కప్పు, ఆచ్ఛాదించు

సీ బ్రాహ్మి సంపాదించె భసితాంగరాగంబు మాహేశ్వరి రుద్రాక్షమాలఁగూర్చె, కౌమారి వెల యించె గజచర్మ చేలంబు వైష్ణవి తోలు దువ్వలువ మడిచె ... హ 4. 87.

7. పావనము చేయు, పవిత్రీకరించు.

క. కావున విను పాత్రము మేలై విహితాచరణ సౌమ్యమగుదానముభా,త్రీ వరదాత్రాదాతలఁ, దా వెలయించు భువన ద్వితయ రంజకతన్ భార క్షాం 1. 334

8 ఉల్లాసము నొందించు, సంతోషపఱుచు

శా దంతా ఘట్టిత రాజతాచలచల ద్గ్రావ వ్రయం గ్రాహముస్, కంతుద్వేషికిఁ గూర్చి శైల జకుఁ దద్గంగా ఝరాచాంతి సత్యంతామోదము మున్నుగా నిడి కుమారాగ్రేసరుండై పితృ, స్వాంతంబుల్ వెలయింపఁ జాలు నిభ రాద్వక్త్రుం బ్రశంసించెదన్ వసు. 1 7.

సీ.. గీ తన సహజ లక్షణములలో నెనసియుండ, నా సరోలక్ష్మి గర్భచిహ్నములు దాల్చెఁ, బరిణయము లేక కన్య గర్భమున కిట్లు, గాక వెల యింపవచ్చునె లోకములను నర. 1 83.

వెలయింతి వి. (వెల+ఇంతి) వారకాంత, వణ్య స్త్రీ.

చ సతతము బ్రహ్మ శర్వ మర సంయమిముఖ్యుల నాత్మ సామి వెలయింతిని మోహితఁ జేయలేక ప్రా,కృత జనునట్లు తాను దవగెన్నె నొపంగెను బంటుకోనమై వై జ 4 5.

మ...మాకలవి లాభ స్పృహన్, సువిలాసంబగు మే నొసంగు వెలయింతుల్ భోగ్యలే జ్ఞాన క,ల్ప వనీవల్లి కుతారముల్ సురభిమల్లా . భూ.2 58.

(ఇట్లే వెలయువిద, వెల తొయ్యలాఁడి మొ )

వెలయు అ. క్రి. (సం. విలస్ ) 1. ప్రసిద్ధికెక్కు.

క కడిఁది పగఱ నేఁ దెప్పఁగఁ, గడవంగా నీఁదఁ దలఁచు కౌరవనాథుం, డెడుఁ గాక యెంచు నిత్తఱి, విడువ దగునె యతని వలన వెలసిన వాఁడన్. భార. ఉద్యో. 4 65.

తే. ఒవరఁ దండ్రిచే లక్ష్మిఁ గైకొను వతండు, తండ్రిచేఁ గ్లేశములఁ బాసి తనరు వతఁడు, తండ్రిచేతన వెలయు నతఁడు మదీయ, కులము నందును లేకుండ వలయుఁ దండ్రి... మార్కం. 8 220

2 ప్రకాశించు.

(లక్ష్మివాక్యము) క.. మ,త్తుష్టి కర చరితులగుటఁ ద్రివిష్టప సదులకడ నిలిచి వెలసెద ననియెన్... భార శాం. 5 13.

సీ.. గీ. వెలయు నెవ్వాని యభిలాష విమలకీర్తి .. నైష. 1. 87.

౮ కలుగు, పుట్టు.

క. నలు గుణములు దమయంతికి, నలునకు దమ యంతి గుణగణ ములు జను లిమ్ముల బొగ డుట నిరువురకును, వెలసె మనోభవ వికార విభ్రమ మెదలన్ భా౦ అర. 2. 10.

సీ. క్రొక్కారు మెఱుఁగులఁ జుక్కల మెఱపును గలసి యుమ్మృగవ యి వెలసె చొక్కి భా రా అర. 2 25.

ఆ ఇట్టి తలపు లుడుగి యుంటికిఁ జనిసుఖం, బుండు మని పురోహితుండు పలుక, విని మనంబులోన వెలసిన వైరాగ్య, మగ్గలింపఁ బల్కితతని తోడ. జాహ్నవీ. 4. 58

4 వ్యాపించు

తే అతివ విను రంభకును గల యట్టి భయము, నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ, గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున. వెలయఁగల దది వెలయు శ్రీవలను గలుగు కళా 1.89.

5. బయలుపడు

తే వెలసి భాషింప సిప్పుడు వెరవు గాదు, తప నుఁడుదయించి క్రుంకునందాఁక సైచి, రాత్రి వచ్చిన కార్యంబు రాము నతికి, విన్నవించెదఁ గాక నే వెరవు తోడ భా రా సుం 164.

6. ఆవిర్భవించు, అవతరించు.

క. . నెట్టుకొనవలసి నిలిచిన, ఘట్టాంబిఁ గొల్వఁ గలుగుఁ గామితఫలముల్. భీమ 1 101

7. ఒప్పు.

తే . .పుడమి లోపల మిథిల నాఁ బ్రోలు వెలయు. నీలా 1 26

ము. తతయుక్తిన్ ఘన శబ్దముల్ వెలయ...దశా 1. 4.

8 ఉండు.

చ కలదు గదా మధారసము కంజదళాతులముద్దు పల్కులన్, వెలయుఁగదా హాలాహలము వీరల చిత్తమునందు ..భర్తృ. 2. 60.

సీ. ....గీ... నలువరాణి మహాత్మలో వెలయు గాక. మమ. 1. 5.

క వినువది నీ కొరు లెఱిఁగిం,చిన మదృత్తాంత మేన చెప్పుటకు మనం, బనుమాన మెనయు నైనను, విను చెప్పెద నేన తక్క వెలయ రిట నొరుల్ పి శకుం 1 186.

9 సఫలమగు

గీ అత్తలోఁ ఒరి ంఘునూను నంతికమున, కమసమ విలాసగరిమతో నరుగునపుడు, నల సునంద మహానంద మఱరబల్కె, నిలువు మెలనాగ నీ కోర్కె ఎలసె ననుచు ఇందు 5 164

10 పవిత్రమగు, పావనమగు

గీ ధర్మమార్గ ముల్లంఘింపఁ దగదుగాన, వలసె నిష్కృతి కులమెల్ల వెలసె నీక,తమున సుర ముని పితృ తర్పణములు సేయు, మరిగి జాహ్నుదా పుణ్యతోయముల వనఘ. భార శాం. 1. 163

క. ఎల్ల జగంబులు నేలిన, హల్లక హితజాటుఁడల్లుఁ డయ్యెడు నట నాఁ,యిల్లు వెలసె లోకంబులఁ, దల్లి రుద్రాణి యెట్టి ధన్యుఁడ నొకో. వరాహ. 6 82

11 అతిశయించు

క తొలు ప్రాయపు మగ కొదమల, తలఁపుల తమకములు మిగులఁ దను నెదురుకొనన్, జఱ జాతి జవ్వనము గడు, వెలసెఁ బ్రతిక్షణము వింత వింతగ నంతన్. కళా. 1. 28 (135.)

ఎఱ 1 అతిశయించు.

సీ. గీ. . వెలయు వేడుక వాహ్యాళి వెడలి వచ్చు. నమర నాయకుఁ గాంచి సంయమి వరుండు. దశా 2 19

2 ప్రసన్నమగు, నిర్మలమగు

క కురిసె సుర పుష్పవర్షము, హరిపై నప్సరస లాడి రాతోద్యంబుల్, మొరసెనుభస్ఫర్శంబై, తిరసెన్ బవనంబు దెసలు వెలసెన్ గలయన్. హరి. పూ 6 98.

వెలయెక్కు అ క్రి (వెల+ఎక్కు) విలువకెక్కు అధిక మూల్యమగు.

క నేరువరి పోహణించిన, హారము వెలయెక్కు శీల నతిశయముగ .. ప్రబోధ చం. 1. 27

వెలయెసఁగు అ క్రి (వెల+ఎసఁగు) విలువకెక్కు, అధిక మూల్యమగు.

గీ చూచుటకు వేడ్కలొనరించు సొంగువెలయు,
వెలయొసంగు జాళువా ప్రాంతఁ గలిమి నెన్న,
గన్న నైకపు దుప్పటి కేలువాలు, నలరు వల
రేని చెలువ్వాగె హొవుసుఁ బూని. ఇందు. 5 67.

వెలరారు అ క్రి. (వెలయు+ఆరు.) తెల్లనగు.

సీ జలధర ప్రకరంబు వలవలనై తోఁచె వెలరారి
దిక్కులు విశదమయ్యె. పద్మ. 9. 206.

వెలరు$^{1}$ వి తెల్లన, పాండిమము.

తే వెలయు కీర్తి ప్రతాపాధ్యు నిమ్ముఁ దలఁప,
యశము శౌర్యంబు గలిగిన ట్లలరు వెలరు,
గాకయును నను మత్ప్రేక్షఁ గాంత నేలు, విర
హమున కోర్వదను వ్యంగ్య విభవమలరు.
వరస. 2 142.

వెలరు$^{2}$ = వెలలు అ క్రి వెడలు, బయలుదేఱు.
(ఈ రూపము కుమారసంభవముననే కానవచ్చు
చున్నది)

గీ. తమ ముఖంబులు.. వెల్లనై పద్మ షండంబు
వెలరి చనియె కు. సం 9 286.

మ. తలుకొత్తెన్ దరహాస మాననము నందట్టూర్చి
పోమేను ము,తపలీల్ గ్రక్కునఁ బర్వె లోల
నయనాంభోజాత పత్రంబులన్, వెలరెన్
ఘోరవనమ్మదాశ్రు జలముద్వేగంబు రాగం
బుగా, నెలమిం జిత్తము తక్షణంబ రతిశాత్మ
శావశారంబునన్. కు. సం 9 247.

సీ. అలికలభములు . . మలయానిలాహతి వెలరిన
పుప్పొడిఁ బొదివి మేనుల వింత పూఁతగాఁగ.
కు. సం 825.

వెలరువాఱు అ. క్రి (వెలరు+పాఱు) 1. తెల్లనగు.

సీ. ఉదరస్థుఁ డగు బాలు నుజ్జ్వల కాంతి దావెలిఁ
బేర్చునన మేను వెలరువాఱె ... నృసింహపు.
3. 131

2. వెలవెలఁబోవు, వివరమగు.

తెల్లనైరను పలుక జగతి, నిలుపగతి దీ. కలి
కలు వెలరువాఱె కు. సం. 8 186.

వెలరువోవు అ. క్రి. (వెలరు$^{1}$+పోవు) వెలవెలఁ
బోవు, వివర్ణమగు

సీ ఉద్యానములు వాపికోదకంబులు లేక వృక్ష
వాటంబులు వెలరవోయె .. కాశీ 5 287.

వెలలు = వెలరు$^{2}$ అ క్రి 1. వెడలు, బయలుదేఱు

చ ... ఇంద్రుఁ డీటవా,కిలి తలుపుల్ ప్రగాఢ పరి
కీలిత ముష్టిహతిం బిగల్చి వే వెలలుము కయ్య
మిమ్మని సవేగ సముద్ధత సింహనాద సం,క
లితము గాఁగఁ బిల్పుటయుఁ గ్రక్కున వెల్వడి
యెన్ మహేంద్రుఁడున్. హరి ఉ 4 18

క తెలిమొగము నందు లోలా,తుల పాలపం
బమరు నా చకోరముల తులా,మల శశిబింబ
ములోఁబడి, వెలలక చెలరారుచుండు విధమున
సతికిన్ కు. సం. 8 309.

చ చిలుకలు వల్కునో చెవులు చిల్లులు వోవఁగ
నంచు నెప్పుడున్, వెలలఁడు నందనోపవన వీథు
లకై. నైష 4 24.

2. చొచ్చు, ప్రవేశించు.

సీ నలుగు వెట్ట నురంబుకుఁ బూవ చమ్మలు బలిపి
క్రిక్కిరియఁ జే వెలల దపుడు...కకుత్ 3 70.

3 అతిక్రమించు, కడచు

క ఇలువాడి ముగ్గులిడి కూ,రలు గూళ్లమరించి
యేల రాఁడాయెనొకో, వెలలిం ద్రొద్దని యట
నీ, చెలియలు నేఁ డెదురుఁ జూచు సేవించుట
కున్. వే. పంచ. 4. 56.

వెలలుచు = వెడలుచు న క్రి (√ వెలలు.) వెడలఁ
జేయు. (శ. ర.)

వెలవ వి (సం విలేపి) కాఁపుడుగంజి

సీ యవలు వగ్గుగ థేను నివహోవఁ ద్రొక్కించి వెల
వయ తెఱఁగు మాకలన కాఁచి ... భార.
అను. 8. 48.

వెల(లు)వడము వి సస్యవిశేషము.

ద్వి. వెలవడం బుడివోయె వెరఁగయ్యె వరగ ...
విష్ణు పు. 3 2. (శ ర)

వి ధాన్య విశేషము.

గీ. నీ జనని పుణ్యజన వర్ణనీయ సాధ్వి, నీ జనకుఁ డెన్న నభిమాన నియత ధనుఁడు, నీ నగరు కోటకేఁగకు నిలువరాని, దయ్యు వెల్లాటకత్తె వీ కాటయరిది శుక 1. 316

**వెల్లాటకము** వి. (వెం+ఆటకము) ప్రసిద్ధి
గీ. సంభవించిరి గంధర్వజాతి ననినఁ, గలితనం జేల వెల్లాటకంబు సేయ...భీమ 1. 88.
(శ. ర. పా 'పెన్నాటకము' ముద్రి పా.)

**వెల్లాపుఁగత్తె** వి. స్వైరిణి
శా...ఘనాళుల్ మింట వర్తిల్లఁగా, దూషించున్ తెలఁగున్ దటుక్కునఁ దటత్తుల్ దోఁచినట్లెల్లె వెల్లాపున్ గత్తె చరింపుచున్ సురభి మల్లా. మల్లభూ 2 84.

**వెల్లి[1]=వెల్లిక** వి (త వెళ్లం.) 1. ప్రవాహము
క. అని యూరడిల్లఁ బలికిన, విని యాతఁడు సంత సంబు వెల్లిం దేలెన్...భార. శాం. 1 282.
సీ కల్పాంతవేళ నేకటకంబు మునుఁగదు నింగితో రాయు మున్నీటి వెల్లి .. కాశీ 3. 103.
క. అల్లారు బెల్లమై గలు, గల్లున నదియలు మొరయఁగా వేడుక పెన్, వెల్ల మునిఁగించె ధరణీ, వల్లభనందనుఁడు చూచువారల చూడ్కుల్ రాఘవ. 2 5.
2 పరంపర.
క. కవిసినఁ గడంగి యేనును, గవియించితి నంప వెల్లిఁ గడుఁ గ్రూరత ... భార. ఉద్యో. 4. 342.
ఆ కడలి యాకసంబు పుడమియుఁ దలుచగ, నంప వెల్లి పాదువఁ బొంపు మీఱ, యంధకుండు గొండ యల్లుఁడుఁ దార్కొని, యదరుపట్లు వ్రేటులాడు నెడల. అచ్చ. రా. యు. 348
వెల్లిఁ గలిపిన చింతపండు=ప్రవాహములోఁ గలి పిన చింతపండు; నిష్ఫలము.
గీ. మాటిమాటికిఁ జేసిన మందులెల్లఁ, జెల్లెఁబో వెల్లిఁ గలిపిన చింతపండు, నీట వ్రాసిన వ్రాలునై నెరయ వలదఁ, బోవు గాకేమి నెత్తురు పుట్టనేల. కాశీ 3. 111.

**వెల్లి[2]** వి (క బెళ్ళి త వెళ్లై.) తెలుపు, శుక్ల వర్ణము.
విణ తెల్లనిది, ధవళము, శుక్లము.
చూ వెల్లిమెకము

**వెల్లిఁజల్లు** స క్రి. (వెల్లిన్[1] + చల్లు) చెఱుచు, పాడుచేయు.
వ. తల్లిమాట యించుకంతయు విననొల్లక ప్రల్లదులై యెల్లధనంబు వెల్లిఁజల్లి బంధు జనంబులు నిందింప నాతతాయులై చిత్త విభ్రాంతిం దిరుగుచు. జాహ్నవి. 3. 12.

**వెల్లిఁబోవు** అ క్రి (వెల్లిన్ + పోవు) వ్యర్థమగు, నిష్ఫలమగు.
సీ. పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్ర భూరి సంపద వెల్లిఁ బోయెనన్న...ఉ హరి. 4 300.
సీ. మానక గుపిఎంచు మదన కోదండంబు నిష్ఠురతను దన్ను నేలఁ గలయ, నెప్పుడు జంకించు హృజ్జాత శింజిని గారవంబునఁదన్ను గాలిఁబోవ, మూరక విరఁబడు మారనారాచంబు దుండగంబునఁ దన్ను ధూళిఁగలయ, పనిలేని పని మిట్టిపడు మనోజపతాక, ప్రల్లదంబునఁ దన్ను వెల్లిఁబోవ. వరాహ. 4 - 21.
(ప్రవాహమునఁ బడిపోవుదని యర్థాంతరము)

**వెల్లిక=వెల్లి[1]** వి ప్రవాహము.
శా ఆ జాబిల్లి వెలుంగు వెల్లికలడాయన్ లేక రాకానిశా, రాజశ్రీ నఖమైన మోమునఁ బటాగ్రం బొత్తి యెత్తి యా, రాజీవానన యేడ్చె ...వసు 4 52.

**వెల్లికిలు** అ క్రి. వీఁపుక్రిందగు.
మ. తరుణీరత్న మొకర్తు వెల్లికిల నీఁదన్ గుచ్చి చన్ బిందియల్, గరమొప్పెన్ .. ఘటికా. 2 121.

**వెల్లిగొను** అ. క్రి (వెల్లి[1]+కొను) 1 ప్రవహించు
ఉ. ఆ లలితస్మితాస్య అలికామల కోమల చంచలాల సా, లోల విశాల సంస్ఫురిత లోచన దృష్టిరస ప్రవాహము, దోలిన పర్వి వెల్లిగొని యొక్కటఁ గ్రక్కున ముంచి ... కు సం. 5. 513.
మ ...వైరిప్రేరుర ముగ్రోద్ధతిఁ జీరి నెత్తురులు సర్వోర్వి నభోవిత్తటి, పరిణాహంబుల నెల్ల వెల్లిగొనఁ బైపైఁ జల్లిప్రేవుం బోదుల్ గర మాటోపముతో నతండు పారి నాకర్షించె హర్షింభుమన్. హరి. పూ 4. 87.

శా ఆమోదాశ్రు భరంబు వెల్లిగొన ... నైష. 5 137

2. వ్యాపించు, పచరించు.

గీ. శిరసు మకుటంబు సారెc జిత్తరువు గొలుప, గల్లములc గుండలద్యుతి వెల్లిగొనcగc, గలికి తెలిసోగ కన్నులc గరుణ చిలుక, జనవరుని బ్రోలి శౌరి సాక్షాత్కరించె. కవిక 6 180

3. పరంపరగా వెడలు.

ఉ. ఆంగను బ్రోత బ్రోcగుమును జెక్కున పాములువోలె శౌరిచే, సింగిణి వింట వెల్లిగొను చిత్రశరంబులు నూతునొంచి ..పారి 5. 16

ఉ వెల్లగు నమ్మహోరవము పేర్చ సరోజభవాండ భాండముల్, చిల్లులువోc బ్రచండ గతి సేన ధరాస్థలి యూనెనో యన, న్వెల్లిగొనంగ నేర్పుతిచి నిర్భయతన్ నడిపించె .. శాబ చ. 2. 71

4. మునుcగు, మగ్నమగు.

సీ. పుష్కలావర్త శాంభోధరంబుల వృష్టి విశ్వ ప్రపంచంబు వెల్లిగొనగ .శివరాత్రి 1 51.

5. అతిశయించు

క. తల్లియుc దండ్రియు బ్రమదము, వెల్లిగొనcగc గౌcగిలించి వేడివవలి, నుల్లమునర .. పారి పూ 7. 68

**వెల్లిగొలు(ల్పు)పు.** స. క్రి (వెల్లిగొను)

1. ప్రవహింపcజేయు.

గీ ఇట్లు శత్రుంతవునిc ద్రుంచి యివ్విధమున, నొక్కcడొక్కcడ తలపడు టుడుపcదలcచి, వివిధ బాణపరంపర వెల్లిగొలిపె...భార విరా 5 78

ఉ. పూచిన యొక్కపోcక నును బోదియcజేరి విలోకనప్రభా, వీచికలం దదీయ పదవీ కల శాంబుధి వెల్లిగొల్పుచున్.. వసుచ 2 28.

2. పరంపరగా వెడలించు.

సీ. సాత్యకి యత్యుగ్ర శరముల విందానువిందుల వెసc బరి విరతతనుc, జేయంగ వతనిపై నా యవంతీశులు వివిధాస్త్ర జాలంబు వెల్లిగొలిపి, విలు ద్రెవ్వ రథహయంబులు నొవ్వ సారథి దలcద్రెc బ్రస్ఫుటశక్తి కలపcజూప ... హరి ఉ. 2 51.

శా.. .పౌలస్త్యుcడున్, భల్లcబుల్ వడి వెల్లిగొల్పి సమర ప్రారంభవేల్ల ద్ధను, ర్వల్లీ జ్యాఘన నాదమేదుర నభో రంధ్రంబుగా .. భా. రా. యు 1480.

3. వ్యాపింపcజేయు

సీ. కౌమరు వెన్నెల వెల్లిగొలుపు కట్టాణి పూ, క్తి కముల గంధమాలికలు వైచి ... వరాహ. 8 111.

వ మరాళంబులు .. రోదోంతరం బంతయు నెంతయుం గలయ మలయు తను యమలంపుc దెలిదళుకుc జిలికి యది ముంయజంపుc గలయంపి చెలువ నలవరింప వందుc గుందనంపు రంగవల్లి కామతల్లికల యుల్లానంబు వెల్లిగొలుపు గుదుదంత కాంతి వల్లరులచేత నతిశయిల్లుచు. . ప్రభా 2. 105

అ క్రి ఆనందము సేయు.

గీ. ఉల్లమునకును జూడ్కికి వెల్లిగొలుపు, నా వరదు మోమునందు మనంబుc జేర్చు, ననుచు గీత రూపములుగా నాకు కవిత, నుతుల రచియించి పాడుచు నతcడు గొలిచె కళా 2 144.

**వెల్లితల** వి (వెల్లి[1]+తల) ప్రవాహ పురోభాగము, ప్రవాహమునకు ముందటి భాగము

గీ గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చౌటి పొర గాక చిట్టూట చోటు గాక, వెల్లితలగాక క్రిcదదల్ వేరుపురువు, రాళిపోటును లేని చారాటి నేల. విప్ర 2. 18

**వెల్లిదొట్టు** అ క్రి (వెల్లి[1]+తొట్టు) అతిశయించు.

ఉ ఎవ్వరమాట మమ్మెఱుcగ నీదు యథాకథిత స్వరూపమై, యెవ్వcడ వౌట విన్నెఱుcగ నీదను భావ్యతc దోcచియైనc దా, నెవ్వరిదౌటc దన్నెఱుcగ నీదు ధ్రువ బ వెల్లిదొట్టు నీ, ద్రెవ్వని మాయలో మునిcగి తేలెడు మీలము గామె యీశ్వరా కవిక 6. 182

**వెల్లిపొడుచు** అ క్రి (వెల్లి+పొడుచు) 1. ప్రవహించు

సీ గంగ యాతని మఖాగారంబుపై వెల్లివొడి చినవల్లి యద్భుత తపస్వి,యగు నమ్మహాత్ముc డయ్యమర తరంగిణిc గనుcగొని . హరి. పూ 8. 90.

(సువర్ణముఖరి) వ ఖిల్ల వల్లభుల వల్లియలపై వెల్లివొడిచినం దల్లడపడ కాశ 1 142

2. ఉప్పొంగు.

వ. పొంగి చింతాసాగరంబు వేగిర-బ వెల్లివొడిచె ననన్ మనుచ 3 9.

**వెల్లిమెకము** వి (వెల్లి + మెకము) సింహము.

ఉ వచ్చి యిదేమి చెప్ప కిటు వచ్చితి వప్పుడు కాలు పోతుతోఁ, బొచ్చెపు బొల్లివెల్లి మెకముల్ దమ బెబ్బులిఁ గూడి గూడెముల్, సొచ్చితివంగ జెంచులోక చొప్పున నూర్గురు వోయిరన్న వాఁ, డచ్చెరుపాటు సిగ్గు నొలయన్ వినుచుం దల ప్రేల వైచినన్. కఖు 4. 59.

**వెల్లిపడు** అ క్రి (వెల్లి¹+పడు) ప్రవాహమగు

శా .. కన్నీరు ము,న్నీరై వెల్లివడంగఁ గాలి కుసిలో నించావుచున్ గూరిమిన్. వేం. పంచ. 1 256.

**వెల్లివాఱు** అ క్రి. (వెల్లి+పాఱు) ఎడతెగక ప్రవహించు, అతిశయించు.

గీ పాడి దప్పిరి నృపతులు బలసెఁ గొంటె, మడఁగె దాలిమి మాత్సర్య మతిశయిల్లెఁ, జెల్లె దయ పాతకంబులు వెల్లివాఱె, గ్రమ్మె దుర్వ్యసనంబులు దిమ్ము రేఁగె వరాహ 7 31

క. నమదాశీ మీననంచా,రముచఁ దొలంకుచును ముఖ సరస్సున లావణ్యము వెల్లివాఱఁ గ్రేవల, నమరించిన పిల్ల కొలఁకులంగన వీనుల్ కళా. 7. 128.

**వెల్లివిరి** విశ (√వెల్లి¹) వెల్లడియైనది, ప్రకటితము.

క అలతైల బిందువయి నా, మెలఁకువ వెల్లివిరి యైన మేలగునే ని,ర్మల చరితుఁ డఖిన జాణుం, డలుగఁడె ప్రాణముల కింత యవరాధమునన్ ఉ హరి 5 198. (వీరేశ.పా)

గీ. వెల్లి విరిగాఁగ భూజను లెల్ల నెఱుఁగ ... దశకు 6 82.

క ముల్లోకంబుల జనములు, రోళ్లన్ రోకండ్లఁ బాడ రోయక మఱియన్, వెల్లివిరి గాఁగఁ దిరిగిన, గర్లకు వయగారి మెలఁకుకం గొని పోయెన్. వరాహ. 7 22.

**వెల్లివిరియు** అ క్రి (వెల్లి¹+విరియు) 1. ప్రవహించు

క. ... మదీయ మూర్ధము, వెంటంగా నభ్రగంగ వెల్లివిరియుటన్ హర 4. 57.

గీ పిడుగుపడ్డ చెట్టంగునఁ బుడమిఁ ద్రెళ్ళి, సొమ్మ గొని కొంతవడికి లోనుమ్మలికల, వెచ్చ నూర్చుచుఁ దెప్పిరి వెల్లివిరియ, వేఁడి కన్నీరు గొనగోళ్లఁ దోఁడుకొనుచు అచ్చ. రా. యు. 360.

2. ఉప్పొంగు.

గీ. పెరిఁగి పాండవాంబుధి వెల్లి విరిసినపుడు, విలువ విమ్మగు దీవిగా నిన్నుఁ దలఁచి...భార. భీష్మ 1 59. (ప్రవహించు అని శ. ర)

వ ... ఆనంద ప్రవాహంబుల్లంఘున వెల్లివిరిసిన కళంబున . . కాశి 1 100.

3. వ్యాపించు

సీ చనుకట్టు విపఁ జుట్టును ఘన స్తనకాంతి జల్లించి యురముపై వెల్లివిరియ ... వైజ. 1 181.

చ ... అ,చ్చెరువుగఁ బోయి వెల్లివిరిసెం గపి వాహిని లంకచుట్టునున్. భా రా యు 495

వ జగదండ కర్పరంబునఁ గుంటుపడి మగుడు వేగం బడరఁ బుడమికి డిగి వలుగడల వెల్లివిరిసి పెల్లగుచుం జాలుకొని యిద్దరులు నేరుపడునుద్ద విడి నేలబడి వెడలి ... చం, రా 3 25.

4. వెల్లడి యగు, ప్రకటిత మగు

ఆ. నీ కడింది లావు నే నెఱుంగనె వాలి, కోఁకఁ జుట్టి కడలిఁ ద్రోయుటయును, జెఱను బెట్టి వేయి చేతుల యొకిమీఁడు, విడుచుటయును జగము వెల్లివిరిసె అచ్చ రా. యు 500.

5. వృద్ధిపొందు, అతిశయించు

వ. ఇట్టి మాయావులున్న చోట సత్యంబు మూలఁ బడి కల్ల వెల్లివిరియుఁ బింగళకుండును మదోత్కటంబు వడువునఁగు మంత్రి మంత్రతయంత్రంబులకుం దగులు వాఁడుగాఁడె. వేం.పంచ.1 580

6. చెదరిపోవు

వ . . జీవనంబులు విడిచి విమల జ్ఞానవశంబున ముక్తులగు పురుష రత్నంబుల చెన్నున నన్ను వదలి మిన్ను విడిచి వాయువశంబులై వెల్లి విరిసి చను మేఘంబులును . భాగ. 10. పూ 764

వెల్లివిరిసేయు స క్రి (వెల్లివిరి+చేయు.) ప్రకటించు.

క వనితల పురుషుల యెడఁ బుట్టిన యది వెల్లి విరిసేఁత డిమ్మరి తన మెట్టి నిక్కృష్టుండై నను .. భార. శాం 6 208.

వ. కంఠగతప్రాణంబు లగుజంతువులకుం గాలకంఠుండు గరుణా వశంవదుండై కర్ణోపకంఠంబుఁ జేరి యుపదేశించు తారక బ్రహ్మ మంత్రరాజంబు మాంతవంబున విని యెఱుంగుటం జేసి మధు మదోల్లాసంబున నది వెల్లివిరిసేయుచున్న వియోయవ విందిందిరంబులు మంద్ర స్వరంబున ఝంకారంబు సేయు. కాశీ 2 44

గీ ప్రౌఢ గోపాంగనలు తమ ప్రాఁతవలపు, వెల్లి విరిఁజేసి రిందిరావల్లభునకు ..జై.భా 3 76.

వెల్లివీఁగు అ క్రి (వెల్లి[1]+వీఁగు.) అతిశయించు, మిక్కుటమగు.

ఉ. ఆ సమయంబునన్ మదనుఁ డగ్గలికం గళికాముఖంబులై, భాసిలు తూపులన్ హృదయ పద్మము లక్ష్యము సేసి యేసినన్, గాసిలి శౌరికుండు తమకంబునఁ దన్ గనునన్నచేసి యు, ల్లాసము వెల్లివీఁగ సఖులన్ నిలువన్నియమించి గ్రక్కునన్. కృ శకుం. 2 124.

వెల్లిసూపు అ క్రి (వెల్లి[1]+చూపు.) ప్రవహించు.

క. హరిగిరి జల మనమున వత్సరరాగ రసంబు నిండి యుత్కటమై తత్పరి మీఁద వెల్లిసూపిన, పరుసునఁ గాశ్మీర వారి పౌరులఁ గప్పెన్. కు సం. 9. 256

వెల్లుల్లి వి (వెల్ల+ఉల్లి.) తెల్ల ఉల్లిగడ్డ, లశునము.

సీ పగిలి బీటలువాటి తగదెక్కెఁ గుబునంబుతో రంపు వెల్లుల్లి తునుకలట్లు...భీమ 4. 130.

సీ ఉటజాంగణమునఁ గాపునిచిరి తవుటితో వెల్లుల్లి పొగయిచ్చి వీతిహోత్రు పి. శకుం 4. 63.

వెల్లువ వి. 1. ప్రవాహము.

క...అతఁ డతని యరదము, మునుఁగంగాఁ జేసె బాణముల వెల్లువలన్.

క ఆ వెల్లువ శరజీవ్యాలఁ, ద్రావి ధనంజయ మహాగ్ని దరికొని కవియంగా వెగడొందెడు కురుబల, దావము శాంతవపుఁ డంబుదము క్రియఁగాచెన్ భార భీష్మ 2 44 45.

సీ అమృతంబు వెల్లువయని నిలింపాదులు మును కొని దోసిళ్ళ ముంచిక్రోల ... ఇట్టలంబుగ వెన్నెల నిట్ట నాడిచె విక్ర 6. 69.

చ. ఉదుగక తేరు చన్న దెస నూనిన చూడ్కులుఁ గగ్గెలంకులన్, విడువక పాటు నక్షుపుల వెల్లువ లూటిట లేని యూర్పులున్...గలిగి కుందెడు జానకిఁగాంచి కూరిమిన్. ఉ. రా. 6 309

2. వాహిని, సేన.

చ అలఘుమతిన్ మహా వనచరావళి దెబ్బది రెండు వెల్లువల్, గొలువఁగ నేగి వారినిధిఁ గొండల చేతను గట్టి లంకపై, బలువిడిసేవతో విడిసి బాహుపరాక్రములైన దైత్యులంగల హాములోఁ గులక్షయముగా నొనరించె మహామ భావుఁడై. వి. పు 6. 326

ఉ. కొమ్మ మొకంపు వెల్లువలు గొల్వఁగ వేగిర మేఁగుదెంచి నంద్రమ్ము కడన్ దగన్విడిసి రావణు తమ్ముఁడు శేగవచ్చినన్, రమ్మని ... యయా. 3. 28

3 పరంపర

క. బడలు వడి యసురబలములు, పొడవడఁగెన్విభుని బాణముల వెల్లువలన్...కవిక 2. 207

సీ చెక్కు టద్దములందు జిగి వెల్లువలు చిందు రమణీయమణి కుండలములతోడ...మనుచ. 3 71.

4. బృందము, మంద

క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువలన్నియును లేచి విచ్చలవిడితో, జెల్లా చెదరై పాఱెను, బెల్లుగనంబే యటంచు బెబ్బులి గాలిన్. భాగ. 9. 36.

5. ఇటిక గోడల యింటిచూరు. (శ ర . వా.)

వెల్లువగట్టు = వెల్లువపెట్టు అ. క్రి. (వెల్లువ+కట్టు)

1. ధారారూపముగా స్రవించు.

సీ. కలయ వెల్లువగట్టి జలజల ప్రవహించు శశి కాంతకాంత నిర్ఝరము జలము ... మనుచ 5. 88.

ఉ ... చెక్కులన్, వెల్లువ గట్ట నశ్రువులు వెల్వెలఁ బోవ మొగంబు .... దశా. 5. 128.

2. మడుఁగు కట్టు

సీ. నీళ్ళు వెల్లువగట్ట నికటాగ్రహార ధరాసురుల్ నారికేళములు గొట్ట ... శుక. 3 438.

చ వికచ సరోజ మధ్యమున వెల్లువగట్టు మరంద బృందముల్, ప్రకట వినోదకేళి నొక పంకజ గంధి విదిల్చి ... భాను. 2 60

**వెల్లువపెట్టు = వెల్లువకట్టు** అ. క్రి. ధారారూపముగా స్రవించు

చ కనఁ గలిగె న్విలాసములు కమ్మని చక్కెర లొలుకు పల్కులున్, వినఁగలిగెన్ సుధారసము వెల్లువపెట్టెడు మోవియాన నింపునను జెక్కుటద్దములు ముద్దుగొనన్ .. దశా. 2 308

**వెల్లెకి** వి వృక్షవిశేషము, ఒకానొక చెట్టు

**వెల్లెడ్లు** వి బ. (వెల్ల + ఎడ్లు) తెల్లని యాడుపశువులు. (మేకలు, గొఱ్ఱెలు, మొ ఈ యర్థము ప్రాచీన శాసనములందే కానవచ్చుచున్నది చూ. ఎడ్డు)

చేబ్రోలు. శా...6 ... వెలనాంటి గొంకయ శ్రీ మూలస్థాన మహాదేవరకు మాఘమాసమున పున్నమయు సుక్రవారమున సోమగ్రహణ నిమిత్తమున నఖణ్డవత్తిన్ దివియ యొక్కొంటికిం బెట్టిన వెల్లెడ్ల యెంభదియు ఇనిమిత్తమునన వీం శ్రీ కుమారస్వామి దేవరకు నఖణ్డవత్తిన్ దివియలు రెంటికిం బెట్టిన వెల్లెడ్లు నూఱును వీరం జేకొని ... ద శా 9 109.

1 స్వస్తిశ్రీ శకవర్షంబులు 1078 ణ్డగు నేంటి ఉత్తరాయణ సంక్రాన్తి నాండు తొంప్పి చెఱువుల ప్రోలినాయకు కొడుకు మల్లినాయకు ముదిపెలిచేతన్న 2 బోయుణ్డు తమతల్లి దండ్రులకు ధర్మువుగా కొట్యదొన త్రిభువన మల్లి శ్రీ కేశవదేవరకు అఖణ్డ దీపమునకు బెట్టిన వెల్లెడ్లు పంక్ప్రయేను పెద్దనన్న బోయిని కొడుకు పిన్ననన్న వీనిం జేకొని ... ద. శా. 6, కాణిదెవ. 686-(2.)

**వెల్వ** వి. సంఖ్యావిశేషము? ఒకానొక లెక్క?

చ. మఱియ నగఁబు ను డి పలుమాఱును రాముని: జేరుకొంచు వెల్వలు దశసంఖ్య దన్నుఁ గొలువంగ రణోచిత ఘోరవాక్యముల్, నలువుచు వార్పుటంబుల దిశావలయంబులు దల్లడిల్లఁగాఁ, జెలఁగుచు వచ్చెనప్పుడు సుషేణుఁడు భానుసుతుండు మెచ్చఁగన్. సీతావి. 2 32.

**వెల్వడము = వెలువడము** వి సస్యవిశేషము

సీ బడఁతి నివ్వంటి వెల్వడము కోర్కి ఫలించెనన రాజభోగమే యతిశయిల్లు . రసిక 1 48

**వెల్వడు = వెలువడు** అ క్రి. 1 (క) నిర్గమించు, బయలుపడు, బయటపడు

సీ... అతిక్రమింప, కుఁడగఁ బోక యెల్లొడఁ గూడు నిన్నాగభవన మెప్పాట వెల్వడఁగఁ బోలు. భార ఆది 1 114

సీ వారిపూరంబు వెల్వడి వచ్చి రుద్రుండు యజ్ఞకోలాహలం బాలకించి .. వరాహ 7 38

చ ఉవిద తదుక్తికంత చెవి యొగ్గక పోఁ బెనఁగన్విభుండు కేల్దవిలిచి చుట్టు నిచుక యొడన్ భుజముల్ వలగొల్పి బొమ్మనన్, సువదన వెల్వడం దిరుగ శ్రోణి భుజస్తన వేణికాభర, శ్రవణ కపోలముల్ వతిని సారెకు సోఁకుచుఁ దేల్చె నింపులన్ ప్రభా 5 41

(చ.) బయటకు వచ్చు.

ఉ విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్... భార. ఆది 2 63.

చ అనుపమ దివ్య శస్త్రధరులైన యమర్త్యుల కాహవంబులో. మొనయక కాలకేయులు సముద్రముఁ జొచ్చి దివంబులెల్ల న వ్వనధి నడంగియుండి బలవంతులు వెల్వడి రాత్రులెల్ల భూజనులకు బాధ సేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై భార. అర 3 8.

చ. ఇలుకలనైన వెల్వడని యీలువుటాత్రఁ డకుఁ జూఁపిక తెవై .. అము 5 70

2 బయలుదేఱు, వెడలు

మ .. వరవైతాళిక వందిబృంద జయ జీవస్థార శబ్దంబులున్, వెరవై పేర్చి చెలంగ వెల్వడియె పంప్రీతి న్నిజావాసమున్. హరి. ఉ. 4. 117.

మ. కలుచం గోళబిలంబు వెల్వడి యదః ఖడ్గాహిపై వచ్చుచో. నైష 5 157

సీ. విడుఁడని వీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ డాతాఁ గనుఁగొని గారవమున... ఆము 3 60

3. గాంభీర్యము విడుచు

క బలవంతుఁడుఁ బగవాఁడును, ఖలుఁడనఁగాఁ జాలువాఁడుఁ గపటోక్తులఁ దాఁ, గలయఁగ వచ్చిన వెల్వడి, కలవికొనిన యేనిఁ గీడుగాకుండదిలన్. కేయూర. 3 7

**వెల్వరించు = వెలువరించు, వెలువఱుచు** స క్రి

1 వెలువడఁజేయు, బయలుపడఁజేయు

(ఒక శాసనమునందు శకటరేఫ యుక్తముగా గాన వచ్చుచున్నది)

ఉ. నిగ్రహ మేది నన్ను ధరణీవరరూపము వెల్వరించు వాఁడు... భార. ఆది 3 160

గీ ఒక్కఁడడుగెత్తి గొరక వేయుచును డాఁచి, నట్టలిగి చెంకిగసి పీఁకఁ బట్టుటయును, మృగయులు దఱుఁ జని వెల్వరించి నిశిత, కాండములఁ జెండి రొక పెద్ద కాఱుపోతు మనుచ 4 49

2 బయలుదేఱఁజేయు

మ. ..వేశ్య నన్ను జెలువొందన్ బ్రీతిఁ గైసేసి యంత నిజావాసము వెల్వరించిన నరేంద్రా వచ్చి వేచిచ్చటన్ మార్క 8 181.

3. బయటికి బోఁజేయు వెడల నడఁచు

పంచచామరము ఇసీ యిసీ మొగంబు సూడ కిల్లు వెల్వరించినన్, వెపన్విసింగి పోవు సిగ్గు పీసమంత లేదు నీ, దెసం బనల్ ఘటించె దేర త్రిమ్మరి మఱిట్లు వచ్చి పారె పారె నన్నుఁ గెర్లఁజేయ రాక పొమ్మికన్ విప్ర. 4 58

మత్తాక్కర... గలతాన పతులును రాజు పట్టంబు గట్టిన పతియు నలియం బయ్యావల వెల్వరించిన నశ్వమేధంబు ఫలంబు.. యుద్ధ బెజ శాస

**వెల్వఱ(ఱు)చు = వెలువఱుచు** స. క్రి. వెలువడఁజేయు, బయలుపఱుచు.

సీ ...ఎన్ని నేర్పులనైనఁ బట్టదీగంటి వెల్వఱచుటకును, గీ. దతవు మల్లాడ మీకింకఁ దగదు... పరమ. 5. 23,

**వెల్వుచ్చు = వెలిపుచ్చు** స క్రి (వెలి+పుచ్చు) బయలుసేయు

ఉ వచ్చి తదీయ మందిరము వర్తనలెల్ల నెఱింగి యక్కటా, సచ్చరితంబు గల్గు సతి చాడ్పున ముద్దఱికంబు చూపుచు, న్నచ్చిలి రాత్రు లీ జఱభి మూఁడుజగంబులు ద్రిమ్మరుచుండె, వెల్వుచ్చక యున్న నా కొడుకు బోదఁ డెఱుంగునె దీని చెయ్దిముల్. కేయూర 3 223

**వెల్వెల = వెలవెల**

చూ వెల్వెలఁబాఱు.

**వెల్వెలఁజేయు** స క్రి (వెల్వెల+చేయు) వెల వెలఁ బోవఁజేయు, తెల్లఁబోవఁజేయు.

చ విఱిగినఁ జూచి నివ్వెఱఁగు వెల్వెలఁజేయఁగ కుత్స్థుఁ డేటు నేమఱక యిదేమొకో కులిశ మంత్రము తప్పు గొదంగినాఁడనో ... కకు 5 130

**వెల్వెలఁబాఱు** అ. క్రి (వెల్వెల+పాఱు.) 1 వెల వెలఁ బోవు, వివర్ణమగు

సీ అని యుల్లసము దోఁప నాడు మాటలకు వెల్వెలఁ బాఱుచును దైత్యవిభు తనూజ, కలఁగి రహస్య భంగ భయంబుచేతఁ బ్రత్యుత్తరం బేమియుఁ దోఁపకునికి, నిట్టటు గ్రుక్కుచున్నట్టిలా గరసి . ప్రభా 5 33

సీ ప్రాలేయ కిరణ బింబంబు వెల్వెలఁబాఱి యస్తాచలంబుపై నత్తమిల్లి ... కాశీ. 1 122

మ . . మోము వెల్వెలఁ బాఱన్ దనుఁగన్న తండ్రి గనిపల్కంబల్కు దొట్రిల్లఁగన్. ఉ రా. 1 101.

2 తెల్లపడు, వెల్లనగు.

ఉ ... ముచ్చట నూనెనల్ల చను ముక్కులు వెల్వెలఁబాఱు చెక్కులున్. ఉ. హరి 4 9.

మ ఇనుఁ డస్త్రాద్రికిఁ బోవఁ గొల్లగొని వేఁడే తేర నద్దీప్తి నంజన సంబంధజ బాంధవంబున రతి శ్రాంతాంగనా నేత్రకోణ ని కాయంబుల డాఁచి తద్దవళిమన్ దాఁబూనెనో చొప్పు మార్పననన్ వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరి మనుచ 3. 56

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ బాఱు ముఖేందు బింబంబు తోడ ... కళా, 3. 146.

వెల్వెల బోవు అ క్రి (వెల్వెల+పోవు) 1 వివర్ణమగు
చ కుల మపకీర్తిఁ జెంద జనకుండును వెల్వెలఁ
బోవ బాంధవావలి దలవంప.. ఉ రా 1.190
ఉ ... చెక్కులన్, వెల్లువ కట్ట వస్త్రువులు వెల్వెలఁ
బోవ మొగంబు... దశా 5 128
2. తగ్గు, తిలంచు.
సీ ... ఖండ విజ్ఞాన శతక్షత్ర శతులు.
గీ. తెలివి వెల్వెలఁబోవ నిర్మల మవళ్ళ, కోర
తృష్ణావలంబు చల్లార వంత, వనితరముగ
హృదాకాశమున వెలుంగు, మండితా ఖండ
చిచ్చంద్ర మండలంబు సీతాదా 1. 147.

వెల్వెలన వి (వెలన + వెలన) మిక్కిలి తెలుపు,
అధిక ధావళ్యము
చూ: వెల్వెలనగు

వెల్వెలనగు అ. క్రి. (√వెల్వెలన) వెలవెలఁబోవు,
తెల్లఁబోవు.
క కావున నీవును వగ వక, భావమ్మున సంతసిల్లి
వనువు కుమారిన్, నావుడు వెల్వెల నగుచున్,
హేవేరియు ముద్దుకూఁతు దీనత తోడన్.చంద్రా
6. 55.
ఉ త్రిదశులం కేమి చేటొ యని దీనత వెల్వెల నౌ
పురీందిరా, సుదతి వివర్ణ భావ మనుచుం గన
వచ్చెడు నాదు చూడ్కికిన్...ఉ.రా 4. 262

వెల్వెలుకఁబాఱు అ క్రి (వెల్వెలుక + పాఱు,)
మిక్కిలి వెల్లఁబాఱు, మిక్కిలి తెల్లవడు
సీ. విమతుల మోములు వెలవెలఁ బాఱంగ విమ
లాస్య మోము వెల్వెలుకబాఱె ... భాగ.10
పూ. 71.
సీ అలమి నెమ్మది మన్న యతివ లేవవ్వుచేఁ బలె
నాడతెల్ల వెల్వెలుకఁబాఱె...యయా 5 92

వెల్వెల్ల విశే (వెల్ల+వెల్ల.) మిగుల వివర్ణము
మ .. కురు భూనాయకు సేన ... నత్వరతన్
వల్గడఁ బాఱె నవ్విభుఁడు గర్వంబేది వెల్వెల్ల
గన్. భార శల్య. 1 302.
.. ఈ రాత్రి నీ, వింధ్యారణ్యమునందు
వర్తిలి తగన్ వెల్వెల్లగా వేగినన్. భా. రా.
రాల 261

వెల్వెల్లఁబాటు వి. (√వెల్వెల్ల.)మిక్కిలి వైవర్ణ్యము.

శా తాపంబుం బెడఁబాపి దుర్దమ విషాదంబుం
దిగం ద్రావి నిర్వ్యాపారత్వముఁ బోవఁద్రోచి
వగలుద్వాసించి వెల్వెల్లఁ బాటే పొంతన్
మెలఁగంగ నీక మదిశం దెల్లం దెగం బుచ్చఁగా,
నీ పెంపార్య జనంబు మెచ్చుప్రకృతి కున్మేషంబు
గావింపవే. నిర్వ 9 78

వెల్వొడుచు అ. క్రి (వెల్లి+పొడుచు) పొంగు.
సీ పదపల్లవంబునఁ బ్రకటిల్లు చదలేఱు కడలెత్తి
ధాత్రి వెల్వొడిచి పాఱ . కాశీ 5 112.

వెళలు=వెళ్లు అ క్రి వెడలు
సీ. దడదడ మన గుండె తాళి బొట్టదర గుబ్బలిపట్టి
పడుక యిల్వెళల దయ్యె ... కువల 2. 115

వెళుకు వి (సం విలాసః.) విలాసము
సీ చిత్తిరము కులుకు బెడఁగు వెళుకు గునుపు .
హొయ లనఁగ విలాస మొప్పుచుండు. ఆం భా.
1. 139.

వెళుపు=వెలుపు వి వెడలుపు.
సీ వెడఁద వెన్నుదుటిపై వెనురాకు వెళుపుతోదిద్ది
తీర్చిన పట్టె తిరుమణియును . వై జ 2 186
సీ అల జేష్ఠ కిరవగు వెళుపు మొగంబును బొద
కంత తలకాయ కుడితిగూనఁ, బోలెడు
బొజ్జయు .. చంద్ర వి 1. 90

వెళ్లఁగొట్టు స. క్రి (వెళ్ళన్+కొట్టు.) పోవునట్లు
చేయు, విడిపించు
గీ పరధరాధిపు భార్యకుఁ బట్టినట్టి, భూతముల
వెళ్ళఁగొట్ట భూభుజుఁడు మెప్పి దన పరి
ష్కార వస్త్రము ల్దనకొసంగి, యంపకము
సేయఁ దనయింటి కరుగుదెంచి హంస 3 104.

వెళ్ళఁగ్రక్కు స క్రి (వెళ్ళన్+క్రక్కు) వెడలఁ
గ్రక్కు, బయటికిఁ బ్రసరింపఁజేయు
సీ నుడిగాడ్పు తేరి నల్పుట్టుఁ జుట్టలు వెట్టెఁ
గడిఁది మటలు వెళ్ళఁగ్రక్కె నక్క ... ఉ.
రా 6 235

వెళ్లఁజల్లు స క్రి (వెళ్లన్+చల్లు) పాఱఁజల్లు
మ ... మణిప్రాప్తిక, న్ని వముద్రంబులు వెళ్ళఁ
జల్లఁ దలచున్ మేఘానురూపంబుగన్ దశా
3. 172

వెళ్లఁదన్ను స. క్రి. (వెళ్ళన్+తన్ను) వెళ్లఁగొట్టు,
తఱిమివేయు

గీ ... వెడలించె రొప్పెం, వీచెఁ దటిమెను దోలెను వెళ్ళఁదన్నె, నదఁగ నుచాటనముఁజేసె నసఁ దగుభవ. ఆం భా 3 119

**వెళ్ళఁబడు** అ క్రి. (వెళ్లన్+పడు.) 1 (కష్టము నుండి) బయటపడు.

క బడలిక లెంతయు నేను, బడుచులు నేఁడెల్ల వెళ్ళఁ బడుదుము దానిం, బోడగంటి వేని నీకుం, గడుపుణ్యము చూపుమనిఁ గరుణా పరతన్. వరాహ 12 35.

2. (పశ్వాదులు,) ప్రసవించు

(వ్యవ) నిన్నరాత్రి మా బఱ్ఱె వెళ్ళఁబడినది.

**వెళ్ళఁబెట్టు** స క్రి (వెళ్ళన్+పెట్టు) పైకి ప్రసరింపఁ జేయు.

సీ. వెళ్ళఁబెట్టునో పూర్ణ విధుకాంతి మొగమున దిగఁబాఱునో పైఁడి తెలివి మేన నిరం.4 91.

**వెళ్లఁబొడుచు** స క్రి (వెళ్లన్+పొడుచు.) ఈవల నుండి యావలకు దూసిపోవునట్టు పొడుచు

గీ ఒకఁడు కుంతానఁ బగవాని యురము గ్రుమ్మ, వెంటనే యాతఁ డీఁటెచే వెళ్ళఁబొడువ, వెలసె నిద్దఱు నిల్చిన నిలువు కదన, శాలికై కావడించిన కాను కనఁగ కువల 2 176.

**వెళ్ళనాడు** అ, క్రి (వెళ్ళన్+ఆడు) స్పష్టముగాఁ జెప్పు.

చూ వెళ్ళనాడించు.

**వెళ్ళనాడించు** స క్రి (√ వెళ్ళనాడు) స్పష్టముగాఁ బలికించు.

వ. తాను మాట పట్టు పుచ్చుకొని తన కార్య రహస్యంబుఁ దెలుపుటయుం దెలిపి యేను మీదాన వగుట మీచేత వెళ్ళనాడించుకొని మీ కుపకారం బెక్కించి విడుచుటకు వచ్చినదని చెప్పి ... ప్రభా. 4. 31.

**వెళ్ళించు** స. క్రి. (√వెళ్ళు) 1 వెడలఁజేయు, వెడలఁగ్రక్కు.

మ. ఇనుఁ డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సంబైన యన్నంబు స,య్యాన వెళ్ళించి పవిత్రుఁడైన గతి ... భాగ. 4 92

2. పోఁజేయు, తీర్చుకొను

ద్వి ఇల్లు సేరిన మీఁద నీ పగ యెల్ల, వెళ్ళింప కున్న నే విప్రుండ నటవె ... ద్వి హరిశ్చ ఉ. 990. సం.

**వెళ్ళు=వెడలు, వెలలు** అ క్రి. 1. బయలువెడలు

శా లావణ్యాంబులు నాభికూపమున వెళ్లందోడి ముద్భిజవ, ద్భావ క్షేత్రమునందు వంచు ఘటయంత్రంబో యనంగా జప,వ్యావృత్త ప్పటి కాక్షదామకము హస్తాబ్జంబునం దాల్చి వా,ణీ వామేక్షణ నారసింహునికి సంధించున్ వచో వైఖరుల్ వరాహ. 1 6.

ద్వి తివిరి పుట్టలువెళ్లి తిరిగె సర్పములు ... ద్వి హరిశ్చ. 1846.

ఉ .. ఒల్లిదపున్ వరాహములు భద్రగజంబులమీఁద నాదికోఁ, జెల్లగ నెక్కువాని కొన వెంద్రుకయొక్కటి రెమ్మ తీసినన్, జల్లన వెళ్లుఁబో చమురు చిమ్మన గ్రోవిని జిమ్మ కైవడిన్ సారంగ 1 71

2. బయలుదేరు.

చ సమధిక బాహు శౌర్యజిత చండవిరోధులు వెళ్లిరున్నత,తమ . భాగ 10 ఉ 844

శా. కల్లేఁబుల్ సవరింప కళ్వముల నెక్కంబూను రాహుత్తులున్. బల్లెఁబుల్ గొని యర్థభోజనము లజ్జన్ లేచు యోధాగ్రణుల్, కల్లన్ ఒల్కుచు నొంటిఁ బంచలనగళ్ళన్ వెళ్లు భూవల్లభుల్, బల్లింపం దలపోయు కూటమి దొరల్ బవ్వాడిఁ ద్వాడకిన్ రా వి. 50 4.

మ కుయివెంటన్ వెళ్లు కూనోర్యరు కూ,వ వితానంబన . ఆము. 2 48

3. పోవు

మ ఘనతాపంబు హరింప నోవ మనుచుం గానీ క్రియా ద్వేష మే,చినఁ గానీ హృదయేశుఁ జన్నులపయిం జిత్రింపఁగా నీతమున్, వనజాక్షుల్ నిరసింపఁగాఁ బనుల హైన్యంబుంచు మున్మున్న వె,ళ్లిన రీతిం బడుఁ ద్రెలి మౌక్తిక మణుల్ మెట్టించి దూరంబునన్ వరాహ. 4 35

చ. ఉరమున నేగుఁ గుండలి పయోధర ధారల నాను నెప్పుడున్, గిరులు కరుల్ రజో విహ్వతిశిం జను వెల్లఁడు వేల కూర్మ శేఖరుఁ డిది మేల చాల జనకలిఎత సౌఖ్య మటంచు ధారుణీ, తరుణి సిరంగరాయ వసుధావరుఁ జేరెఁగుమార మన్మథున్ వసు. 1 72

ఉ. విన్నన నేఁగు తామరల విందుకి లాతపు నీడ లెప్పుడున్, వెన్నెల రాచతాలఁ గని వెళ్లక నీళ్ల మునిఁగి యున్న వీ, మన్న లటంచుఁ జెంచెతలు మాటికి నమ్ముల నేసి నాటమిన్, మిన్నక సిగ్గువన్ గదలి మెల్లనఁబోవుదు రిండ్లపట్లకున్ యయా. 2 89

4 కడచు, అతిక్రమించు

ఉ. ఇంక శరీరవాయువు ధనేశ్వరుఁ డైన విధఁబు చెప్పెదం, బింకరుహ ప్రసూతికిఁ బ్రపంచ విని ర్మితి వేళ వెళ్లనా, తంకవిధాయి తీవ్ర సికతల్ వెదచల్లుచు నూర్పుగాడ్పు కూ, లకష సప్త సాగర జలంబులు తువ్వరఁగాఁగ రువ్వఁగన్, వరాహ. 7 7.

సీ. పురుడు వెళ్లక మున్న పూతన విషదిగ్ధ కుచ దుగ్ధముల నెల్లఁ గ్రోలి చంపె ... చిత్ర భా. 5. 172.

5 పుట్టు, మొలచు.

క మానిని యెఱుఁగవు గా కీ, హ్మానాయకు వ్రతము మాన్పఁగా నీతరమా, పసఁగదు కొమ్ములు వెళ్లిన, నే కాఁటదు మగుడఁ ద్రోయ నెవ్వండోపున్. రుక్మాం 5. 128

6. పైకి వచ్చు.

చ మెలఁక లోకింత గానఁబడి మోసులు మెల్లన వెళ్లి పోగలై, నెలకొని వ్రేళ్లు గోళ్లను జనించి చో కారములై మిటారి కెం, దలి రుకు కొమ్మ కట్టి ... సారంగ. 3. 257.

చ.... ఆ యన్నతోదరి రాజుచేత నుం, డిన బెడిదంపుఁ జాయల పిటెం బొరవెళ్ల జరిన దూసి గొబ్బున మెడమీఁదఁ బెట్టుకొని... సారంగ. 2. 233

వెవ్వేఱులాడు అ క్రి. వెవె యని యధిక్షేపించు

ద్వి. కన్ను లార్పుచుఁ జెవుల్ గత్తరించుచును. వెవ్వెఱలాడుచు వెక్కిరించుచును .. పండితా. పర్వ 571. పా

వెస వి (సం వాజః) వేగము.

వ. మనము వెసగల వాలరుల వేగంబ వుచ్చి. భార. ఉద్యో 1 37

ఉ వాయుజుమై వెసన్ బెకలి, వాయుగతింజని కూలెసాలముల్. సమీర. 5. 58

చ. . ఎ, క్కుడు వెస రాహు మస్తకము గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. ఆము. 1. 9.

క్రి. విఽ క్రియ. శీఘ్రముగా, వేగముగా.

శా. వేమాఱు న్నలయానిలుం డడరి యా వీటం బ్రసూనాన్వితా, రామంబుల్ వెసముట్టి యందలి యలివ్రాతంబుఁ బోటోపి ... విక్ర 1 86

ఉ ఆ దనుజాపహ ర్తయు భుజాగ్రశముల్ వెసఁ జాచి యంచితా, మోద వికాసవన్నయవ ముగ్ధ సరోరుహ పంక్తిఁ బూజల, త్యాదర లీలఁ జేయునమరాధిపుఁ గౌగిటఁ జేర్చె . . పారి 3. 6.

మ పవనాశ్వంబు హరింపఁగా మును జటా పాళిం జగత్ప్రాణ మూ, ర్తి వరోధించి తదశ్వముం గొనితెమ నీకే ప్రొద్దు దాని న్మెడన్, దవులం గట్టి ఖవీథి ద్రిప్పి వడి నాతం డద్దిఁ ద్రోయింప వీ, ని వెసన్ వచ్చెనొ కాక రాకెటుల దీంద్రించు న్నభ్రగాంకంబునన్ చంద్రా. 5 87

వెసనము వి (సం. వ్యసనం). వ్యసనము, కామక్రోధాదుల వలన కలుగు దోషము

క. తన కంటికిఁ బ్రియమయ్యెడు, ఘను నొక్కని వెంటవంటి కౌతుక మొప్పన్, మనసంటి కొఁగి లింపక, చన దింటికి దాని బల్వెసన మేమందున్. హంస. 1. 218

గీ. కంతు మాయల నుమ్మెత్త కాయఁ దినిన, వెట్టి తెఱఁగున వెసనంపు వెఱపువొడమి, చికిలి నెఱ వన్నె కాంద్రకు నివము లెత్త, వెసనిచరియించు వీఁట నా హేమరేఖ. హంస. 1 220.

వెసల వి. వంటపాత్రము, పాత్రము.

క. వడ్డింపఁగ నెంగిలి దొడిఁ, బెద్ద వెసల వంటకంబు పాయ విడఁ దగున్, వడ్డించు వతని సోఁకిన, వడ్డింపక డించి వార్చి వడ్డింపఁ దగున్, విజ్ఞా. 1. 78.

క వెస లలనామణి బంగరు, వెస లుల దొంతరలు డించి వినయము మదికిం, పొసఁగఁగఁ గంకణ రవములు, బొసఁగఁగ నారసి రసాన్నములు వడ్డింపన్ 2 152

సీ. పాటించి యా గడపకు వెలపట, పొదికిళ్లఁ దవుడు నిప్పును బ్రత్తిగింజలు నిడి యడ్డముగఁ జిట్టు బడిసి వైచి, వేఁపరెమ్మల పీళ్లు వెసల లోపల నుంచి గాఁపలు పురిటింటఁ గట్టి చేసి ద్వా 3 45

సీ వెసఁలో మూనాళ్ల వెన్నలుఁడఁగ నాఁడు కాఁచి డించిన నెయ్యిఁ గరఁగఁ బెట్టి... శుక 561.

సీ ఏమిరా తాఁజెడ్డ కోమటి వెనకయ్య చేతికి వెసల యిచ్చిన విధమున, మమ్ము మీ మతముఁ గైకొమ్మని చెప్పెదు ప్రాణికి మీ మతం బర్హ మగునె, స్వర్గవైభవము విసర్జించి యెవ్వఁడు జన దూష్యమైన పైశాచ వృత్తి, నీవలెఁ దాల్చురా నిర్భాగ్య . ప్రబోధ 3.29.

సా. తాఁజెడ్డ కోమటి వెనకయ్య చేతికి వెసల యిచ్చు = తాను చెడి యితరునిఁ గూడఁ జెఱచుట

# వే

వే1 న వేయి, సహస్రము, అనేకము, పెక్కు.

సీ విష్ణు నామంబులు వేయును నిత్యంబు వినినఁ బఠించిన మనుజుఁ డిహము, పందు . భార అను. 5 326.

క. వేసేతుల నిడుపగు బాణాసనము గుణస్వనోగ్ర మగునట్లుగ నుల్లాసమునఁ ద్రిప్పుచు ... హరి పూ 4 66.

(బాణాసురుఁ డీశ్వరునితో.) శా. దేవా కయ్యము తోడి వేడుక మదిం దట్టాడు మర్త్యుండు వే, త్రోవం జేతుల తీఁట వుతుమని కోరున్ దానవుం డైన నా,కివే చేతులు చేసితి కసిమి తిం కెట్లో ర్వ(న్) ... హరి. 5. 21.

క .. పతిసేన్నె హమ కామినులకు బలవంతము పెఱ నెయ్యములు వేయుఁ దత్సదృశములే. భార. ఆది. 6. 190.

క కలిగె నొక జాంబవతి వెన్నెలవడఁ బడెదేల వలపు నీతలవేగెన్, బులియకు వే నవతులుగల, బాలంతులచే పాటువడక పోరాదనిన‌న్ ఉ.హరి 3 115.

శా ... ఈ కంథచే, వేలతుల్ కనకంబురాలు విద్రుపన్ విశ్వంభరా ధీశ్వరా విక్ర. 2. 7.

(దీని యామ్రేడితరూపము ('వేవేలు'.)

క ఏవేళఁ జూచి నందన, శ్రీవాకిటఁ బగటివేళ శివయోగివరుల్, వేవేల సంఖ్యలుండెదరు ... హర 2 38

వేవెలుంగులదొర. వి (వేయి + వెలుంగులు + దొర ) సహస్ర కిరణుఁడు, సూర్యుఁడు

సీ ...తే... వేవెలుంగులదొర తోడు రేవెలుంగు. అము. 1 19.

వే2 క్రి. విశ. (సం వేగః.) 1 వేగముగ, త్వరగా

ఉ వెండియు వేఁడు బాణములు వే తొడిధర్ముజు నొవ్వనేయ .. భార భీష్మ 3 40.

ఉ. ఒరొఎక యింత లేని వికచోత్పల లోచన చిత్త వీథిఁ బల్లారవఁగ నీల నీరద శుభాంగుఁడు వే సముదెంచె ... పారి 1 112.

చ చతురతఁ జెప్పి యప్పుర మొసంగఁగ వేచని యాడి రమ్మనన్. ఉ. రా 2 284.

2. శీఘ్రముగా, వెంటనే

క ప్రముచ్చుల మూర్ధత్వమునం, బుచ్చి నరకవాస మునకుఁ జనిన తనయు వేఁ,దెచ్చెద మగుడఁగ వే నీ, కిచ్చెద వగపుడుగు మింక వేనియు నధిపా. భార. ద్రోణ 2 219.

క. ... ఈ యర్భకుపై, వే పడిన ఖలులు దహనుని, పైపున శలభములు పగిదిఁ బడిరి ధరిత్రిన్ భాగ 10 పూ. 462

మ .. పెలుచన్ గంటు పుటుక్కునం దునిసి వే పృథ్విం బడెం జాలె . ఆము 4. 8.

మ. ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీ గతిన్ వింధ్య గహ్వరముల్ దూఱఁగఁ జూచి తారచటఁ గాపై యుండుటం జాల నచ్చె రువై యెఱ్ఱని వింత చీకటులు వచ్చెంజూడరే యంచు వే,నొరిదిం జూతురు వీర రుద్రగజరా ట్పుద్ధాంత ముగ్ధాంగనల్ మను. 1. 89.

**వేంకటము** సం. వి. అ. పుం. పర్వత విశేషము, శేషాచల పర్వతము, తిరుమల

**వేంకటాచలము** సం. వి. అ. పుం. తిరుపతి కొండ

క. శ్రీ నయన కువల యుగళా, నూనతోయ్యాస్య యుతస్మితోజ్జ్వల ముఖదై, త్యానీత సురశ్రీపు న, రా నయనక్రమణ వేంకటాచల రమణా. ఆము 2 1

**వేంకటేశుఁడు** సం వి అ పుం 1 తిరుమలకుఁ బ్రభు వగు విష్ణుని యర్చావతారము, వేంకటరమణ మూర్తి.

సీ. ... గీ ఇల్లు విడనాడి శ్రీ వేంకటేశుఁడుండు, పర్వతశ్రేష్ఠమున కధో భాగమునను, దనరు చుండెడు కపిల తీర్థంబుచెంతఁ, జేరి స్నానంబు చేసి తత్తరమునను వేం. మా 1. 169.

2. వేదాంత దేశికుఁడను విశిష్టాద్వైత మతప్రవర్తకుని మఱియొక పేరు.

వ. ... మఱియు హయవదన పదారాధకుండై వేంకటేశుం డను నింకొక్క మనిషి . ఆము. 6 66.

**వేంకి = వేఁకి** వి. జ్వరము

ద్వి. చిచ్చుకు వేంకియు సీతుకుఁ జలియు, వచ్చిన భూవ్వంగ వచ్చునే యనఘ ... నవ 4 133 పా 20 పం.

**వేంచేపు** వి. (దేవతలు, ప్రభువులు మొ. వారి) ప్రవేశము.

సీ హరికి భూమికి నీళ కధికవస్త్రము నూతనాంబరాభరణంబు లర్పణములు, చేసి శృంగారముల్ చేసి హాటకరత్న దీధితు లొప్పిఁక తిరుచయందు, వేంచేపు చేయించి వివిధ మంగళవాద్యములు భూనభోంతరఁబు నెసంగ . వేం మా 2 112

మ. ... దరాం చన్మురజానకాది రవముల్ చెన్నొందఁదిర్వీథులన్ క. వేంచేపుచేసి వేశ్యా, పంచానన మధ్య లాడ బ్రాహ్మణవర్గం, బంచిత వేదధ్వనితోఁ, జంచద్గతి నడువనిల్పి జనపతి యంతన్ భార్గవ పురాణ. 5. 282

**వేంచేయు = విజయంచేయు** అ. క్రి. 1 (దేవతలు, ప్రభువులు మొ వారు) వచ్చు

సీ. వింధ్య వాసినిగల వేంచేసి సీపుత్త్రి నేను సింహాకృతి నెక్కఁజేని, గొనిపోయి దాఁచితి...ననియె. భక్తు. 12. 25.

గీ ఆకసంబున వేంచేయు హరికి సిద్ధ,సాధ్య చారణ గంధర్వ సంయమీంద్ర, వివిధ సంస్తుతుల్ చెవుల పండువులు చేసె, జయజయా రావములతోడ సకల దిశల. ఉ హరి 6 17.

క. వేంచేయుము నాయింటికిఁ, బంచ శరాకార యనుచు . భాగ. 10 పూ 1278

2. (దేవతలు, ప్రభువులు మొ వారు) వెళ్ళు, పోవు

మ నలునిం బంచి నగంబులం బరవుగా నా మీఁదఁ గట్టించ వే, వెలయన్ సేతువు లంక కా తెరువు నన్ వేంచేయవే ... రామా 7. 020.

గీ శివుఁడు మంథానగిరి తుంగ శృంగవీథిఁ, జెలువు మీఱంగ స్వారి వేంచేయు నపుడు ... ఉ రా 1. 260

క జననాయకుఁ డంతట నతి, వినయతఁ దిరు మాళిగలకు వేంచేసెద రో, యని కేల్మొగుచుచు వైష్ణవ, జనులన్ వీడ్కొలిపి చనియె జలకంబు లకున్. పరమ 3 51.

3 (దేవతలు, ప్రభువులు మొ॥ వారు) కూర్చుండు

గీ ఉరగ రిపు వాహనమున నొక్కొక్క వేళ, వేడ్క వేంచేసి మెఱయుఁ దిర్వీథులందు, ... విట్టలయ్య పాండు. 4 134.

4. (దేవతలు, ప్రభువులు మొ॥వారు) వసించు

సీ పీఠంబుపైఁ దీర్థ పెరుమాళ్లు వేంచేసి యున్న వారపచార మోసఁల్లు . విప్ర 3 77,

వ ఔద్దాలక ఋష్యాశ్రమంబున వేంచేసి యున్న వాఁడు శేష. 4 ఆ. (శ. ర.)

**వేంద్రపడు** అ. క్రి. (వేంద్రము + పడు ) కోపించు.

సీ తల్లికిఁ గలయట్టి దయలేదు నా మీదఁ దండ్రి యెప్పుడు చూచి వేంద్రపడును ... హంస 3 150

**వేంద్రము** వి వేఁడిమి.

క జడనుం దాపము నిద్రయు, నిడువేంద్రము తోడ నగయు నిట్టూర్పులు సందడిగొని వడి గొని మదిలోఁ, జిడి ముడిపడి కన్నుఁ గవయుఁ జిడిముడి పడగాన్. ఉ హరి 6 78

క. ... ఎటువలె, వే వచ్చితి రిటకు నెండ వేంద్రము చూపన్. మత 2 23.

విశ 1. అత్యుష్ణము, మిక్కిలి వేఁడిమియైనది
ద్వి. తండ్రి వాక్యములకై దారుణ శిఖల, వేండ్ర
మౌ వగ్నిలో విపధి లోనైనఁ, బడియెద విష
మైన భక్షించువాఁడ ... రం రా. అయో.
96 పా 23 పం
సీ. తిలకింప ద్వాదశార్కుల కన్న వేండ్రమై జల
జారి పండు వెన్నెలలు గాయ . దశా 3 44.
2 తీక్ష్ణము, వాఁడియైనది.
క ఉంగ్రా యథాధమనీ, తండ్రిఁగని తాళుకొంటిఁ
దగఁగాకున్నన్. వేండ్రం బగు కత్తి నిఁకన్,
జీండ్రంబునఁ బట్టి నిన్ను ఛేదింతు సుమీ.
అహల్యా 1 97.
3. పరుషము
క. వేండ్రముగఁ దిట్టుటయు జవ,రాండ్రెవ్వరు
మున్నెఱుఁగని యంగద యొదవన్, గుండ్రాతి
రూపుఁ గైకొని, తండ్రీ పెక్కేఁడు లిందుఁ
దరలకయుంటిన్ అచ్చ రా బాల 148.
4. శౌర్యవంతము
శా. వాండ్రున్ వీండ్రును రాజులే యనుచు గర్వ
ప్రౌఢితో యాదవుల్, వేండ్రంబైన బలంబుతో
మథురకున్ వేవచ్చి . భాగ. 10 పూ 1522.
వేంపమ్రాను వి (వేము+మ్రాను.) ఒకానొక చెట్టు,
నింబము.
వేఁకటి=వ్రేఁకటి వి గర్భము, చూలు.
మ. . కాంత యొక్కట సంత్రాసమునొందుఁ
అన్నఁగవ యాకంపింపఁగా నిండు వేఁకటి
భారంబునఁ జేసి . కాశీ. 4 213
సీ. గొంతి మూఁడవపట్టి కోడలి నిండు వేఁకటిఁ
గాచినట్టి చే కత్తివాఁడు ... రా వి 2 71
క. .. వేఁకటి యగు లంజపడుపు విడువని
బ్రతుకుం, బ్రాఁకొన్న నూతి యుదకము,
మేఁకల పాడియుసు రోఁత మేదిని సుమతీ. సు.
శ. 10.
వేఁకధము వి. ఉపగ్రహము (శ ర)
వేఁకరి=ఏఁకరి వి (వ్రేఁ ము+అరి) కిరాతులలో
నొక తెగకుఁ జెందినవాఁడు.
గీ. . కోయచెంచు ... యేనాది యేఁకరి పట్ర
యెఱుకు, వేఁక .. యెనకరి యవఁదర్భేదము
లుగఁ, బొల్పును . . ఆం భా 2. 289.
వేఁకి (క. బేగె త వెక్కై) వి. 1. జ్వరము
క. బలదేవు మేను సోఁకిన, వెలిమిడిచే వేఁకి ఏఱచి
విటతాటముగా, నిలుగుటతో ములుగుటతో,
నలమటతో నావులింత లంతంతకుఁగాన్ ఉ
హరి, 6. 77.
గీ . వేఁకి దళచూపె దాహ మావిర్భవించె.
కాశీ. 3. 121.
సీ. విస్మృతియును సంధతయు వేఁకియు వవంగ,
నట్లు ప్రమాదజలైన యూరుజలకు రయముశఁ
దగుఁ బ్రతిక్రియ లొనర్చ. మార్క. 8. 327
2. వేఁడిమి
తే రుచిర శశికాంత రచిత సరోవరంబు, సెలఁత
సొచ్చిన మెయివేఁకి నీరులెల్ల, నింక వదనేందు
రుచి శిలలెల్లఁ గరఁగి, నిండెఁ దోడ్తోనఁ గొల
నతనుండు వినువ కు సం 5. 596.
క మలయానిలునకుఁ గదళీ, దళముల వీచిరొక
వేఁకి దనుకఁగ నా మై, నలమెడు మలయజ
కర్దమ, మలఁదిరొకో యుడుకులేవ నమ్మ
తాంకువయిన్ కు సం. 5. 640.
3 అగ్ని.
క. చక్కని ప్రకోష్ఠ పీడన, మిక్కిలి కమవేఁకి
నుటికె మినుమినుకు మవన్ . హర 8 74.
వేఁగఁబడు అ క్రి (వేఁగన్+పడు – స్వార్థమున.)
వేఁగు, పరితాపము నొందు.
గీ నమ్మఁ దగదు మొదల నమ్మి తారాత్మ కార్య
మున కొరులఁ బవిచి యందు పార, లరయ
నేసిరేని యడియాల మెఱుఁగక, వేఁగఁబడుట
యెల్ల వెట్టితనము కేయూర 3. 184.
వేఁగారు అ క్రి. (వేఁగు+అరు) భారమగు అరు
వగు.
ద్వి వేఁగారు గుబ్బల వ్రేఁకంబుతోడ, లేఁగౌను
దీవియ లివలివ లాడ . . ద్వి. పరమ. 2. 56.
పా 11 పం.
వేఁగి[1] వి (సం వ్యాఘ్రః.) 1 పులి
సీ. వేఁగి నావ్యాళ మెసఁగు అం భా 2.82
2.=వేఁగీ దేశవిశేషము, ఆంధ్రదేశములో నంత
ర్భాగము.
సీ. అటసాగి జమ్మిలోయఁ బడి వేఁగి దహించె ...
ఆము. 1. 36.

**వేఁగి² = వేఁగిస** వి పీతసాలము, ఒకజాతి మద్దిచెట్టు (వ్యు. వి.)

సీ. .. వేఁగి వేఁగిస యన వెలయుఁ బీత,సాలా ఖ్యగా ఆం భా 2 47.

ఆ. ... వేఁగి వేము మొదలుగాఁ గల భ్రూకులఁ, గావవగచు నొక్క కావవెలయు వేం. పంచ 4 522

సీ. . దేవ,దారు గుమ్మడుమోవి తపసియుఁ గుమ్మర పొల్కి గుగ్గిలమెట్టి పొల్కి వేఁగి హంస. 4. 11

**వేఁగినాఁడు** వి. (వేఁగి¹+నాఁడు) వేఁగిదేశము.

క వెలనాఁడు వేఁగినాఁడును, బులుఁగుల నాఁ డ్పాకనాఁడు పొత్తపినాఁడున్, గల మురికి నాఁడు రేనాఁ,డలయక గనుఁగొంటి నచటి యబలలఁ గంటిన్ హంస 1 58

**వేఁగిస = వేఁగి²** వి పీతసాలము, ఒకానొక చెట్టు. (వ్యు. వి.)

వ ఇప్పకప్పుర మద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి మూఁగ వేఁగిస మొదలుగఁ,బెక్కు తెఱంగుల భ్రూఁకులు...పి శకుం 2 14

**వేఁగు = భ్రేఁగు** అ క్రి. 1 (కాయభావ్యము మొ॥) తప్తమగు, భర్జితమగు.

(వ్యవ) కందులు సరిగా వేఁగక పప్పు బాగుగా లేదు.

2. తపించు, తాపము నొందు.

సీ తొల్లి దాక్షాయణితోఁ బాసి శంభుండు విరహ సంతాపాగ్ని వేఁగుచుండె.. కాశీ. 4 248.

3 పరితపించు, దుఃఖపడు.

ఉ.... విశాల నరేశ్వరుండు పు,త్రోద్భవ కౌతుకాను భవ మొక్కటి లేమికి వేఁగి వాక్యసం,పద్భుజ గేంద్ర సన్నిభుల బ్రాహ్మణులం బిలిపించి వారి తోన్. వరాహ. 2. 90.

సీ ...అవయముఁ బ్రతి,

ఆ వె కోటిలేనినాదు కొమరుడ కిప్పాటు, వలసె నకట యిది యవార్య మనుచు, వేఁగె వాని చావు వినియంత జిష్ణుండు, ఖండితారి పంక్తికం ధరుండు. రాఘవ. 4. 143.

ద్వి రాముని సతి దశరథరాజు కోడ,లిమ్మెగ జనక మహీపాలుపుత్రి, వివిధ సంకటముల వేఁగు చున్నదియు. .రం. రా. అయో. 139. పా. 11. పం.

4 కాలము గడపు

చ. .బానలను గ్రమ్మనఁ గూలఁగఁ ద్రోచెమట్టులు, న్వస నలుమూఁడె నేమిగతి వేఁగుదు నెక్కడఁ జొత్తుఁ జెప్పుమా. హరి పూ 5 214.

5 కాలు, దగ్ధమగు

ఉ ఏల మృగాక్షి నాకులుకు లేఁటికి నమ్మవు కూలి కొండరా, చూలి వివాహమైన యెడశోభన మంగళ వృత్తి నున్నచో, వేలుపు లెల్ల నంగ జుఁడు వేఁగుటఁ జెప్పినఁ గామునిచ్చునా నీలగ కాంతుఁ డీవిధము నిక్కమటంచు నభంబు ప్రయోగఁగన్ వీర. 2 155

6 చచ్చు, నశించు.

ఆ బ రుణాత్మకుండు తారక దైత్యుండు వేఁగు ననుచుఁ జెప్పి వీడుకొలిపె వీర 2 70.

7. క్షీణించు.

సీ మానుషంబులు గ్రాఁగి మత్సరంబులు వేఁగి వెచ్చువారును మూఁక విచ్చువారు.. వరాహ 3 47

వి. భారము, బరువు

చ గొరగొర లాడుచుం బుడమి గ్రుచ్చుచు బల్వెర తోడ నోఁగాఁ, బిఁదికిఁ జూచుచుం గడుపు వేఁగున వంకర గాఁగఁ బోవుచున్ ... చెన్న. 2. 20

**వేఁచిపోఁత** వి (√వేఁచిపోయు) వేఁగించుట, తపింపఁజేయుట

క. వారలకు వగ్రగణ్యుం, డైరవి సంవర్త సమయ హవ్యవహ శిఖా,దారుణ కరముల భువనము, లిరేడుమ వేఁచిపోఁత నెఱిఁగి నభయులై వరాహ. 6 108

**వేఁచిపోయు** న. క్రి (వేఁచు+పోయు) వేఁగఁజేయు, తపింపఁజేయు.

చూ వేఁచిపోఁత

**వేఁచు** న క్రి (√వేఁగు) 1. వేఁగఁజేయు, భర్జించు.

గీ. బిట్టుగాలిన పెనములఁ బెట్టవేఁప, మిట్టిపడి యుక్కైమూర్ఛిల్లునట్టివారఁ...ఉ. రా. 3. 328.

సీ ఒసర వేఁపఁగ నెందు సెనఁగ లెత్తఁగఁబోవు నూంకిఁ బొమ్మన్న మలుకుఁ జెందు .. శుక. 2. 208

2 తపింపఁ జేయు

ఉ. పూఁత పసిండి వఁటి వలపుం బచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యి తెఱఁగు లేమ సురాంగన లెల్లనిట్టినీ, చేఁతకు మెత్తురమ్మ దయ సేయక తిన్నని మేను వెన్నెలన్, వేఁతురటమ్మ యింత కనువేఁదులు సెల్లు నటమ్మ యింతికిన్ మనుచ 8 33

ఉ ...మున్ను వారి ను,ద్వేజక తీవ్రతేజమున వేఁచిన సాహసిగావ వేగ నం,భోజ విరోధి సేరెఁ బరభూధర కందర కోటరాంతమున్ వసు 6. 40

ఉ...దురంత నిరంతర తాప మెంతయున్, మెండయి సర్వ జంతువుల మేనులు వేఁచఁ దొడంగె న త్తరిన్ ఇందు. 3. 95

3. పరితపింపఁ జేయు.

మ. .ప్రాణసఖవై సాంపీ తుదన్ యుక్తమే, విర సంబైన వచః ప్రపంచవముచే వేఁపంగ నిందాక నిన్, సరసత్వంబునఁ బ్రౌఢవంచు మదిలోఁ జాలంగ నే నమ్మితిన్ ప్రభా. 3. 97

వేఁట వి (క. బేటె త, మ. వేట్టై.) 1 మృగయ, అడవిలో మృగ పతుఁలను సంహరించుట (ఇది మృగముల వేఁట, పదువేఁగ, గంటవేఁట తెరవేఁట సివంగి వేఁట మొదలగు పలు విధములు గలది )

చూ గంటవేఁట, పతులఁవేఁట రెండు విధములు- పాదివేఁట, విడివేఁట

ఉ. వేఁటికి నొప్పుఁగాక రజవీచరు వీ డెటులైన నెల్లి పో, దాఁటు కవాటముల్ విఱుఁగఁ దాఁచుచుఁ జేతుల తీఁటవోవ మై,తీఁటలు వుచ్చి రక్కసులఁ దీర్పుట రాముఁడొనర్ప నున్న పె, వ్వేఁటకు రావణాది మృగ బృందముఁ దార్చు టటంచు నార్చినన్ భా రా యు. 455

గీ.. లగుడు సాళ్వంబు దేగలోమగను గగ్గు, వేఁట పులుఁగుల విడిచిన వింటికెగసి. యయా. 2 23.

తే వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము, సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేత,యనెడు సప్త వ్యసనములఁ జనదు తగుల భార. ఉద్యో 2 44

2 మేఁకపోతు, దేవతకు బలి యిచ్చుటకై యేర్ప ఱుపఁబడిన మేఁకపోతు.

గీ శశము పిశితంబు పశు మాంసంబు పంది, యామిషము వేఁట పలలంబు నధికమైన, తృప్తి యొనరిచు నొగిఁ బితృదేవతలకు, నెలమి నాలుగు నేను నాఱేడు నెలల. మార్కం. 3. 200

ఉ ...ఈ, వెక్కసి చెంచుసింగముల వేఁటుల వేఁటల తీలఁ ద్రుంచుచున్ చంద్రా. 2 50

మ. కొలిచెం గాటమ రాజులన్ పతులు చేకూర్చెన్ మహా వీర్లకున్, బొలమున్ రాజుల నెంత భక్తి పరతం బూజించె నాగంగకున్, వెలయన్ వేఁటలు బోవమున్ సిడులు గావించెన్ సుతో త్పత్తికై, చెలి యాలాగున నల్ప దైవము కృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్. హంస.291.

3 తగరు పొట్టేలు.

గీ. వేఁట యవ మేష మృగయలు వెలయు చుండు ... ఆం. భా. 3. 58

వేఁటకరి వి (√వేఁట ) వేఁటకాఁడు

క . అధిపుకై పట్టరి బెబ్బులి మహిమ మెలుఁగుఁ గిటిఁ,డెలు మొదలగు వానిఁగొన్నిఁటిని వేఁటకరుల్ మనుచ 4. 50

వేఁటకాఁడు వి. (వేఁట+కాఁడు ) మృగయుఁడు, వేఁటాడువాఁడు.

బ వేఁటకాఱు, వేఁటకాండ్రు, వేఁటకాండ్రురు.

ఆ వె నల్లగ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి, నోరి జింకఁ దివియు నేరుపొదవు, వేఁటకాఁడు నోలె ... ఆము. 4 193

ఆ వేఁటకాఱు ముట్టి వెనుకొనఁగా శ్వేత, వగము చటికిఁ దారు నమిలి వోలె ...

వ. అప్పు డనిలసుతుని వేఁటకాఱులు మాంస భారంబులతోడఁ బరిశ్రాంతులై .. భార శల్య 2. 36.

ఆ. దాని వాడ వారు తవిలి చంపించిరి, కుక్క నంతఁ గనిసి కుక్క వేఁట, కాంద్రు రందఱేఁగి కత సవిస్తా ం ు నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి. కేయూ. 114

విశ. సంహారకుఁడు, వశింపఁ జేయువాఁడు

తే. నిదుర త్రొక్కని బయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగ ముప్పొద్దు మువ్వేసములఁ జెలఁగుచు, వెలుఁగు లెల్లెడఁ గంచుచు నలరు నిర్ల వేఁటకాఁ డప్పుడెంతయుఁ దేటమీఱె. అచ్చ రా అయో. 42

లోకోక్తి - వేఁటకాఁడు మెత్త నగునపుడు లేఁడి మూఁడు కాళ్ళను నడుచుట.

అధికారి యసమర్థుఁడైన సేవకులు స్వేచ్ఛగాఁ బ్రవర్తింతురనుట.

తే. పౌరుషంబున దురకలఁ బాఱఁదఱుము, వేఁట కాఁడిల మెత్తనౌ వేళ లేడి, మూఁడు కాళ్ళను నడుచు నిర్నూలితాంహ .. సిం వార శ 9

**వేఁటకుక్క** వి. (వేఁట + కుక్క) వేఁటాడుటయందు నేర్పుగల కుక్క, విశ్వ కద్రువు (శ ర., బ్రౌ.)

**వేఁటగిరి** వి. (√ వేఁట) వేఁటాడి జీవించెడి బోయె, వ్యాధుఁడు.

క. ... వేఁటగిరుల్ వేఁటకరుల్, వేఁటమరుల్ దొంకు విడివడి యఁతన్. రా. వి 3 57 (శ. ర. పా)

(వేటిసిరు శ్రీటకరుల్, వేఁటమరుల్ దొరకుఁ గొలువ నిడివడి యఁతన్ ముద్రి పా.

**వేఁటచాళ్లు** వి ఒక దినును వస్త్రములు

సీ. సంపంగి కావులు చందురు కావులు కెలివట్టు జీబులు వేఁటచాళ్ళు .. ప్రబంధ 272

వ. వరకంచులును బొమ్మంచులును ముయ్యంచులును వేఁటచాళ్ళును తిందు వన్నెలును సుర వన్నెలును ... ద్వి. శి. 206

**వేఁటపట్టు** వి. (వేఁట + పట్టు,) మృగయాస్థానము, వేఁటాడుచోటు.

చ. తలఁపుల తిట్ట భావముల తావక మావల పుట్టినిల్లు గోర్కుల నెలవీడు వల్వగల కూట మవ స్థల జన్మదేశ ము,మ్మలికల వెంటవేదవలమందు మనోభవు వేఁటపట్టుమూర్ఛల సహావానమన్వి రహా సంతతతాపము వొందెఁ బార్వతిన్ కు. సం. 5 584

**వేఁటపల్లె** వి. (వేఁట + పల్లె) బోయగూడెము, పక్కణము

సీ వింధ్యాద్రి నడుమ నిర్వింధ్యాతటంబునఁ గాసలో నొక్క పక్కణము గలదు, పింగాతుఁ డనియెడు పేరివాఁడా వేఁట పల్లె యేలెడు భిల్ల పరివృఢుండు . కాశీ, 4 60

**వేఁటపిట్ట** వి (వేఁట + పిట్ట) దీమపు పిట్ట,పతులను పట్టుకొనుటకై వేఁటగానిచేఁ బెంపబడు పక్షి. (శ ర,)

**వేఁటమ్ముల** వి (వేఁట + అమ్ముల) వేఁటకుఁ బనికివచ్చు బాణము

సీ కంగు కఁగునవేలఁ గ్రైదప్పుగాఁ బడువేఁటమ్ముల లేఱక దాఁటిదాఁటి . మనుచ 4 103

**వేఁటయిట్టి** వి. (వేఁట + ఇట్టి.) ఇట్టులను వేఁటాడుటకై పెంచఁబడిన యిట్టి. (లేడి)

గీ కొమ్ముటురులఁ గాలి గుండులు చిలుమోర, లఱుత గవ్వదండ లలఁతిగంట, లమరసారెఁ బెదవు లల్లార్చి గురగుర, మనుచు వేఁట యిట్టు లరుగుదెంచె. చంద్ర. 2 22.

**వేఁటరి** వి (వేఁట + అరి[3]) వేఁటకాఁడు.

చ నృపాల నందనుం, డలరుచు వేఁటకై చన రయంబున వేఁటరు లెల్ల నత్తరిన్. ఇందు. 2 57

ఉ. ఆతమగంబుపై నరవరాగ్రణి సమ్ముఖవర్తి మానవ, వ్రాతముతోడ నెక్కి నిడు వాలిక తూఁపులు చాపతండమున్, జేతులఁ బూని వేఁటరులఁ జీరి మృగంబులఁ జోపఁబంపి నిర్భీత కిరాతులన్ వలల గ్రేవల గొందలనిల్పెఁ జాలవిగన్. చిత్రభా 3. 137.

**వేఁటలాడు = వేఁటాడు** స. క్రి (వేఁటలు + అడు)

1 వధించు, చంపు

ఉ ఓ వరవర్య రాముఁ డసురోత్కరమున్ మును వేఁటలాడుచుం, దా నచటన్ వసించుట శ్రుతం బగు రామ వియత్పురంబనన్ ... పరమ 6 74.

2. వయు, (బాణములను) ప్రయోగించు.

తే. అనుదినంబును రాజన పనులమీఁద, వేఁట లాడుచు నున్నాఁడు విషమశరుఁడు నైష. 3 26

**వేఁటలుపట్టు** వ క్రి (√ వేఁట) మేఁకపోతులు పొట్టేళ్లు మొదలగు వానిని బలియిచ్చు

తే గీ తల్లిదండ్రులు దాను నద్వైపమునకుఁ, బ్రణతు లొనరించి వేఁటలుపట్టి పిదపఁ, బక్కణముల లోని శబర దంపతులతోడ, నన్నపానాదు లొనరించు నవసరమున కాళ 3 40

**వేఁటాడు** స. క్రి (వేఁట+ఆడు.) 1 అడవియందు వలలు దీములు మొదలగువాని నొగ్గి మృగములను పక్షులను వధించు

వ పొలంబులన్ బులుఁగులన్ జోపుచు దేగ వేఁట కాండ్రు వేయువడి వేఁటాడన్ దొడంగి రందు మనుచ 4 55.

2. వధించు, సంహరించు.

క మీఁటుగల రాజ రథికుల, నాఁటికి వేవుర వధింతు వరుశరములు నో, నాఁటి పడవైచు వంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబు వీరులనెల్లన్ భార ఉద్యో 4 407

3 పోఁగొట్టు, నశింపఁ జేయు

ఆ వేఁడివేలు పినము వేఁటాడుపోటరి, ప్రొద్దు తూర్పుమలను బొడమె నపుడు...నీలా 3.45

**వేఁడి¹** వి 1 ఉష్ణత, వేఁడిమి

గీ. వేఁడియెల్ల నుడిపి విబుధారి కినుకమై, క్షితి పాత్రుఁ జేసి పీతిహోత్రు నృసిం. 2 118

క వేసవి వేఁడి సహింపక, వేసరు జీవులకు నెల్ల విశ్రాంతికర, శ్రీ సంపాదనకంబై, యాస న్నంబయ్యె వంబుదాగమ మంతన్ విక్ర 4 96

తే...కందువాఁల నిట్టూర్పు గాడ్పు వేఁడి, ముకు రములు చారు మోహనమూర్తి యనఁగ, బరఁగు దమయంతిచేతి దర్పణము దక్కు. నైష 1.70

2 సంతాపము, విరహ సంతాపము

సీ.. తన పరిపాలనంబున బరమసుఖులఁ,

ఆ గానొనర్చువాఁడు గా నప్పగించిన, వాఁడ నేను మీకు వేఁడి దాఁకు,నట్లుగాఁ జరింప(ను) .. భార. అశ్వ. 1. 93,

గీ కుచ్చితం బింత యొలుఁగద మ్మచ్చెకంటి, కంటి విఖ్యాతి నాతిఁగైకొంటి వనుచు, నచటి జూట లువనగొంటు లతని వేఁడి, వేఁడిమీఁదనె త్రో చిరి వెట్టిరేఁచి జహ్ల 5. 108

3 తేజము, ప్రతాపము

క అపరిమిత మైన నీ యుగ్రపు వేఁడిం బ్రాణు లెల్లఁ గ్రాఁగెడుఁ దేజం, బుపసంహరింపు సృష్టికి, విపరీతము పుట్టకుండ విశ్వమయాత్మా. మార్క 6 84.

చ దనుజ బలంబుపై వడరి తచ్ఛిఖి వేఁడిన కాన నేర్పు చెన్నున వఱిరేఁగి కాల్పఁగఁ గమంగొని యంతకు మున్నె వచ్చియ,య్యని తెలఁగెల్లఁ జూచు చతురాస్య గిరీశ సురేశ ముఖ్యుల,యిట్టి ననుచు రోష శక్తి నుతియించిరి యొంచిరి రాజ సేంద్రునిన్ ఉ రా 3 355.

క వీఁడే దిలీప భూపతి, వాఁడితనంబుననె కాన వచ్చునె మరుచేఁ, బోఁడిమి యటి యున్నప్పు డె, వేఁడి మెయిం బట్టి తెత్తు వేల్పులు తెగడన్. సుద. 5 6.

4 తీక్ష్ణత

ఆ సప్తహయుఁడు మూర్తి సప్తకంబు ధరించి, కరము వేఁడి మిగులు కరములొప్ప, నదనదీ జలములు నుదధిజలంబులుఁ, బీల్చి జగములెల్లఁ బ్రేల్చుఁ గడఁగి. భార. అర 4. 243

మ తమ భోగార్థ పదార్థ సంతతుల నిత్తన్వంగి కేళీవనిన్, రమణుల్ దానును జూఁటలాడె నిదిగో రాజీవ బాణాయటంచు మదాళివ్రజ కీ కోకిలము లచ్చో హెచ్చు నుచ్చైస్స్వనం, బమరన్ బ్రమోఁగెడి నాఁదదీయ రవమొప్పార రెన్ గడున్ వేఁడిమై ఇందు. 3 73.

విశ 1 వెచ్చనిది, ఉష్ణము

సీ ఉసవోని వేఁడి నిట్టూర్పు గాడుపుల ఒల్వడలఁ గె జిగిమోవి వాడువాఱ .నీలా. ఓ. 88.

ఆ భామలార యిందు నా ముద్దు తనయుండు. వేఁడివేఁడి యనుచు వేఁడివేఁడి, వేఁడి వేఁడి నీటు వెడఁద కాటుక కంటి, కొలుకులందమాటి కొలుకుచుండ పారంగ. 3 79.

2. తీక్ష్ణము, ఉగ్రము.

సీ ఆయుధ ప్రభఁ గాంచి యలంఁగు భీరువుఁబూను
వాఁడి ముమ్మొనముల వేఁడియలుఁగు పాండు
1. 101

గీ చూచి యా దివ్యపురుషుండు నూచు వేఁడి,
చూపులకు జంకెలకుఁ జెంత సుడియ వెఱచి
ఉ. రా 4 11

3 పరుషము, కర్ణకఠోరము.

ఆ ..అట్టిశెట్టి నిన్ని,దినము లట్లు దొడరి పెనఁ
గియు నీచేత, నేఁడు వినఁగ వలసె వేఁడి పలుకు.
భార. భీష్మ 3 177

క....భరతునిఁ బట్టము, నిలుకుం గట్టుటయు రాము
నీరేడబ్దంబులు కానకుఁ బొమ్మనుటయు, నిలు
వేల్పులు పొడిగాఁగ నిల్పె రెండున్

ఉ వేఁడిన వేఁడిమాట నృపవీరుడు సైఁపక కర్ణ
రంధ్రముల్, నూఁడిన భంగిఁ దాఁకుటయు. .
భా. రా. అయో 19.

4. దుఃఖకరము, సంతాపకరము.

చ. అలఘుఁడు వాలి రామ వసుధాధిపు ఘోర
శిలీముఖంబుచే, నిలిగిన వేఁడిమాట వినియెం
తయు నుల్లముఱల్ల నంగఁ గొందలపడి తార
భా. రా కిష్కిం 266

ద్వి. ఎడపక నను విక్రయించి చెల్లింపు, కడఁబడుఁ
గొంతైనఁ గాశికు ఋణము...మదిరాక్షి యీ
వేఁడి మాట నా చెవులఁ, గదియించి పాపంబు
గట్టుకోఁ దగునె ద్వి. హరిశ్చ. ఉత్త. 217

వేఁడి³(డి) వి. (వేఁడు²+ఇ) ఎక్కడ నున్నవాఁడు
(రూ. ఏఁడి, ఏడీ.)

ఉ. పోఁడిగ నెఁదునుం గలఁడు పొమ్మను దానుని
జిహ్వనుండి యో, వేఁడి రమావిభుం డనెడి
వీఁకఁడి దైత్యుని దృష్టి నుండియో, వాఁడిది
శ్రేయనింక నని నావిరిఁ గంబమునందు నుండి
యో, బాఁదటు లుద్భవించుట యనందగు
సర్వగతాత్ముఁడల్పుఁడే. భోజరా 174.

ఎ గీ. పాదఘట్టన మేదినీ భాగమగల, గంద్ర
గొడ్డలి భుజమున గ్రాలవేఁడి, వేఁడి రాముఁ
డటంచును విలయరుద్ర రౌద్రముల వచ్చె
భార్గవ రాముఁడపుడు దశా. 7 298.

క. పార్థుఁడు వేఁడి పొదువుఁడుఁ, జార్థుఁడయెట
పోయెదింకఁ జార్థుఁడ రావే...భార ద్రోణ.
3. 46.

ఆ అచటి జనులనడిగె నయ్యో వేఁడియని,గద్దిక
నెలుంగు గడలు కొవఁగ ... భార. ఆశ్ర.
2 31.

వేఁడించు స క్రి (√వేఁడు) వేఁడఁజేయు, ప్రార్థించు
నట్లు చేయు

సీ ..గీ ప ఘనునినైన వేఁడించు నీకుభాంగి, తనువు
బంగార మేమొ యే ధన్యునైన, మరులుఁ
జెందించు నిధి మరు మాయయేమొ, యనుచుఁ
జూచిన జనములు వినుతిసేయు బిల్హ 1 53.

వేఁడికంటి వి (వేఁడి+కన్ను) శివుఁడు, ఉగ్రా
క్షుఁడు

ఉ తొంగలి పువ్వుఁ దేనియలఁ దూకొని మత్తిలి
తుమ్మెదల్ పయిన్, బొంగుచు ద్రావ నొప్పె
సఁగు పూచిన పొన్నఁ గడంగి కాంచి మున్,
మ్రింగిన యా విసంబు వెనమీఁదికిఁ బిచ్చిలు
వేఁడి కంటి యా, జంగమటంచు మ్రొక్కెనొక
చాన నెలంతలు చూచి నవ్వఁగన్. యయా.
415

వేఁడి(డు)కొను స క్రి (వేఁడు+కొను -స్వార్థ
మున.) 1 యాచించు

క వేఁడికొని కృపణులై కమ,పోఁడిమి యడియేల
రాజపుత్రులు దమమై, వాఁడిమి దప్పిన
నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు వినియులుకు
దురే భార ఉద్యో 3 197

2 ప్రార్థించు

తే వేఁడికొనియొదఁ జికురాకు బోఁడినిన్ను ...
నైష. 3. 129

సీ కపురంపు విడెమిచ్చు కలికి ముచ్చటవిన
వేడ్కయై మాటాడ వేఁడుకొనుచు . ఉ రా.
4 48

వేఁడికోలు వి. (√ వేఁడుకొను) యాచించుట

మత్త వేఁడు రెంతయుఁ గష్టమైనను వేఱులేని
సుహృజ్జనున్, వేఁడికోలుచితంబు కావున
వేడ్కతోఁ జని సోమకున్, వేఁడినన్ ... భార
ఆది 5. 218

వేఁడిమి వి (√ వేఁడి) 1 ఉష్ణత, తాపము.

క ... రాజపుత్త్రిలు దమమై, వాఁడిమి దప్పిన
నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు వినియులు
కుదురే భార. ఉద్యో 3 197.

చ విలయకృశానుకీలములు వేడిమిఁ బోఁడిమి మారి మనుచ. 2 10.

2 సంతాపము

క . ఏ, నేఁడు వధింతును నెవ్వగ, వేఁడిమి బడఁజాల కొక్క వెగపు దలఁచితిన్. భార. సౌప్తి 1 50

3 ప్రతాపము,

క. వీఁడొక్కఁడు కురుబలంబున, వాకి మగండ నంగఁ జాలు వాఁడబ్బంగిం, బోఁడిమి సెకియెదు ద్రోణుల, వేఁడిమి యిట మనకు మునుము విక్రమమునకున్ భార విరా 5 110

ఉ ... నీ, వేఁడిమిచూపి యూథపుల విత్తఁగం దునుమాడి .. భా రా యుద్ధ 733

4 తీక్ష్ణత, కఱకుఁదనము

క వేఁడి బ్రాహ్మణుదేశం, బోఁడిమి సెకియేను జిక్క పోవకయుండన్, వేఁడిమి మెఱయు శరంబుల, వాడిమి సొంపెల్లఁ జూపవలయుం జుమ్మీ భార ద్రోణ 1 239

5. చుఱుకుఁదనము

ఉ ... నీ, వేఁడిమి సూపి రూపడంపు వీరిఁ బురందర పుత్త్రి యంతతో, బోఁడిమి మాలు నాతఁడు ప్రభూత జయోన్నతి నిల్పు నీ కడన్ భార కర్ణ 1 68

క మూఁడవ విల్లెత్త నదియుఁ, బోఁడిమి చెడిపోవ నసుర పాలుపరి యలుకన్. వాఁడిమి యొసఁగఁగ నాక గద, వేఁడిమితోఁ వైచె వృష్ణి విభుసతి మీఁదన్. హరి. ఉ 4. 157

విణ కఠినము

ద్వి వేఁడిమి హృదయ మీవిప్రున కెపుడు, వీఁడు కొండికవాఁడు విపిన భూములకుఁ, గనికరింపక పంపఁగా నెట్లువచ్చు, ననఁ కృపాహీనుఁడై నిన్నుఁ బంపె ద్వి హరిశ్చ ఉత్త 1861. పం

**వేఁడిమికన్దొర** వి (వేఁడిమి+కన్ను+దొర,) శివుఁడు, ఉగ్రాక్షుఁడు

క. ఈఁడుల రాయఁడ విను మి, వ్వాఁడిమగల్గ యయ్యమువకు వచ్చినచో న,వ్వేఁడిమి కన్దొర నైనన్, బోఁడిమితో గెలుచుటకును బోలుదురు సుమీ. అచ్చ రా కిష్కిం 75,

**వేఁడివెలుఁగు** వి (వేఁడి+వెలుఁగు) ఉష్ణకిరణుఁడు, సూర్యుఁడు

ఉ వేఁడిననట్లకాక పృథివిం జిరకాల మభీష్ట సౌఖ్యముల్, పోఁడిగ మీరు గాంచి మఱి పొందుఁడు మద్గతియంచుఁ జెప్పియున్, వేఁడి వెలుఁగు లోలిఁ బదివేల సహస్రములున్న భంగి నెవ్వాఁడు వెలుంగునట్టి బుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూర్తియై భోజ రా 351.

క కడకడలి వేఁడి వెలుంగను, జడదారి వడి న్నునుంగఁ జని జేగురు ప,చ్చడ మాఱఁగట్టె దరి నసఁ, బడమట నెఱసంజనించె బలువుగ మఱియున్ యయా 3. 69

**వేఁడివేలుపు(ల్పు)** వి (వేఁడి+వేలుపు) 1. ఉష్ణకరుఁడు, సూర్యుఁడు

ద్వి వేఁడివేలుపుడిగి వెచ్చిద్వీపంబు, నీఁడేర్చు రీతి నింతింతనరాని, పటురౌద్ర రేఖ చొప్పడ... ద్వి హరిశ్చ పూ. 1157

ఆ వె తొగల యెకురుచుక్క మగురు వేల్పుల యిక్క, జగము విందు తమ్మి మగుదపొందు, కాఁడు వేఁడి వేల్పుగాముల్న యెకిమీఁడు, తూర్పు కొండమీఁదఁ దోఁచెనంత అచ్చ రా. అయో 41.

చ ఉదిరి పసిండి చాయగల యొవ్వల కుప్పలు వేఁడి వేలుపుం, గొదములు దావపావకుని కుఱ్ఱలు చిచ్చుఱకంటి నెచ్చెలుల్ ... వానర వీరు లొక్కటన్, బొదివిరి లంకచుట్టునను భూగగనంబులు నిండ నార్చుచున్. రామా. 7 180.

2. అగ్నిదేవుఁడు, జ్వలనుఁడు

ఉ వేఁడి వేలుపైనా, నొప్పెడు కప్పుఁ ద్రోవ దొం యున్ వలి ప్రక్క హసంతికాచలం, బుప్ప లిలంగురాశముల నొందెడు పాముపిల్ల క్రింద వర్తిల్లున్ సమీర. 2 105.

సీ జేజేయనుచు మ్రొక్కు జేజేల రాయఁడు వేఁడికోలని చూచు వేఁడివేల్పు . దశా 1 238.

గీ. వేఁడివేల్పువ కెనయగు వాఁడి ముల్కి,యొకటి సింగాణిఁ గూర్చి యేయుడుఁ గడంది, మీఱ నదివాని పెన్సొర దూఱచనిన, వల్లతోఁ దోఁగిక్కడు సొమ్మసిల్లి తెలిసి అచ్చ. రా యు. 348.

**వేఁడు**1 స. క్రి (వేణ్డు.) 1 యాచించు.

మ త్త. వేఁడు కొంతయుఁ గష్టమైనను వేఱులేని మహాజనుల్, వేఁడికో లుచితంబ ... భార. ఆది 5. 218.

క పదునాలుగు లోకంబులు, నుదరస్థములుగ జరించు చుండెడు లక్ష్మి, హృదయేశుఁడు నిను వేఁడఁగ, బ్రదికితి నీ బ్రదుకు బ్రదుకు బలి భూపాలా విక్ర 2 150.

చ ... నిన్ను దేవతా, విసరము యాచకత్వమున వేఁడఁగ వచ్చుట .. నైష 3 69

2 ప్రార్థించు.

ఉ. వీరకుమార యేను నిను వేఁడెదఁ బ్రార్థన సల్పుమయ్య పెం,పార మఖం బొనరఁగఁ బ్రియంపడి దక్షిణలేమి వచ్చితిన్ ... మార్క. 3. 8.

చ .కొల్వున కేఁగుదెంచి మన్ననఁ బ్రజవిన్న పంబులు వినంగదవయ్య నృపాల వేఁడెదన్. విక్ర. 3 44.

గీ. పోయి సేవింప లేకున్న పుణ్యతీర్థ, మహిమ వినుటయు నఖిల కల్మషహరంబ, కాన వేఁడెద వినిన నమ్మౌనివర్యుఁ, డాదరాయుత్త చిత్తుఁ డై యతని కనియె మనుచ 1. 69.

3 కోరు, అడుగు

గీ ఇట్లు ప్రత్యక్షమై నీ యభీష్ట మెద్ది, వేఁడు మిచ్చెద ననిన న ద్విప్రవరుఁడు . విక్ర 3 5

క. వారించి నీకు నెయ్యది, కోరిక యేతెంచినాఁడ గురుదక్షిణ యా, భూరమణ వేఁడు మనుటయు ...ఆము. 3 54

శా...దేహాపి సంజ్ఞావంతుఁడు సఖాంధవుండగుచుని, శ్శంకన్ నమస్వేఁడు వాఁడై ... మనుచ 6. 43.

రగడ. ననలు వేఁడిన మొఱఁగి తప్పుడు నాలి నాలి కుచంబు ముట్టకు...పారి 4. 16.

4 తలఁచు

ఆ. ఎక్కడైన రవము నసకంపు టుబ్బున, బొదలు చున్నవారు ముదముకతన, సెదికి తమ్ము నించు కేనియు నెఱుఁగరు, పిరు క్రొవ్వి చావ వేఁడి రకట. భార. ద్రో. 1 265

మ లయకాలంబునఁ బ్రాణి జాతమున నాలస్యం బుమై మ్రింగ వేఁ,డి యుదగ్రోద్ధతిఁ దోఁచు దండధరు మాడ్కిన్ వచ్చు దుర్వార ని. శ్చయు నా శాత్రవుఁ జూచి...పారి. ఉ 1 151

క వెదకి కానక వాఁడు నా హృదయ మెఱుఁగ, వేఁడి డాగెనొ యని బహిర్వేదిఁ జూచి ... శుక. 3 305.

**వేఁడు**2 వ ఎవఁడు. (బ వేరు )

గీ నిలిచి చారుల రావించి యిలయు దివియు, ముంచు కపివీరసేనల మించు గాంచి, వీరిలో ముఖ్యు లెవ్వారు వేఁడు రాముఁ,డతని యను జన్ముఁ డెట్టివాఁడనుచుఁ బలుక రామా. 3 193. (శ. ర )

ద్వి సారంగధర నీవు చ,క్కఁదనంబు, వేరికిఁ దగు వని ప్రియము లాడుచును ... ద్వి శ సా 1. 420 పం.

**వేఁత**=(వేఁత వి √వేయు ) 1 వేయుట

2 దెబ్బ, హాని

మ వసుధాధ్రీ ధృష్ణ ఖాగ్రంబు వేఁ,తకు బిట్టొ ర్చిన గట్టు దా వెలుచునే దంభోళి ధృక్కేళి కిన్ వసు 5 7

3 ఇది కొన్ని ధాతువుల కనుప్రయుక్త మగు చుండును

సీ గడ్డంబు వసనంబుఁ గావించు మంగలి కొఱఁత వెట్టునె తల గొఱిగివేఁత.. రామ శ. 99

**వేఁదుఱిది** విణ. (వేఁదుఱు+ఇది.) వెఱ్ఱిది, పిచ్చి యెత్తినది.

ఉ వా విని పల్కెఁ బంట చెలి నన్నిటు వేఁదుఱి దానిఁ జేసి నీ. వివగ లీ వినోదగతు లెటికిఁ జూపెదు తేటయయ్యొ మృ వి 3 29

**వేఁదుఱు** వి 1. ఉన్మాదము, పిచ్చి

ఉ వేఁదుఱు గొన్న మానవుని వేమఱుగంటియు బిట్టు గాల్చియున్, మోఁదియు నీటఁద్రొక్కి యును మున్గని తీరఁగడంగు వెజ్జ,ల్లేఁ దఁగ నిన్ని చందముల నీతనిఁదీర్చుటకై పెవం గిలిన్ నృసిం 5 12

గీ. విజయ పాలునితోడ నుచితభంగి మాటలాడిన వేఁదురు మానవోపు. విక్ర 3 108

